


# మొసళ్ల ఉత్సవం!

మూడు - పది సంవత్సరాల మధ్య వయసుగల పిల్లలకు సింగ్‌పూర్‌లో అమెరికాకు చెందిన నేషనల్ జియోగ్రాఫిక్ సొసైటీవారు ఏర్పాటుచేసిన మొసళ్ల ఉత్సవం పిల్లలనేకాక, పెద్దలను సహితం అలరిస్తోంది.

అచ్చట అందరినీ ఎక్కువగా ఆకర్షించేది ఫైబర్‌గ్లాస్‌తో రూపొందించబడిన ఓ బ్రహ్మాండమైన మొసలి. దాని పొడవు 11 మీటర్లు. 1.5 మీటర్ల వెడల్పు, 1.8 మీటర్ల ఎత్తు. పిల్లలందరూ ఎంతో ఉత్సాహంతో అచ్చట మొసళ్లను గురించిన క్విజ్ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. మొసళ్ల గురించి ప్రముఖులు చెప్పే సంగతులు ఆశ్చర్యంతో వింటున్నారు.

ఆ ఉత్సవాల్లో పిల్లలకు మొసళ్ల టోపీలు, వాటి పచ్చబొట్లు, అనేక ఆటవస్తువులు లభిస్తున్నాయి. మొసళ్లపై అనేక పరిశోధనలు చేసిన డాక్టర్ సెరినో వాటిగురించి ఎన్నో విషయాలు చెప్పారు. అతిపెద్ద మొసలి 12 మీటర్ల పొడవైనది ప్రాచీనకాలంలో ఉన్నదనీ, అది మన సిటీ బస్ అంత పొడవైనదని ఆయన చెప్పారు. దాని బరువు 2వేల కేజీలు!

# చతుర కతలు

## ఆలస్యం

పరంధామయ్య, వెంకటరామయ్య స్నేహితులు. వాళ్లిద్దరూ చెయ్యని పాపాలు లేవు. కొద్దిగంటలు తేడాతో ఒకరి తర్వాత ఒకరు చనిపోయారు. పరంధామయ్య ఆత్మ చితి మీదనుంచి లేచే సమయానికి వెంకటరామయ్య శవాన్ని శ్మశానానికి తీసుకొచ్చారు.



"త్వరగా వచ్చేయి వెంకట్రామయ్యా, నరకంలో కలుసుకుందాం" అంటూ ఉండగా యమభటులు పరంధామయ్యని లాక్కుపోయి నరకంలో పడేశారు. ఎన్నిరోజులు గడచినా వెంకట్రామయ్య రాలేదు నరకానికి. 'కొంపతీసి స్వర్గానికిగాని తీసుకుపోలేదుకదా పొరపాటున వీడిని' అనుకుని బెంగపడ్డాడు పరంధామయ్య.

ఓ వారంరోజుల తర్వాత నీరసంగా వున్న వెంకట్రామయ్యని నరకానికి తీసుకుని వచ్చి పడేశారు యమభటులు.

"ఏమయింది వెంకట్రామయ్యా? ! ఎందుకింత ఆలస్యం అయింది? " అనడిగాడు పరంధామయ్య.

"ఏంచెప్పను పరంధామయ్యా? ! నే చచ్చే సమయానికే మన ఊళ్లో బోలెడుమంది పాపులు చచ్చారు. అంతమంది ఒకే సమయానికి చచ్చేసరికి గుంపు ఎక్కువై, వైతరణి దగ్గర ట్రాఫిక్ జామ్ అయింది. ఇది చాలక అందరూ ఒకే ఆవుని 50 రూపాయలకి అద్దెకి తీసుకుని దానం ఇవ్వడం జరిగింది. అదే ఆవుని మార్చి మార్చి అందరూ గోదానం ఇవ్వడంతో దాని తోక పట్టుకుని నది దాటడానికి పెద్ద క్యూ తయారై, కుమ్ములాడుకోవలసి వచ్చింది. ఇంతలో మన పక్క రాష్ట్రంవాళ్లు నదిలో ఒకవైపు





భాగం మాది అని గొడవపెట్టి అడ్డుకట్ట వెయ్యడంతో మనవైపు నీళ్లులేక గొడవ సద్దు మణిగేవరకూ ఆవుతోబాటు మేమందరం గట్టుమీదే కాలక్షేపం చెయ్యవలసి వచ్చింది" అని రెండు క్షణాలాగి,

"నువ్వు అదృష్టవంతుడివి పరంధా మయ్యా! కొద్ది గంటలు ముందుగా చచ్చి బతికిపోయావు" అన్నాడు వెంకట్రామయ్య నిట్టూరుస్తూ.

– పి.బి.కె. శ్యామలరావు

---

## చిల్లరమాలక్ష్మి...

అది వైకుంఠం...

విష్ణుమూర్తి కాళ్లు నొక్కుతూన్న 'లక్ష్మి' అకస్మాత్తుగా గట్టిగా నొక్కింది పాదాలని. "అమ్మో" అని విష్ణుమూర్తి "ఏం... దేవి గారు ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు? " అన్నాడు.

"అవును... నా క్లోనింగ్ లక్ష్ముల గురించి ఆలోచిస్తున్నాను" అంది.

"క్లోనింగ్ లక్ష్ములా? ఏమిటబ్బా అవి? " నర్మగర్భంగా ఆలోచిస్తూ అన్నాడు విష్ణు మూర్తి.

"తెలిసి కూడా తెలియనట్లు నటించకండి స్వామీ!"

"ఆ...ఆ...అదే నీ రూపుతో, అచ్చం నీలా వున్న, ఇతర లక్ష్ములేగదా? "

"అవును స్వామీ! సంతానలక్ష్మి, ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, విద్యాలక్ష్మి, సౌభాగ్యలక్ష్మి"

"వీళ్లందర్నీ నీకు చూడాలనిపిస్తోందా? "

"సత్యం... తొందరగా మెసేజ్ ఇచ్చి రప్పించండి స్వామీ!" అంది.

వెంటనే విష్ణుమూర్తి 'మెసేజ్' ఇస్తే దాన్ని అందుకుని అందరూ వచ్చారు. కనులు పండుగ్గావున్న వాళ్లందర్నీ చూసి ఆనందభరితురాలైంది లక్ష్మీదేవి.

"ఏవమ్మా! సంతానలక్ష్మి, అలా లావైపో తున్నావేంటమ్మా!" అంది లక్ష్మి.

"ఏంచేస్తామమ్మా! భూలోకంలో జనాభా సమస్య పెరిగిపోతోంది. అందుకే లావైపో తున్నాను. తండ్రిగారు పిలిచారు కాబట్టి ఇలా వచ్చాను. చెప్పండి, నేను త్వరగా తిరి గివెళ్లిపోవాలి... కుటుంబ నియంత్రణ ఆప రేషన్లు జరుగుతున్నాయి"

"ఏమీలేదమ్మా! నీమీద ప్రేమకొద్దీ నిన్ను చూడాలనిపించింది. అందుకే పిలిపించాను. చూశానుగా, ఇక వెళ్లిరామ్మా... ఆ ఆపరే షన్లేవో త్వరగా జరిగేటట్లు చూడు... అసలే జనాభా పెరిగిపోతున్నది..."

ఆ తర్వాత 'ధాన్యలక్ష్మి' వచ్చింది. "ఏమి టమ్మా!? అలా అయిపోయావ్? "

"ఏంచేస్తానమ్మా! అతివృష్టి లేదా అనా వృష్టి. పనికి ఆహార బియ్యం కింద లారీల్లో అటూ ఇటూ తిప్పుతున్నారు. రాజకీయనా యకులు కొందరు నన్ను దాచేస్తున్నారు... అందుకే ఇలా అయిపోయాను" అంది.

ఆ తర్వాత విద్యాలక్ష్మి వచ్చింది.

ధగధగా మెరుస్తూ నయనానందకరంగా వుందామె. "ఏమ్మా! ఇదివరకు 'డల్'గా వుండేదానివి. ఇప్పుడిలా మెరిసిపోతు న్నావేం? "

"ఇప్పుడు విద్య కమర్షియల్ అయిం దమ్మా. కార్పోరేట్ కాలేజీలు, డొనేషన్ కళా శాలలు వచ్చాయి. సరస్వతి పారిపోయి బ్రహ్మదేవుడి దగ్గరికి వెళ్లిపోయింది. ఇప్పు డున్నది నేనొక్కదాన్నే... విద్యాసరస్వతి కాదు విద్యాలక్ష్మి"

"ఏమ్మా! సౌభాగ్యలక్ష్మి? ! ఇలాగున్నావే మిటి? "

"ఏంచేస్తాను... నా ఖర్మ ఇలా కాలిపో యింది. భూలోకంలో విడాకుల రేటు పెరి గిపోయింది"

"అందరు లక్ష్ములు వచ్చారుకానీ... నా అసలు లక్ష్మేది? "

"ఎవరూ? "

"ఘల్ ఘల్ మనే నా లక్ష్మి. ముద్దుల





మూటగట్టే నా లక్ష్మి"
"ఎవరు దేవీ?"
"ఇంకెవరు... చిల్లర మాలక్ష్మి"
వెంటనే విష్ణుమూర్తి... సెల్‌ఫోన్ చేశారు. మెసేజ్ ఇప్పించారు. అయినా కాని రాలేదు. లక్ష్మీదేవి దిగులుపడిపోయింది.
ఎక్కడుంది నాలక్ష్మి అని మనోవ్యథ పడిపోయింది.
'నారాయణ... నారాయణ' అంటూ నారదులవారొచ్చారు.
"నారదా! ఎక్కణ్ణుంచి వస్తున్నావ్?" విష్ణుమూర్తి ప్రశ్న.
"భూలోకంనుంచి స్వామీ... తీర్థయాత్రలుచేసి వస్తున్నాను. ఏపీ ఎస్ఆర్‌టిసి బస్సుపై... దానిదుంపతెగ... అంతా బాగానే వుందిగాని స్వామీ... బస్సులో ఏ కండక్టర్ టిక్కెట్ కొట్టినా... మిగిలిన చిల్లర ఇవ్వటంలేదు"
"అంటే మా చిల్లర మాలక్ష్మి... ఎక్కడుంది?" లక్ష్మి ఆతృతగా ప్రశ్నించింది.
"ఇంకెక్కడ మాతా? కండక్టర్ల బ్యాగులో..."

డా॥ కె.శివసుబ్బారావు

---

## వేగం పెరిగిన గోదావరి

"అబ్బబ్బ... ఏంటండమ్మగారూ? మీరు కూడా?! అన్నీ సవ్యంగానే జరుగుతాయి. మీరు ఊరికే కంగారుపడకండి" విసుక్కుంటూనే ధైర్యం చెప్తున్నట్టుగా అన్నాడు కుక్ బ్రహ్మానందం.
"నీకేంరా? నీ మతిమరుపు అయ్యగారికీ, నీకూ ఏ బాధాలేదు. ఇక్కడ నేను ఇంత హైరానా పడుతున్నానా. అక్కడ హాల్లో హాయిగా రిమోట్ పట్టుకుని టి.వి. ఛానల్స్‌తో కుస్తీ పడుతున్నారు మీ అయ్యగారు.
"అయ్యో, మరో గంటలో ప్రయాణం వుందన్న ఆలోచనైనా వుందంటావా?" అంది అనంతం హ్యాండ్ కర్చీఫ్స్, నెక్ టైలని సూట్‌కేసులో పెడుతూ.
"ఏమిటీ, ఏదో ప్రయాణం అంటున్నావు. ఇంతకీ ఎవరు వెడుతున్నారు? ఎక్కడికి వెడుతున్నారు?" అంటూ లోపలికి వచ్చారు




ప్రొఫెసరు పరశురాం.

"సరిపోయింది. ఎవరిదీ ప్రయాణం అంటారేమిటండీ? ఆనక గోదావరిలో హైదరాబాదు వెళ్లవలసింది మీరే కదా. యూనివర్సిటీ మీటింగులో ఏవో స్పీచ్‌లూ గట్రా వున్నాయన్నారు కదండీ. ఆ బాపతు కాగితాలూ వగైరా ఏమైనా వుంటే ఇటివ్వండి. సూట్‌కేస్‌లో సర్దుతాను" చిరాగ్గా అంది అనంతం.

"అది కాదోయ్ అమృతం" భయపడుతూనే ఏదో అనబోయారు ప్రొఫెసరు.

ఒక్కసారిగా విరుచుకుపడింది అనంతం. "అమృతం కాదు, నా ఖర్మం. అనంతం అని ఎన్నిసార్లు ఏడ్వాలండీ? " అంటూ.

"అదే, అదే, అమృ... కాదు కాదు అనంతం... అనంతం... అవునూ... గోదావరిలో వెళ్తే హైదరాబాదు వెళ్లమేమో. అంతర్వేది కదా గోదావరి వెళ్లేది." నసుగుతూ అన్నారు ప్రొఫెసర్ పరశురాం.

"గోదావరి అంతర్వేది వెళ్లడమేమిటండీ? గోదావరి ట్రైను హైదరాబాద్ కదా వెళ్లేది" కసురుకుంటున్నట్టుగా అంది అనంతం.

"అవును కదూ, గోదావరి ట్రైను హైదరాబాదుకే వెళ్లేది" ఏదో గుర్తొచ్చినట్టుగా అని "ఇవిగో, ఈ పేపర్లు అవీ జాగ్రత్తగా బాక్స్‌లో పెట్టు. అన్నట్టు ఆమధ్య పుట్టినరోజుకి బ్రహ్మానందం తెచ్చిన సూట్ పెట్టలేకపోయావ్?! అదైతే అందరిలోనూ హుందాగా వుంటుంది" అన్నారు ప్రొఫెసరు.

"హయ్యో... అయ్యగారికి హుందాలు తక్కువొచ్చాయి కాబోలు. అన్నీ సర్దానుకానీ బాక్స్ ట్రైన్‌లో వదిలేసి దిగారుగనక! వెనకాల తేవడానికి బ్రహ్మానందమో, నేనో ఎవరూ వుండము" అంది అనంతం జాగ్రత్త చెప్తూ.

"భలేదానివి భారతీ! ఆమాత్రం జ్ఞాపకం లేకపోతే ప్రొఫెసరునెలా అవుతాను? " అన్నాడు అతి మామూలుగా భార్యపేరు మార్చేసి.

"అదిగో, అదే వద్దంట. పెళ్లాం పేరు గుర్తుపెట్టుకోలేరు కానీ, పెద్ద ప్రొఫెసరు మళ్లీను" ముద్దుగా విసుక్కుంటూ "ఒరేయ్ బ్రహ్మానందం అయ్యగార్ని స్టేషన్లో దింపి రారా" అంటూ పురమాయించింది.

"అయ్యగారూ బండి వచ్చేదాకా వుండేదా? " స్టేషను దగ్గర స్కూటర్ దిగిన ప్రొఫెసర్ని అడిగాడు బ్రహ్మానందం.



"ఎందుకోయ్, ఆమాత్రం ట్రైన్ నేనెక్క లేనా? నువ్వు జాగ్రత్తగా ఇంటికి వెళ్లు" అని చెప్పి సూట్ కేస్‌తో స్టేషన్లో అడుగుపెట్టాడు ప్రొఫెసరు.

తిరిగి ఇంటికి వచ్చిన బ్రహ్మానందానికి వంట పురమాయించి, టీవీలో ఏదో మంచి ప్రోగ్రాం వస్తోంటే చూస్తూ కూర్చుంది అనంతం. పాత సినిమా పాటలు, సన్నివేశాలతో కూర్చిన కార్యక్రమం అది. ఎంతో మనోహరంగా సాగుతోంది. ఉత్సుకతతో చూస్తున్న అనంతం మధ్యలో కాలింగ్ బెల్ మోగడంతో విసుక్కుంటూ లేచి వీధి గదిలోకి వెళ్లింది. అప్పటికే బ్రహ్మానందం వచ్చి తలుపు తీశాడు. ఎదురుగా గుమ్మంలో కన్పించిన ఆకారాన్ని చూసి ఇద్దరూ కొయ్యబారిపోయారు.

చేతిలో సూట్ కేస్‌తో నిలబడి వున్నారు ప్రొఫెసర్ పరశురాం.

"ఇదేమిటండీ, హైదరాబాదు వెళ్లకుండా తిరిగి ఇంటికొచ్చేశారూ?" విస్తుపోతూ అంది అనంతం.

"అవునోయ్ అనం..అ..ఆ..అనంతం! మనదేశంలో రైళ్లు ఇంతచేటు అభివృద్ధినెప్పుడు సాధించాయోయ్?" అన్నారు ప్రొఫెసర్ అనంతం మాటల్ని పట్టించుకోకుండా.

ఏం మాట్లాడుతున్నాడో అర్థంకాని అనంతం అయోమయంగా చూసింది భర్తవంక.

"హైదరాబాదు వెళ్లలేదేమిటంటే... అభివృద్ధీ, గాడిదగుడ్డూ అంటారేమిటి సార్" బ్రహ్మానందం వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

"ప్లాట్ ఫాం మీద గోదావరి ఎక్స్‌ప్రెస్ కనిపించింది. పోర్టర్‌ని పిలిచి "ఇదెక్కడికి వెళ్తుంది?" అనడిగాను. "అర్థగంటలో హైదరాబాదు వెళ్తుంది" అన్నాడు వాడు. అంతే ఒక్కసారిగా బోల్డు ఆశ్చర్యమేసింది.

"ఇందులో ఆశ్చర్యపోవడానికేం వుందయ్యా?" మధ్యలో అడ్డొచ్చి అడిగాడు బ్రహ్మానందం.

"కాకపోతే ఏంటో... అర్థగంటలో హైదరాబాదు వెళ్తుందట. ఆమధ్య నేనూ, మా అమ్మగారూ వెళ్లినపుడు ఇరవై గంటలు పట్టింది. అంత స్పీడుగా వెళ్లే ట్రైనులో వెళ్లాలంటే అమ్మో, భయంవెయ్యదూ? అందుకే ఇంటికొచ్చేశాను" అన్నారు ప్రొఫెసరు పరశురాం.

"సార్..." అంటూ ప్రొఫెసర్ కాళ్లమీద పడిపోయాడు బ్రహ్మానందం.

"అయ్యో నా మగడా!" అంటూ చేతిలోని సూట్ కేస్ అందుకుంది అనంతం.

**– సూరిపండు**

---

## పని గంటలు

చేతిలో సెలవుచీటీతో ఆఫీసరుముందు నించున్నాడు అప్పారావు. ఫైల్లోంచి తలపైకెత్తి చిరాగ్గా చూశాడు ఆఫీసరు.

"సెలవు కావాలి సార్" లీవ్ లెటర్ ముందుకు చాపాడు అప్పారావు.

"ఎందుకు?" అడిగాడు ఆఫీసరు సెలవుచీటీకేసి చూడకుండా.

"మా బామ్మరిది పెళ్లి సార్" గుటకలు మింగుతూ చెప్పాడు.

"ఎన్ని రోజులు?"

"రెండు వారాలు్సార్"

"ఏమిటీ, పెళ్లి రెండు వారాలా?"

"హి..హి..హి.." అని నవ్వి "పెళ్లి ఒక్క రోజే సార్. సెలవు మటుకు రెండువారాలు అవసరం సార్" అన్నాడు అప్పారావు.

"ఏమిటా అవసరం?"

"మా బామ్మర్దికి తల్లీతండ్రి, అత్తామావా, నత్తానావా అన్నీ నేనే సార్. శుభలేఖలు అచ్చువేయడం దగ్గర్నించి అక్షింతలదాకా అన్నీ నేనే చూసుకోవాల్సార్"

ఫైలు మూసి టేబిల్‌మీది పేపర్ వెయిట్‌ని ఒకసారి గిరగిరా తిప్పాడు ఆఫీసరు. అది బొంగరంవలె వేగంగా తిరిగి ఆగిపో





యింది.

అప్పారావుకేసి చూసి " కూర్చో" అన్నాడు ఆఫీసరు.

పేపర్ వెయిట్ కింద చప్పుడు చేయకుండా సెలవుచీటీ దూర్చి కూర్చున్నాడు అప్పారావు.

"అప్పారావ్! నేనొక లెక్క అడుగుతాను. కరక్టుగా చేస్తావా? "

"అడగండి సార్" కుర్చీలో సర్దుకుంటూ

"శనివారం హాఫ్ డే. అంటే ఏడాదికి మరో 26 రోజులు సెలవు"

"..."

"ఇవిగాక గెజిటెడ్ హాలీడేస్, క్యాజువల్ లీవు కలసి మరో 30 రోజులు"

"సరిగ్గా చెప్పార్సార్"

"ఇప్పుడు చెప్పు. అంతా కలిపి ఏడాదిలో నువ్వు పనిచేసేది ఎన్ని రోజులు? "

"122 - (52 + 26 + 30) = 14 రోజు



సంతోషంగా అన్నాడు, బీయెస్సీ మాథ్స్ చదివిన అప్పారావు.

"ఒక సంవత్సరానికి ఎన్ని రోజులు? "

"365 సార్"

"రోజుకి ఎన్ని గంటలు పనిచేస్తున్నావు ఆఫీసులో? "

"8 గంటలు సార్"

"రోజులో మూడోవంతు. అంటే సంవత్సరానికి 122 రోజులు. అంతేనా? "

"కరక్ట్ సార్"

"సంవత్సరానికి ఎన్ని వారాలు? "

"52"

"అంటే 52 ఆదివారాలు సెలవలే. అవునా? "

"ఎస్సార్"

ల్సార్" నోటిలెక్కలు వేసి చూసుకుని చెప్పాడు అప్పారావు.

"సంవత్సరంలో నువ్వు పనిచేసేది 14 రోజులు మాత్రమే. ఇప్పుడు మళ్లీ 14 రోజులు సెలవు కావాలంటున్నావు. అంటే ఒక్కరోజు కూడా ఆఫీసుపని చేసేది లేదన్నమాట. మీ బామ్మరిదిని రిజిష్టర్ పెళ్లి చేసుకోమని చెప్పు. సాక్షి సంతకం పెట్టడానికి ఓ గంట పర్మిషనిస్తాను. వెళ్లి సీట్లో కూర్చో ఫో" అని సెలవు చీటీని వుండగా చుట్టి చెత్తబుట్టలో పడేశాడు ఆఫీసరు.

– జి.సి.జీవి



సంపుటి: 26 ఏప్రిల్ 2003 సంచిక: 3 303వ సంచిక

"భార్యాభర్తల మధ్య అన్యోన్యత, అనురాగం జీవితకాలం నిలబడటం ఒక వరం షాలినీ! అది నీకు దక్కలేదు. నేనైతే దాన్ని స్వయంకృతమనే అంటాను. నీ భర్తకంటే నీకు ఎవరూ ఎక్కువ కాదు. నీ స్నేహితురాలు రేణూ నీ భర్తకి కూడా దగ్గరయి... మీరిద్దరూ కూడా ఆమెను విడిచి వుండలేరన్నట్టు తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంది. మంచో చెడో ఇపుడు ఇంతదూరం వచ్చిన జీవితాన్ని ఇక మార్చుకునే అవకాశం నీకు లేదు. అందుకని..." అంటూ స్నేహితురాలికి ఆమె చెప్పిన విలువైన హితవచనం ఏమిటి?

అత్తమామలు, భర్త, కూతురు, స్నేహితురాలు ఇలా ఎన్నో పాత్రలు ఆమె జీవితాన్ని విభిన్నంగా ప్రభావితం చేసిన తీరుతెన్నులు ఎలాంటివి?

ఆపకుండా చదివించే ఎ. అన్నపూర్ణ రచన 'ఆలంబన' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

## ఎ. అన్నపూర్ణ

# 'ఆలంబన'

ఆ ఇంటికి అధిపతి ఎనభై అయిదేళ్ళ రంగారావుగారేనని ఒక్కచూపుతో ఆయన్ను అంచనా వేసింది షాలిని. అత్తవారిది ఉమ్మడి కుటుంబం. మావగారు శ్రీధరం గారూ, పినమామగారు చక్రధరంగారూ ఆయన కనుసన్నలలోనే వుంటారు. పెళ్ళిలో తెలియలేదుకానీ చక్రధరంగారు ఓ వెన్నెముకలేని మనిషని షాలినికి ఇప్పుడు తెలిసివచ్చింది. రంగారావు తాతగారు కొడుకులిద్దరికీ చెరో వాటా ఇచ్చారు.

ఆ ఇంటికీ ఈ ఇంటికీ మధ్య హాల్లో సింహాసనంలాంటి పడక్కుర్చీలో కూర్చుని, చక్రధరంగారిచేత తెగచాకిరీ చేయించుకుంటాడు.

మామగారు స్కూల్ టీచర్‌గా పనిచేస్తున్నారు. పినమామగారికి చదువు వంటబట్టలేదు. మనిషి బండగా వుంటారు. చూడగానే అర్థంఅవుతుంది వర్తి అమాయకులూ, నోరూ వాయీ లేనివారని. మామగారు శ్రీధరం అచ్చం తండ్రిపోలిక. స్కూల్ టీచర్ కావడంవలన, ట్రాన్స్‌ఫర్‌మీద ఆ చుట్టుపక్కల ఊళ్లు వెడుతుంటారు.

పిల్లల చదువులు పాడవుతాయని పెద్దకోడల్నీ, పిల్లల్నీ తన దగ్గిరే వుంచుకుని మంచి చెడ్డలు చూస్తున్నారు. శ్రీధరంగారు సంపాదనా పరుడని, చదువుకున్నాడనీ ప్రేమగా చూడటం, చక్రధరంగార్ని అమాయకత్వం ఆసరాగా చిన్నచూపు చూడటం షాలినికి తెలియవచ్చింది.

అయితే ఈ విషయాన్ని భర్త సమీర్‌తో అనడానికి అప్పట్లో ధైర్యం చాలలేదు.

సమీర్ ఎంబిఏ చేస్తూండటం వలన షాలిని అత్తవారింట్లోనే వుంటోంది.

షాలిని అత్తగారు మీనాక్షి మహాఘటికురాలు. రంగారావుగార్ని మంచి చేసుకుంది. ఇంటి పనంతా చక్రధరంగారి భార్య పార్వతికి అవలీలగా అప్పగించేసింది. మొత్తం మీద రంగారావుగారి చిన్నకొడుకూ, కోడలూ ఆ ఇంటి పనివాళ్ళుగా స్థిరపడిపోయారు.

ఈ విషయంలో షాలినికి చాలా కోపంగా వుండేది రంగారావ్ తాతగారు కొడుకుల్ని పక్షపాత బుద్ధితో చూస్తారని!

ఓసారి వుండబట్టలేక పార్వతిని అడిగింది, "చిన్నత్తా! తాతగారు మిమ్మల్ని తక్కువ చేస్తారెందుకు? " అని.

"అది మా దురదృష్టం... చినమామకి సంపాదన లేదు కదా? ఆయనిచ్చే ఆస్తి మాకు ఆధారం. గంపెడు సంతానం. వీళ్లం దర్నీ పెంచుకురావాలి. అయినా ఎవరో ఒకరు తాతగారి సదుపాయాలు చూడాలి కదా షాలినీ" అంటూ మాట తప్పించేసింది.

"చిన్నత్తా! మీరిద్దరూ చాలా మంచివాళ్ళు ఎన్ని మాటలన్నా పడి వుంటారు. మీ పిల్లలతో మీకు ఖర్చు ఎక్కువ కాబట్టి, ఎక్కువ ఇవ్వాల్సి వస్తుందనే తాతగారు చిన్నచూపు చూస్తున్నారు. ఏ ఖర్చు వున్నా చినమామకే చెబుతారు. మా అత్తకీ మీకూ తేడా అర్థమైంది" అంది.

"సర్లే! అర్థం అయితే అయిందికానీ, ఈ విషయం ఎవరికీ చెప్పకు" అన్నదావిడ భయంగా.

అంతలో తాతగారి సింహగర్జన వినబడింది, 'చక్రీ ఇటు రా' అంటూ! ఆయన పిలుపు వినగానే ఎక్కడివక్కడ వదిలి ఎదుట హాజరుకావాలి. లేకుంటే కోపం వచ్చేస్తుంది. కోపం వస్తే ఆరోజు భోజనం చేయరన్నమాట.

చక్రధరంగారు పరుగున వెళ్ళి చేతులు కట్టుకుని వినయంగా నిలబడ్డారు.

"చక్రీ తినుబండారాల డబ్బాలన్నీ ఖాళీగా వున్నాయి. చూసి వెంటనే నింపాలని తెలియదా. జ్ఞానంలేని మొద్దు" అంటూ చీవాట్లు వేశారు.

"మరి... మరి చేతిలో డబ్బులేక..." అంటూ నీళ్ళు నమిలాడాయన.

"ఇన్నాళ్ళూ సరిపోయిన డబ్బు, ఈ నెలకి మాత్రమే ఎందుకు తేడా వచ్చిందిరా? "

"పార్వతికి ఆరోగ్యం బాగుండక డాక్టర్

దగ్గరకి వెళ్ళాల్సివచ్చి రెండువందలు ఖర్చవ డంతో..."

"ఈ మాత్రానికి హోమియోవైద్యుడు చాలడా? ఏభై రూపాయలతో సరిపోయేది"

"అలా వాడి చూసినా ప్రయోజనం లేక మరో డాక్టర్ని చూడాల్సివచ్చింది"

"అసలు నాతో చెప్పకుండానే స్వంత పెత్త నాలు చేసేటంత పెద్దవాళ్ళయ్యారా? అంత ధైర్యం ఎలా వచ్చిందిరా చవటాయ్ నీకు?"

చక్రధరం సమాధానం చెప్పలేదు. తప్పు చేసినట్టు తల వంచుకుని అలాగే నిలబ డ్డాడు.

"అలా రాయిలా నిలబడక, అరగంటలో తెచ్చి అన్నీ సర్దు" అంటూ ఇష్టం లేకుండానే కొంత డబ్బు చేతిలో పెట్టాడు.

ఇంట్లో అంతమంది పిల్లలున్నారు. వాళ్ళకి ఏనాడూ గుప్పెడు పెట్టిన పాపాన పోలేదాయన. తనకు మాత్రం లోటు చేసు కోడు. అంతా తనకీ, తనకోసమే. ఈ ఆస్తి తనది... అన్నట్టు ప్రవర్తిస్తుంటే షాలినికి ఆయనపట్ల ఏమాత్రమూ గౌరవం కలగదు. ఒక్క ఈ విషయంలోనే కాదు అన్ని ఖర్చు లకూ ఆయన గుణం బయటపడుతూనే వుంటుంది.

'రేపీ పిల్లలకు చదువు చెప్పించాలి. ఎదిగే పిల్లల అవసరాలు ఎన్నో వుంటాయనే ఆలో చనా, ముందుచూపూ వున్నాయా ఈయ నకు?' అనుకునేది.

పార్వతి మరీ బాధగా తోచినప్పుడు షాలి నికి చెప్పుకునేది. 'చిన్నత్తకోసం నేనేం చేయ గలను?' అనుకునేది షాలిని.

"చిన్నత్తా! ఈసారి తాతగారికి ఎదురు సమాధానం చెప్పండి. ఎన్నాళ్ళు ఇలా ఇబ్బందుల పాలవుతారు?" అనేది ఆవే శంగా.

"మీ చినమామను చూశావుగా. ఇక నా బతుకంతా ఇంతే. చేతకాని మనిషిని చూస్తే అందరికీ లోకువగా వుంటుందమ్మా షాలినీ" అనేవారావిడ.

షాలినికి ఆ విషయం తెలిసినా, ఏం చెప్పాలో తెలిసేదికాదు.

ఓరోజు తాతగారు పార్వతికి కబురు చేశారు. ఏమిటో విషయం అనుకున్నా రంతా. చక్రధరంగారికి నలుగురు కొడు కులు. ఇద్దరు కూతుళ్ళూను. అమ్మాయిలి ద్దరూ పెద్దవాళ్ళు. పదిహేను, పదమూడేళ్ళ వయసు వాళ్ళకి. పెద్దమ్మాయి కమల పదో క్లాసూ, చిన్నమ్మాయి కాత్యాయిని ఏడూ చది వారు.

వాళ్ళిద్దరికీ దూరపు బంధువుల అబ్బాయి లతో పెళ్ళిళ్ళు నిశ్చయించార్ట. పెళ్ళి సరిగ్గా మూడునెల్లు వుంది. పెళ్ళి పన్లకి ఆమాత్రం చాలు. ప్రయత్నాలు మొదలెట్టాలి. అదీ అసలు విషయం.

రాజమండ్రిలో పార్వతి అన్నగారు వున్నాడు. వాళ్ళింట్లో వుంచి కమలను చది వించాలని వుండేదామెకు. కానీ తాతగారు ఒప్పుకోలేదు. 'చదివింది చాలు. ఇంటిపనీ, వంటపనీ నేర్పు చాలు. చదివి ఎవర్ని ఉద్ధ రించాలి?' అంటూ పార్వతి ఆశలపై నీళ్ళు చల్లాడు.

పార్వతి ఏడవడం తప్పితే ఏం చేయలేక పోయింది.

షాలినికో ఆలోచన వచ్చింది. కమలవైపు నుంచి రివల్యూషన్ తీసుకువస్తే ఎలా వుంటుందో చూద్దామనిపించింది. 'కమలా, తాతగారు నిన్ను పిల్చి నీకు పెళ్ళిచేస్తాం ఫలానా అబ్బాయితో! చేసుకుంటావా?' అని అడిగారనుకో. అప్పుడు, 'నాకు పెళ్ళొద్దు చదువుకోవాలనుంద'ని చెప్పు అంటూ బాగా నూరిపోసింది.

ఆ మొద్దు తల్లితోనూ, షాలినితోనూ అలాగే చెబుతానని తల ఊపి తీరా ఆయన ఎదుటపడ్డాక భయంతో వణికిపోయి 'అలాగే చేసుకుంటాన'ని చెప్పేసింది.

చాటుగా వున్న షాలిని ధైర్యంగా రంగారా వుగారి ఎదుటకి వెళ్ళి "కమలా, చదువుకోవా లని వుందని నాతో చెప్పావుకదమ్మా.

ఇప్పుడు తాతగార్ని చూసి భయమెందుకు? "
అంది కమలను సపోర్ట్ చేస్తూ.

షాలినిచ్చిన ధైర్యంతో పదిసార్లు మనసులో రిహార్సలు వేసుకుని, 'పెళ్ళివద్దు తాతగారూ, నేను బాగా చదువుకుంటా' అని చెప్పేసింది ఎలాగో కమల.

అలా అత్తగారింట్లో అదీ తాతగారి ముందు మొదటి విజయాన్ని సాధించింది షాలిని.

రంగారావుగారు కూడా ఎందుకో తగ్గి, "సరే, బియ్యే అవగానే నేను చెప్పినట్టు విని తీరాలి" అనేశారు.

ఈ సంఘటనతో షాలినికి ఆ ఇంట్లో గౌరవం పెరిగింది. మీనాక్షికి మాత్రం ఆ క్రెడిట్ కోడలికే దక్కడం ఇష్టంలేక, "షాలినీ, నీకెందుకు వాళ్ళ ఇంటి గొడవలు? ఇప్పటికి పెద్దాయన ఊరుకుని, నీకేదో విలువిచ్చారనుకుంటున్నావ్ కానీ, ఆయన తల్లో ఏవో పథకాలూ, తీవ్రాలోచనలూ సుళ్ళు తిరుగుతుంటాయ్. చూస్తుండు... ఆయన అనుకున్నది సాధించనిదే నిద్రపోరు" అంటూ షాలినికి వార్నింగ్ ఇచ్చింది.



'అత్తగారి అహం, పెద్దరికం దెబ్బతి న్నాయ్ కాబోలు. పాపం తాతగారు మరీ అనుకున్నంత కఠిసంకాదు' అని, తేలిగ్గా ఆవి డమాటలు కొట్టిపారేసింది షాలిని.

షాలిని కన్నవారిది కలకత్తా. ఒక్కతే సంతానం కావడంతో పదిమందిలో కలిసి వుండాలనిపించేది. ఆమె పుట్టింటివారు అటు ఛాందసభావాలూ, ఇటు నాగరికతా కలగలిపి కొనసాగుతున్న కుటుంబంలో షాలిని చదువు మధ్యలో ఆపుచేసి, మంచి సంబంధమని సమీర్‌కిచ్చి పెళ్ళిచేశారు. షాలినికి పుట్టింట్లో ఆంక్షలు లేవు. తాత గారిలాంటి ఛాందసులూ లేరు.

"షాలూ నిన్ను చూసి చాలారోజులైంది. చూడాలనుందం"టూ అమ్మ ఫోన్ చేస్తే వెళ్ళింది. ఆ వెళ్ళడం వెళ్ళడం మూడు నెల లపాటు కలకత్తాలోనే వుండి, మధ్యలో ఆగిపోయిన చదువు పూర్తి చేయాలను కుంది. సమీర్ ఎటూ పనిమీద కలకత్తా వెళ్లాలి ఇద్దరూ కలిసి తిరిగి రావచ్చుననే ఆలోచనతో

ఓరోజు షాలినీ వాళ్లమ్మగారు అడిగారు, "షాలూ జాయింట్ ఫ్యామిలీలో. ది గ్రేట్ రంగారావుగారి కట్టుబాట్ల మధ్య ఎలావుంది లైఫ్? ఆస్ట్రేలియాలో వున్న అజయ్‌ని కాదని, ఈ సమీర్‌నే చేసుకుంటానని పట్టు బట్టావ్. సమీర్ మంచివాడే అయినా, అతడి కుటుంబం సనాతన ధర్మాలనే మూఢత్వంనుంచి బైటకు రాలేదు. మీ అత్త గారు మీనాక్షిని చూస్తే నాకే భయం అని పించింది. నువ్వెలా నెగ్గుకొస్తున్నావ్? కొత్తలో పదిమందిమధ్యా కలిసి వుండడం బాగానే అనిపించినా, తర్వాత చిరాగ్గా అని పించి వుండవచ్చు అవునా? "

"నువ్వు చెప్పింది చాలావరకూ నిజమే నమ్మా. కానీ వాళ్ళని అలా నాకెందుకు అని వదిలేయడం కాక, మంచిగా మార్చడానికి నేనో అవకాశం తీసుకోవాలనుకున్నాను" అంటూ కమల విషయంలో తను సాధిం చిన విజయాన్ని వివరించి.

"ఇంకా మార్చాల్సినవి చాలా వున్నాయ్. ప్రయత్నిస్తాను. అందులోనూ సక్సెస్ చూస్తాననే నమ్మకం వుందమ్మా. సమీర్ నన్ను ఆ ఇంటినుంచి దూరంగా తీసుకువె ళ్ళాలనే ఆలోచనలో వున్నాడు. నేను అంగీ కరించాలా? అనే సందిగ్ధంలో వున్నాను" ఇలా తల్లీ, కూతురూ మనసువిప్పి మాట్లా డుకున్నారు.

షాలిని పుట్టింటినుంచి వచ్చేసరికి ఇల్లంతా పెళ్ళిసందడితో కళకళలాడిపోతోంది. ఆమెను చూసి అత్తగారు మీనాక్షి విజయగ ర్వంతో నవ్వింది.

"ఏమిటత్తా ఈ సందడి? " అని అడిగితే, "తాతగారి ప్రతాపం ప్రత్యక్షంగా చూడు" అందావిడ.

"అంటే కమలకి పెళ్ళా? "

"కమలా, కాత్యాయినీ... ఇద్దరికీ. ఆయన అనుకున్న సంబంధాలే. నువ్వెటూ ఈరో జుకి వస్తావని తెలుసుకనుక తెలియపర్చ లేదు" అంది మీనాక్షి.

అంతదాకా వచ్చాక షాలిని మాట్లాడగలి గేది ఏముంది? సమీర్ దగ్గర తన ఆక్రో శాన్ని వెల్లడించింది.

"పిచ్చి షాలూ, ఈ ఇంట్లో ఎన్ని అమాను షాలు జరుగుతున్నాయో నీకు తెలియదు. నేను విసిగిపోయాను. అందుకే మనం ఇక్కడ వుండలేం అనేది. ఇప్పుడు నాతో రావ డానికి అభ్యంతరం లేదుగా. నాకీ ఇంట్లో వుండడం అంటేనే చాలా అసహ్యం" అన్నాడు.

సమీర్‌కి షాలిని మనస్తత్వం ఏమిటో అర్థంకాదు. 'ఎవరైనా ఆడపిల్లలు అత్తవా రింట్లో పట్టుమని పదిరోజులుండాలంటేనే చిరాకు పడతారు. అటువంటిది ఈ ఉమ్మడి కుటుంబంలో, తాతగారి నిరంకుశపాలనలో ఏం సుఖపడాలి? ఎవరిని సంస్కరించా లని? ఇది అంత సులువుకాదు. తనంత తాను తెలుసుకోగలగాలి.





'భర్తనంటూ నేనున్నాననీ, ఏకాంతంలోని ఆనందాన్ని పంచుకోవాలని అనిపించదా ఆమెకు? పిన్నీ, బాబాయిలను చూసి జాలి పడచ్చు కానీ స్వసుఖాన్ని వదులుకుంటారా ఎవరైనా? షాలిని జడపదార్థమా?'

ఓసారి సరదాగా అన్నాడు "నువ్విక్కడే వుండిపో. నేను మరో అమ్మాయితో సంసారం సాగిస్తాను" అని. ఒక్క క్షణం ఏదో ఆలోచించి,

"సమీర్! నిజంగా నీకలాంటి ఆలోచనే వుంటే, నేను ఆపగలనా? నావలన నీకు సుఖం లేనపుడు అటువంటి పనికి సిద్ధపడితే నేనేమీ అనుకోను. నీ సంతోషానికి అడ్డురాను. అలాగే నా ఆనందాన్ని నాకు నచ్చిన రీతిలో వెదుక్కుంటాను" అనే షాలిన్ని ఏమీచేయలేక తలపట్టుకున్నాడు సమీర్.

ఆ తర్వాత షాలిని అంతగా ఎవరి విషయాల్లోనూ కల్పించుకోలేదు. ఆలోచిస్తే తను సమీర్‌కి దూరంగా వుండి, ఇక్కడ బావుకునేది ఏముందని భావించింది.

ఇంటి పెద్దననే అహంకారంతో నిరంకుశంగా ప్రవర్తించే రంగారావు తాతగారు, 'కుటుంబాన్ని కంట్రోల్లో వుంచుకున్నాను' అని సంతృప్తి పడుతున్నారేమోకానీ, ప్రేమాభిమానాల్నీ, గౌరవాన్ని కోల్పోయినట్లు అర్థం చేసుకోవడంలేదు. ఎప్పుడైతే ఒక వ్యక్తిమీద భయం ఏర్పడిందో అక్కడ ప్రేమ వుండదు.

తనంటే అంతా భయపడాలి. పాదాక్రాంతులై, తన చెప్పుచేతల్లో వుండాలని భావించేవారికి ఆత్మీయులంటూ వుండరు సరికదా ద్వేషించేవారు ఎక్కువవుతారు. కొడుకులు ఆయన కనుసన్నలలో వుంటున్నారంటే వారికి మరో మార్గంలేదు.

శ్రీధరంగారికి అయిదుగురు సంతానం. చక్రధరంగారికి ఆరుగురు. వీరినందర్నీ పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పించి వారికో దారి చూపించాలి. పెద్దమోతుబరులా అంటే, ఉమ్మడి ఆస్తి పదెకరాల్లో ఇంటి ఖర్చుకు సరిపోయే అపరాలు పండుతాయి. వరి పండుతుంది. పెద్దాయన రంగారావుగారు తనవరకూ సుఖంగా గడిపేస్తారు. తర్వాత ఇబ్బందులు ఎదుర్కొనేది కొడుకులూ, మనవలూను. చదువు, పెద్దగా ఉద్యోగాలూ, సంపాదనాలేని శ్రీధరం, చక్రధరంగార్ల పిల్లల అవసరాలు తీర్చడం జరగనిపని.

ముందుచూపు లేకుండా, కుటుంబ నియంత్రణ పద్ధతులు పాటించక సమస్యలు కొని తెచ్చుకున్నారు. కుటుంబ నియంత్రణ పాటించమనీ, పరిమిత సంతానం ప్రగతికి సోపానమని, ఒక్కరూలేక ఇద్దరు చాలని, తల్లి ఆరోగ్యానికి, తండ్రి ఆర్థిక భారానికి మిత సంతానమే మార్గమనీ తెలిసికూడా నిర్లక్ష్యం, అలసత్వం చూపిస్తూ, సమస్యల పాలపడ్డప్పుడు, దిక్కుతోచక, వేరేదారిలేక అష్టకష్టాలు పడే ప్రజానీకం, చదువుండీ కళ్ళారా చూస్తూ కూడా 'ఈరోజు గడిచింది' అనే తత్వానికి అలవాటు పడిపోయారే కానీ, ప్రభుత్వం భయపెట్టి, బతిమాలి, ఆక్రోశించి ఎన్నో విధానాలు అమలుచేస్తున్నా కొందరిలో మార్పు కనిపించడమేలేదు.

తల్లితండ్రులేకాదు. బంధువర్గాల్లో కూడా పరిమిత సంతానాన్ని మించి లేకపోవడంతో షాలినికి ఇటువంటి ఆర్థికపరమైన స్థితిగతులు తెలియవు.

ఏవో ఆలోచనల్లో మునిగిపోయిన షాలినికి హఠాత్తుగా చక్రధరం వాటాలోనుంచి పార్వతి ఏడుపులూ, ఏవో శబ్దాలూ వినిపించి ఒక్క ఉదుటున లేచి అటు వెళ్ళబోయింది. "షాలినీ నీకెందుకు వారి గొడవ? ఇవన్నీ మా ఇంట మామూలే. భార్యాభర్తలమధ్య పోట్లాటల్లోకి మనం వెళ్ళకూడదు" అంది మీనాక్షి వారిస్తూ.

కొద్దిసేపు వేచి చూసింది షాలిని. కానీ రానురానూ గొడవ మరీ ఎక్కువగా వినిపించి, వెళ్ళకుండా ఆగలేకపోయింది. ఆ





సచిత్ర విచిత్రం

# ఎగిరే పళ్ళెం

గతంలో ప్రపంచవ్యాప్తంగా ఎగిరే పళ్లాలని చూశామని ఎందరో చెప్పారు. వారి అనుభవాన్ని మరెంతమందో ఖండించారు. ఎగిరే పళ్లాలు లేనేలేవని, అదంతా ఒట్టి కట్టుకథ అని వారన్నారు.

వారి వాదోపవాదాలు అలా వుండగా 1980 వ సంవత్సరంలో డిసెంబరు 27 రాత్రి ఇంగ్లాండులోని సఫోల్క్ చెక్క వంతెన వద్ద ఓ చిత్రమైన సంఘటన జరిగింది. ఆ ప్రదేశంలో రెండల్‌షామ్ అడవి వుంది. హఠాత్తుగా ఆకాశంలో చిత్రమైన మెరుపులు, రకరకాల రంగుల వెలుగులు కనిపించాయి. కాసేపటికి పెద్ద శబ్దంతో ఏదో కింద పడింది. సెక్యూరిటీ గార్డులు హుటాహుటిన అటు వెళ్లారు. ఎగిరే పళ్లెం ఒకటి వెలుగులు విరజిమ్ముతూ, చెట్ల సందుల్లోంచి ఆకాశంలో దూసుకుపోయింది.

అర్ధరాత్రి గడిచాక ఓ బంతివంటి ఎర్రటి ఆకారం గోచరించింది. అది శకలాలుగా విడిపోయింది. మరుసటిరోజు ఉదయం అధికారులు ఆ చుట్టుపక్కల రాత్రి జరిగిన సంఘటన గురించి పరిశోధన జరిపారు. ఆ సమీపంలో ఆ రాత్రి పశువులశాలలో వున్న పశువులు ఎంతో భయపడి తమ మెడలోవున్న తాళ్లను తెంచుకుని ఎటో పరుగులు తీశాయని కొందరు రైతులు చెప్పారు. సెక్యూరిటీ గార్డులు రాత్రి సమయంలో చూసిన ఎగిరే పళ్లెం దిగిన ప్రాంతంలోకి వెళ్లి ఆ అధికారులు పరిశీలించారు. అక్కడ మూడు గీతలు లోతుగా దిగివుండి వారికి కనిపించాయి. బ్రిటీష్ ప్రభుత్వం ఆ సంఘటన యథార్థమేనని ప్రకటించింది.

ఇంట్లో అడుగుపెట్టిన ఆమెకు కళ్ళు తిరిగినంత పనైంది. పార్వతి ఒంటినిండా గాయాలతో, జుట్టుచెదిరి భీభత్సంగా వుంది. చక్రధరం శివాలెత్తినట్టు ఆమెను ఇష్టంవచ్చినట్లు కొడుతున్నాడు. పిల్లలు భయంతో ఏడుస్తున్నారు. తేరుకున్న షాలిని గభాలున పార్వతిని పక్కకు లాగింది. మరో గదిలోకి తీసుకెళ్ళి తలుపులు మూసేసింది.

మంచంమీద పడి హృదయవిదారకంగా ఏడుస్తోంది పార్వతి. ఎంతోసేపు ఊరడించి, ముఖం కడిగి, వేడివేడి కాఫీ ఇచ్చాక కాస్తంత తేరుకుందామె. ఆరాత్రి పార్వతికి తోడుగా వుండిపోయిన షాలినికి ఆనాటి దారుణానికి కారణం వివరించింది పార్వతి.

"షాలూ, ఈ మొగుడితో నేను వేగలేను తల్లీ. ఇన్నేళ్ళూ పిల్లలకోసం ఓర్చుకున్నాను. ఇకమీదట ఎవరి ఖర్మ వారిది. వీళ్ళకోసం దినదినగండంగా, మనసు చంపుకుని బతకడం నా తరంకాదు.

మీ మామ నన్నిలా చిత్రవధ చేయడం ఈరోజు కొత్తకాదు. ఈ మనిషి ప్రయోజకత్వానికి పిల్లల్ని కనడం, నన్నిలా చావబాదడం అనే రెండు పన్లు మాత్రమే చేతనవును. ఎంతో పుణ్యం చేసుకుంటేనే ఈ రకమైన అసమర్థుడైన భర్త దొరుకుతాడు" కసిగా చెబుతోంది పార్వతి.

"ఇలా నిన్ను బాధిస్తుంటే మా అత్త ఎలా వూరుకుంది? అడ్డుపడలేదా?"

"నా బాధ ఆవిడకేం తెలుస్తుందమ్మా? అక్క అదృష్టవంతురాలు. ఆవిడ గీచిన గీటు దాటడు మీ మామ. నేను పుట్టినప్పటినుంచీ నాతోబాటే రకరకాల బాధలూ పుట్టుకొచ్చాయి. పుట్టింట సవతి తల్లి అనాదరణ, పెళ్లయ్యాక అసమర్థుడైన భర్తా, చండశాసనుడైన మామ వేధింపులూను. మరో దురదృష్టం నన్ను ఆదరించిన అత్తగారు ఎంతకాలమో జీవించలేదు. నాకిక దిక్కులేకుండా పోయింది. సమీర్‌కి పెళ్లయి, నువ్వీ ఇంటికి వచ్చాక చిన్నదానినైనా, నా కష్టసుఖాలు అర్థంచేసుకోగల ఆప్తురాలివి లభించావు. సమీర్‌కి నేనంటే చాలా అభిమానం. వాడు పుట్టినప్పుడు మీ అత్తకి జబ్బుచేస్తే సమీర్ ఆలనాపాలనా నేనే చూడాల్సివచ్చింది. అలా నాకు బాగా చేరిక అయ్యాడు. చాలాకాలం నన్ను అమ్మ అనే పిల్చేవాడు. జ్ఞానం వచ్చాక నా కష్టం ఏమిటో తెలుసుకున్నాక, సాధ్యమైనంత ఈ ఇంటిని తప్పించుకుని తిరిగాడు"

"ఇంతకీ అసలు విషయం చెప్పత్తా"

"మీ తాతగారిమీద చెప్పాల్సిరావడం బాధగానే వుంది కానీ ఆయన అసలు స్వరూపం నీకు తెలియాలని చెబుతున్నాను. పెద్దాయన తినడం, మంచానికి అడ్డంపడి నిద్రపోవడం, తిన్నది అరక్క అందరిమీదా పెత్తనం చేయడం చూస్తున్నావుగా. ఇవన్నీ సహించాను షాలినీ. కానీ, తరచుగా పెద్దాయన నువ్వెళ్లి ఫలానా షాపులో 'నాకు కావలసింది తీసుకురా, పార్వతిని కాళ్లు పట్టడానికి పంపించు' అంటూ పురమాయించిన ఆ సేవ వెనకాల కథ వింటే నీకు తాతగారంటే చీదరింపు కలుగుతుంది. 'ఒసేయ్ పార్వతీ! నాన్నకి కాళ్లు పట్టాలి నువ్వెళ్లు. ఆయన నిద్రలేచేసరికి వచ్చేస్తాను' అని, నాకు పురమాయించే మీ మామ ఎంతటి అప్రయోజకుడో ఎలా చెప్పను షాలినీ? 'నేను వెళ్లను. ఆ సేవ నువ్వే చెయ్' అనేదాన్ని. ఈలోగా పెద్దాయన నాలుగుసార్లు పిలిచేవాడు. భోజనం చేసి పాదసేవ చేయించుకుంటేనే నిద్ర పడుతుందట ఆ మహానుభావుడికి. ముసలాయన వేసిన గావుకేకలకి హడలిపోయి, నన్ను బలవంతాన ఆయన గదిలోకి గెంటడం, నేను ఏడుస్తూ బలిపశువులా వెళ్లడం... ఆయన తృప్తిగా నిద్రమత్తులో మునిగాక నేను బయటకి రావడం... ఈ దారుణం విన్నావా షాలినీ? మామగారికి కోడలు కాళ్లుపట్టి సేవ చేయడం ఎంతమాత్రం తప్పుకాదు. అందుకు నాకు అభ్యంతరమూ లేదు. కానీ కానీ... నీతో చెప్పలే



నమ్మా. ఆయన చేసే వికృతచేష్టలు ఎంతో అవమానకరంగా వుంటాయి" పార్వతి మాటలు అర్థమైన షాలినికి నిలువునా కంపరం కలిగింది.

"ఛీ, తాతగారు అలాంటి మనిషా? మామయ్యతో చెప్పకపోయావా అత్తా?"

"ఒక్కసారి కాదు, చాలాసార్లు చెప్పాను షాలినీ. ఆయన ఏమన్నాడో తెలుసా? తప్పించుకోడానికి సాకు చెబుతున్నావంటూ రక్తం కారేలా కొట్టాడు. ఈమధ్య మరీ శృతి మించి ప్రవర్తిస్తే 'నువ్వు మగాడివి కాదురా, అభిమానం లేదు. నీ తండ్రి ఎలాంటివాడో తెలిసికూడా చేతకానివాడివి. నన్ను కొట్టడానికి సిగ్గులేదూ' అని తిరగబడ్డాను ఇలా అయినా అభిమానం తెలిసివస్తుందని. అదీ ఈ గొడవ. పైగా ఏమన్నాడో తెలుసా, 'మా నాన్న మనమీద కోపగిస్తే, మనల్ని పట్టించుకోడు. ఆయన ఆస్తిలో వాటా ఇవ్వకుంటే నడివీధిలో అడుక్కోవాలి' అంటూ నీతులు చెప్పాడు. ఇంతటి మూర్ఖుడ్ని ఎక్కడైనా చూశావా?" అంటూ చెప్పుకొచ్చిన పార్వతిని చూసేసరికి షాలినికి ఆమెపట్ల మరింతగా జాలి కలిగింది.

భర్త చేతగానివాడైతే, భార్య పాట్లు ఇలా వుంటాయా? అయినా తాతగారిది క్షమించరాని తప్పేను. కూతురిగా చూడాల్సిన కోడల్ని ఇలా అవమానించడం మనిషి చేసే పనా? షాలిని మనసు మండిపోయింది. ఈ విషయం సమీర్‌తో చెప్పనా? అనుకుంది. చెప్పినా ప్రయోజనం ఏమిటీ, తాతగార్ని నిలదీయలేడుగా. చక్రధరంగార్ని చూసి జాలిపడతాడా, లేదు. ఏమీ చేయడు. పట్టించుకోనని ముందే చెప్పాడుగా!

పార్వతత్త జీవితాంతం ఇలా అవమానాలు పడటమేనా? లేక ఏదో ఒకరోజు విరక్తితో ప్రాణాలు తీసుకుంటుందా? లేదు ఆవిడలా చేయలేదు. పిల్లల్ని అనాథలను చేయలేదు. అలాగే భరిస్తుందంతే అని నిట్టూర్చింది షాలిని.

సమీర్‌కి హైదరాబాదులో ఉద్యోగం వచ్చింది. షాలిని మనస్ఫూర్తిగా భర్తతో చెప్పింది. "సమీర్! మనం ఇక ఎన్నడూ ఈ ఊరు రావద్దు. నువ్వెందుకు ఈ వాతావరణాన్ని, పరిసరాలని అసహ్యించుకుంటావో తెలుసుకున్నాను. అత్తయ్య, మామయ్యలను మన ఇంటికే పిలిపించుకుందాం" అని.

సమీర్, షాలినీ ఆ ఊరు వదిలిపోతుంటే పార్వతి చాలా బాధపడింది. "షాలినీ! ఇంత కాలమూ ఒక ఆప్తురాలిగా, స్నేహంగా వున్నావు" అంటూ కన్నీరు పెట్టుకుంది.

"అత్తా! నన్ను క్షమించు. నీకేవిధంగా సాయం చేయలేకపోయాను. నీ కొడుకుల్లో ఎవరినైనా నాతో పంపించు. చదివించి, చేతనైన విధంగా తీర్చిదిద్దుతాను" అంది షాలిని ఏదోరకంగా పార్వతికి సాయపడాలని.

సుందరం పెద్దవాడు. వాడికీ కొన్ని చిన్న మామయ్య అవలక్షణాలు వచ్చాయి. మిగిలిన ముగ్గురిలో ఎవర్ని పంపిస్తుందో అనుకుంటే, పార్వతి నాలుగోవాడు వంశీమోహన్ని నాలుగుజతల బట్టల్ని తెచ్చి, షాలినికి అప్పగించింది. షాలిని విస్తుపోయింది. ఎందుకంటే అందర్లో ఆఖరివాడు వంశీ అంటే పంచప్రాణాలు చిన్నత్తకి. వాణ్ణి క్షణం వదిలివుండదు, అటువంటిది ఇలా చేయడం ఆశ్చర్యమే.

"చిన్నత్తా! నిజంగా వంశీని తీసికెళ్లనా?" అని అడిగే షాలినితో

"అవును, తీసికెళ్లు. వీణ్ణి వదిలి వుండలేనిమాట నిజమే కానీ వాడు ఈ వాతావరణంలో పెరగడం నాకు ఇష్టంలేదు. ఇక్కడే వుంటే ఎందుకూ పనికిరాడు. అందుకే పంపుతున్నాను. నీకూ వీడంటే చాలా ఇష్టం. నేను ప్రేమను మాత్రం ఇవ్వగలను. నువ్వు ఎన్నో ఇవ్వగలవు. నీ దగ్గరుంటే నాకు నిశ్చింత. నిస్సంకోచంగా తీసికెళ్లు షాలూ" పదేపదే గొంతు రుద్ధమవుతుంటే చెప్పింది పార్వతి.

అలా వంశీ షాలినీ, సమీర్‌లతోపాటు





హైదరాబాదు వెళ్లిపోయాడు. అప్పుడప్పుడు పార్వతిని చూసివస్తూ, బుద్ధిగా చదువుకుని ఇంటర్ పూర్తిచేశాడు వంశీ. వంశీని తీసుకు వెళ్లినందుకు సమీర్‌ని పంపినందుకు కోడల్నీ తిట్టిపోసి యథాప్రకారం రంగారావుగారు గొడవ చేశారు. అయినా పార్వతి భయపడ్లేదు సరికదా 'నేనెవరికీ భయపడను. నాకు మంచిగా తోచింది చేశాను' అంటూ నిష్కర్షగా చెప్పేసింది. 'షాలినీ! ఈ ధైర్యాన్నిచ్చింది నువ్వే. ఇప్పుడు నాకు తోచినట్లు స్వతంత్రంగా వ్యవహరిస్తాను' అంటూ ఈ విషయాలన్నీ ఉత్తరంలో రాసింది షాలినికి.

వంశీని సెలవులకి ఇంటికి పంపినప్పుడు తాతగారు తిరిగి రానీయరేమోనని షాలిని భయపడేది. పార్వతి ఏరకంగా నెగ్గుకొచ్చిందోగాని తిరిగి వచ్చాడు వంశీ.

తాతగారి ఆరోగ్యం బాగాలేదనీ ఇక అవసానదశేనని తెలిసి, చివరిసారిగా చూడటానికి బయలుదేరుతూ "నువ్వు వస్తావా షాలూ?" అన్నాడు సమీర్. చిన్నమామగారికి ఆస్తి ఏమాత్రం న్యాయంగా ఇస్తారో చూడాలని తనూ బయలుదేరింది షాలిని.

రంగారావుగారి పరిస్థితి దారుణంగా వుంది. మాట పడిపోయింది. అన్నీ మంచంలోనే. పడక్కుర్చీ తప్పితే పట్టె మంచం అంటూ కదలని ఆయనకి చివరికి కుర్చీవరకూ కూడా అవసరం లేకుండా, మంచం శాశ్వత స్థానం అయిపోయింది. ఆయన చాకిరీ అంతా యథాప్రకారం చిన్నత్తే చేస్తోంది. మీనాక్షి ఒక్కసారీ తొంగి చూడదు. షాలినీ, సమీర్ వెళ్లిన రెండురోజులకే ఆయన కన్నుమూశాడు.

హమ్మయ్య, చిన్నత్త కష్టాలు తీరాయి అనుకుంది షాలిని. కానీ ఓ సమస్య తీరితే ఏమయిందిః

కాత్యాయని భర్తకి పెళ్లికి ముందునుంచే ఏదో జబ్బుట. అది చెప్పకుండానే పెళ్లిచేశారు. మూడునాళ్ల ముచ్చటగా ఆ వ్యాధి మళ్లీ తిరగబెట్టి కిడ్నీ ఫెయిలయి పోయాడు. ఆ అమ్మాయి జీవితం మోడువారింది. ప్రైవేట్‌గా మెట్రిక్ కట్టించింది షాలిని.

ఇక కమల భర్తకి ఏ జబ్బూ లేదుకానీ పదేళ్ల వయసు తేడా కావడంవలన భార్య మీద అతగాడికి అనుమానం. తనేమో త్వరగా ముసలివాణ్ణి అయిపోతున్నానని బెంగ. ఈ సైకలాజికల్ ఫీలింగ్‌తో కమలని కాల్చుకుతింటాడు అంటూ చెప్పుకొచ్చిన పార్వతితో 'ఆ పెద్దాయన చేసిన నిర్వాకానికి కమల, కాత్యాయినీల జీవితాలు నాశనం అయ్యాయి. పరిహారం మీరనుభవిస్తున్నారు' అంటూ తాతగార్ని దుయ్యబట్టింది షాలిని. చక్రధరం వేళకి తినడం, పెద్దాయన పని కూడా లేదేమో నిద్రపోవడం చేస్తుంటాడు. రోజుకోమాటు పెద్ద పనిమంతుడిలా 'బజారెళ్లి సామాను తెస్తాను, డబ్బూ, సంచులూ ఇయ్యి' అంటాడు తండ్రికి చేసే అలవాటుతో.

"ఏమిటి తెచ్చేది? మీ నాన్న పోతూ చేసిన ఉపకారంగా, ఎందుకూ పనికిరాని రెండెకరాల పత్ర రాసిచ్చాడు మనకి. దాన్ని సాగులోకి తేవడం ఎవరితరం? అమ్మినా కొనే సన్నాసులు ఎవరూ వుండరు. దానమిచ్చినా, వద్దు పొమ్మంటారు" అంటూ పార్వతి విసుక్కుంది మొగుణ్ణి.

అప్పుడుగాని ఆస్తిలో వచ్చిన వాటా సంగతి షాలినికి తెలియలేదు. "అదేమిటత్తా, చివరికి స్థలం అంటూ ఏమీ ఇవ్వనే లేదా? మీకు మిగిలిందల్లా చాకిరీయేనా?"

"అవును. అంతకంటే ఏమిస్తారనుకున్నావ్?"

"అయితే అంత స్థలమూ ఏం చేసినట్టు?"

"ఆయన తన కూతురికీ, మీ మామగారికీ ఇచ్చారు"

"ఇది చాలా అన్యాయం అత్తా. ఆడపిల్లకి ఇవ్వడం సరే. మా మామగారికి ఇవ్వడం ఏమీ బాగాలేదు"

"బాగాలేకపోవడం నీకూ, నాకూను.

ఆయన అహంకారం ఏంటంటే నా సంపా దన నా ఇష్టం అని"

అనుకున్నంతా అయిందన్నమాట. అసలు కన్నతండ్రికి ఇలా బేధాలు వుంటాయా? అమాయకుడు, సంపాదన అంటూ లేని వాడు. అన్నింటికీమించి గొడ్డులా చిన్నకో డలూ, చిన్నకొడుకూ చాకిరీ చేశారే. చివరి వరకూ ఎంత ద్వేషించినా, కని పెట్టివున్నారే అనే ఆలోచన లేకపోయిందా? షాలినికి సమీర్‌మీద బాగా కోపం వచ్చింది. ఎంత సేపూ ఇంటి వాతావరణం, తాతగారి పద్ధ తులూ నచ్చవంటూ దూరంగా తప్పుకుపోవ డమే కానీ, ఒక్కసారి ఆయన్ని నిలదీయ లేదు. తన మాట, తన శాసనం చెల్లితీరా లనే అహం తప్పితే, మంచిగా ప్రవర్తించం డని చెప్పివుంటే మనవలు ఊరుకోరని తన మాట ఎల్లకాలమూ చెల్లదని తను అన్యా యంగా ప్రవర్తించడం తగదనీ, తెలిసి వచ్చేది కదా!

ఇప్పుడిక కాత్యాయినికి ఓ దారి చూపిం చాలి. చదువు కొనసాగించాలి. మెట్రిక్, తర్వాత డిగ్రీ చేయించాలి. లోకజ్ఞానమూ, ధైర్యమూ వస్తుంది. భవిష్యత్‌లో ఏదైనా స్వయం నిర్ణయమూ చేసుకోగలదు అని పార్వతికి చెప్పింది షాలిని.

'కాత్యాయిన్ని మనతో తీసికెడదామా?' అని సమీర్‌ని అడిగి చూసింది.

"షాలూ, వంశీని తీసికెళ్లాంకదా. ఏదో ఒక్కరికంటే చేయగలం. కుటుంబం మొత్తాన్ని ఉద్ధరించాలని ఆదర్శం వల్లిస్తే ఎలా? నీ జాలి, మంచితనంతో నా ప్రాణం తీయకు. ఇంతటితో వదిలెయ్. నువ్వు ప్రతిదాంట్లో కల్పించుకోకు" అంటూ విసుక్కున్నాడు.

పూర్వపు రోజుల్లో అమ్మాయిలకి పెళ్లే ముఖ్యం అనుకుని, ఏదో గంతకి తగ్గ బొంత అనే సిద్ధాంతంతో పెళ్లిచేసి వదిలించుకునే వారు. అదృష్టం బాగుండి, సంపదలతో తులతూగితే, 'అలాటిలాటి సంబంధమా? రాజాలాంటి సంబంధం చేశాం' అని విర్రవీ గడం, కష్టాల్లో మునిగి తేల్తూంటే 'పిల్లల్ని కన్నాం. పెళ్లి చేశాం. అదృష్టాన్ని తెచ్చిపెట్ట గలమా? వారి వారి యోగ్యతనిబట్టి, తల రాతనిబట్టి, జీవితాలు వెళ్లమారతాయి' అంటూ కర్మ సిద్ధాంతాన్ని వల్లించడం చేసే వారు.

షాలినికి ఇలాటివాళ్లని చూస్తే ఒళ్లు మండుతుంది. చేసేది చేసేసి సమర్థించుకో వడం ఒకటీ అనుకునేది.

పార్వతి తరచుగా షాలినికి ఉత్తరాలు రాస్తూంటుంది. 'నిన్ను విసిగిస్తున్నానేమో షాలూ. అన్నీ నీతో చెప్పుకోవడంలో మన శ్శాంతి వుంటుంది' అనేది ఉత్తరాల్లో.

ఒకసారి "కాత్యాయినికి ఎంత ప్రయత్నిం చినా చదువుమీద దృష్టిపోదు. పల్లెటూరు, ఆక్షేపణలెక్కువ. లైబ్రరీకి వెళ్లినా తప్పుగానే వుంటుంది, ఏంచేయాలో" అంటూ రాసింది.

'అత్తా, కాత్యాయినికి భర్త తరఫున ఆస్తి వుందికదా. వేరే ఇల్లు తీసుకుని పట్నంలో వుండచ్చు. అత్తగారు, బావగారు, మరు దులూ అంతా అక్కడే వున్నారు. వాళ్ల పిల్ల లెవర్నైనా చేరదీయచ్చు. తనకి కాలక్షేపం గానూ వుంటుంది. ఈ విషయం ఆలో చించు' అంటూ బదులు రాసింది షాలిని.

నెల్రోజుల తర్వాత 'నువ్వు చెప్పినట్టుగానే వాళ్లత్తగారితో చెప్పినప్పుడు కాత్యాయిని మరిది వచ్చి వదినని వాళ్ల ఊరు తీసికెళ్లా డనీ, ఆ పిల్ల సమస్యకి చక్కని పరిష్కారం చూపించినందుకు నీకు ఎలా కృతజ్ఞత చెప్పాలో తెలియడంలేదు' అంటూ పార్వతి షాలినికి ఉత్తరం రాసింది.

"మంచిదేగా. మనం చెప్పడంవరకూ సరే. ఆచరించిన కాత్యాయిని అత్తవారిదే ఆ మంచితనం" అనుకుంది.

నిజానికి కాత్యాయిని అత్తగారు 'మాతో





పాటు వుండమ్మా అని అడిగారట. అమాయకత్వం, తెలీనితనంతో అమ్మదగ్గరే వుందాం అనుకుంది. ఆ తర్వాత తనవలన పుట్టింటివారికి వచ్చే ఇబ్బందులు గ్రహించుకుని, మరిదిని పంపగానే బయలుదేరి వెళ్లింది.

కాత్యాయిని పెద్ద తోటికోడలికి కేన్సర్. ఆవిడ ఇక ఎంతకాలమో జీవించదని తెలియగానే భర్తని అడిగిందట. కాత్యాయినిని మీరు పెళ్లి చేసుకోవాలని... అత్తమామలు కూడా 'అది సబబుగా వుంటుంది, ఇద్దరి జీవితాలూ కుదుటపడతాయి' అంటూ పెద్ద మనసుతో పట్టుబట్టి పెళ్లి జరిపించారు.

ఈ విషయాలు తెలిసిన షాలినికి చాలా రిలీఫ్‌గా తోచింది. కాత్యాయిని అత్తమామల దాతృత్వానికి చేయెత్తి నమస్కరించింది. కాలానుగుణంగా మనుషులూ మనసులూ మారుతున్నందుకు చాలా ఆనందం కలిగిందామెకు.

ఒకసారి పార్వతికి ఉత్తరం రాస్తూ 'అత్తా! పెద్దాయన ఉన్నంతకాలమూ సనాతన ధర్మాలు, పద్ధతులూ పాటించితీరాలనే భయంతో సమస్యలు మీరే కొని తెచ్చుకున్నారు. ఆయన నిరంకుశత్వానికి భయపడి ఇష్టంలేకున్నా పరిస్థితులకు తలొగ్గారు. తాతగారు పోయాక మీలోనూ తెగింపూ, ధైర్యం వచ్చాయి. ఇందులో నా గొప్పతనం ఏదీ లేదు' అన్నది షాలిని. పార్వతిపట్ల ఆమెకు ఎనలేని జాలి వుండేది. అయితే ఇప్పుడా జాలి చోటులో అత్త మనసులో అంతర్గతంగా వున్న ఆలోచన్లూ, చొరవా చూసినప్పుడు గర్వంగా అనిపించింది.

"ఇప్పుడు అత్త సర్వస్వతంత్రురాలు. ఇక మామయ్యకి ఎవరో ఒకరి నీడలోనే బ్రతికేయడం మొదట్నించీ వున్నదే. వాళ్ల జీవితం మరో మలుపు తిరిగింది కదూ సమీర్" అని భర్తతో అంటే "ఇక వాళ్ల గురించి నువ్వు వర్రీ మానేసినట్టేనా? లేక మరోటి భూతద్దంతో వెదుకుతావా? " సమీర్ హాస్యంగా అంటుంటే హాయిగా నవ్వేసింది షాలిని.



అదేమిటో షాలినికి చుట్టూవున్న ప్రపంచం, ఎదుటివారి జీవితాల్లోనూ అనేక రకాల సమస్యలు కనిపించేవి. ఇది ఆమె మానసిక తత్వం కావచ్చు. కానీ, ఈ తత్వాన్ని మార్చుకోవాలనీ, పూర్తిగా ఎదుటివారి కోసమే తాపత్రయపడి, జీవితకాలాన్ని వెచ్చిస్తే తన జీవితంలో కోల్పోయేవి చాలా వుంటాయని అనుకోకపోవడం వలన తాను కూడా ఒడిదుడుకులకు లోనైంది. ఈ సత్యం ఆమెకు చివర్లో- కానీ తెలియలేదు. పూర్ షాలిని... చాలారోజుల తర్వాత భార్యాభర్తలిద్దరూ తీరికగా మాట్లాడుకున్నారు. "మానసికశాస్త్ర పట్టభద్రురాలా, పరాయివాళ్ల జీవితాల్లోకి పరకాయప్రవేశ కార్యక్రమాన్ని ఉపసంహరించి ఇల్లు, సంసారం, మొగుడూ, శృంగారం అంటూ కొంచెం ఇటు దృష్టి మళ్లించు దేవీ" అన్నాడు సమీర్ మత్తుగా షాలినివైపు చూస్తూ.

"అంటే ఇన్నాళ్లూ నాకీ దృష్టి లేదంటావా సమ్మూ? " ఏదో తప్పు చేసినట్టు తోచిందా

మెకి.

"ఉంది. ఏంలాభమోయ్? నిత్యకృత్యంగా భోజనం, నిద్రా ఎలాగో ఇదీ అంతే అనే దృష్టిలో వుంటావే కానీ, నాకేం కావాలో, ఎలా వుంటే ఇష్టమో గ్రహించినట్టులేదు" తన మనసులో మాట చెప్పాడు సమీర్.

షాలినికి అర్థంకావడానికి కొంతసేపు పట్టింది.

అమ్మానాన్నలకి ఒక్కతే కూతురు. ఆ ఇంట్లో ఆమెకి బాగా గడిచిపోయింది. పెళ్లయి, అత్తవారి జాయింట్ ఫామిలీలోకి అడుగుపెట్టాక, వయసుతో సంబంధంలే కుండా పార్వతికి బాసటగా నిలిచింది. అదో పెద్దరికాన్ని ఆమెకి ఆపాదించినందువలన, ఆ పరిధిలోనే ఆలోచనలు సాగాయి. దాని కి తోడు భర్త చదువుకుంటూ దూరంగా వుండటం, సెలవుల్లో వచ్చినప్పుడు పదిమం దిలో ప్రైవసీ లేకపోవడంతో దాంపత్య జీవి తంలోని మాధుర్యం చవిచూసే అవకాశం ఆమెకి రాలేదు. పూర్వంరోజుల్లో కుటుంబ వ్యవస్థకి ప్రాధాన్యం వుంటే ఈ రోజుల్లో ఏకాంతం, సెక్స్ జీవితం, ఎంటర్‌టైన్ మెంట్, నాది, నా స్వంతం అనే ఒక సర్కి ల్‌లో తమనితాము బంధించుకుంటున్నారు భార్యాభర్తలు.

తన తప్పు తెలిసి వచ్చిందామెకు. అతడ్ని ఆవేశంగా అల్లుకుపోతూ, "అయ్ అగ్రీడ్ విత్‌యు డియర్" అంది.

ఇక సమీర్‌కి కావలసింది ఏమిటో తెల్సు కుని అతనికి సహకరించడం విధి. అను కుంటోందేకానీ దాపరికం లేకుండా చెప్పా లంటే షాలినికి భర్తపట్ల మమకారం అంటూ ఏర్పడలేదు. ఆమెలో స్పందన లేదు. 'ఇతను నా సొంతం. నాక్కావలసి నంత ఫ్రీగా అతనితో వుండచ్చు' అనే ఇష్టం ఏర్పడటంలేదు. మరి ఆమె ఎవరినైనా కోరుకుందా అంటే అందం, చదువు, హోదా గల అజయ్‌ని కాదని సమీర్ వైపు మొగ్గింది. బహుశా పెళ్లినాటికి వయసుకు తగ్గ మెచ్యూరిటీ ఆమెలో లేదు. కొంత కాలం వేచి వుంటే వచ్చేదేమో? అందుకే చాలామంది అరేంజ్డ్ మారేజెస్ చేసుకున్న వారు అతి సామాన్యంగా, యాంత్రిక జీవి తంలో సర్దుకుపోతుంటారు.

షాలిని మనసా, వాచా సమీర్‌కి అంకితం కాలేకున్నా వివాహ వ్యవస్థను అగౌరవ పర చలేదు. ఆమె తన విధిని నిర్వహిస్తూ వచ్చింది. సమీర్ కోరినప్పుడు ఇష్టా అయి ష్టాల ప్రమేయం లేకుండా అనుసరించింది. మెచ్యూరిటీ అనేది వయసుతో కాక అనుభ వాలతో వస్తుందని ఆమె డియరెస్ట్ ఫ్రెండ్ రేణు అంటుంది.

"ముప్పై ఏళ్లు దాటినా రాదంటావా?" అంటుంది షాలిని.

"అందుకు నువ్వే ఉదాహరణ. నీ తర హాయే వేరు"

అది నిజమేకావచ్చు. రేణు నిర్మొహమా టంగా వున్నదే చెప్పింది. ఓసారి సమీర్ అన్నాడు,

"మనకి ఇప్పుడింక పిల్లలుంటే బాగుం టుంది కదూ?"

"ఔను. నేను ఒక్క బాబుని కానీ పాపని కానీ కోరుకుంటాను" అంది షాలిని.

"దటీజ్ యువర్ ఛాయస్" అన్నాడు సమీర్.

అమ్మాయి పుట్టగానే ఏకంగా డెలివరీలోనే ట్యూబెక్టమీ చేయించుకుంది షాలిని.

పాప పేరు గురించి వాళ్లిద్దరూ పెద్దగా ఆలోచించనూలేదు. ముందుగా ప్లాన్ చేయ నూలేదు.

"ఇదెక్కడి అమ్మానాన్నలే తల్లీ... మీరు, నాబోటి వాళ్లైనా సజెస్ట్ చేయకపోతే పాప అనే పేరే స్థిరపడిపోతుంది. ఆ పేరు నేనే పెట్టేస్తాను" అంటూ పాపను ముద్దులా డుతూ, మాకు తుషార జల్లువే నువ్వు అంటూ తుషార పేరును స్థిరం చేసింది రేణు. ఆ పేరే అందరికీ నచ్చేసింది కూడా.

కోడలి విషయం అప్పటికే తెలుసును





కనుక మీనాక్షమ్మ ఏ విషయంలోనూ కలగ చేసుకోలేదు. ఆవిడ పేరు మనవరాలికి పెడతారని ఆశించనూలేదు. తిరుగుబాటు జరగనంత కాలమూ పెద్దవాళ్లు అధికారం చలాయిస్తారు. ఎప్పుడైతే తమ మాట నెగ్గ దని తెలిసిందో తెలివిగా రాజీ పడిపోతారు. అదిగో అలాంటిదే మీనాక్షమ్మ కూడా.

చిన్నారి తుషారను సమీర్, అమ్మమ్మా పెంచారని చెప్పాలి. తల్లిగా షాలిని బెస్ట్ ఫీడింగ్ చేయడం తప్పితే సంరక్షణ అంతా వాళ్లిద్దరే. షాలిని అమ్మగారికి కూతురి గురించి తెలియనిది కాదు కనుక సమీర్ అల్లుడుగా లభించడంతో నిశ్చింతగానే వుంది.

షాలిని పిన్ని కూతురు నందిని వచ్చిందో రోజు. చదువూ, లోకజ్ఞానమూ లేకుండా చేసి, పదహారేళ్లయినా రాకుండా నందినికి పెళ్లి చేశారు. అభం, శుభం ఎరగని నందిని తల్లి అవడం, పుట్టిన బాబుకి సంవత్సరమ యినా కాకుండా నందిని భర్త అనారో గ్యంతో అకస్మాత్తుగా మరణించడం, అప్పుడు నందినికి చదువు చెప్పించి చనిపో యిన భర్త కంపెనీలోనే ఉద్యోగం వేయించి పిన్ని, బాబాయి దగ్గిరే వుంటున్నారని షాలినీ వాళ్లమ్మ చెప్పేది. పెద్దగా పట్టించు కోని షాలినికి, నందిని వచ్చేదాకా ఆ అమ్మాయి గురించిన ఆలోచన రాలేదు.

ఇప్పుడు నందిని తన కొడుకు చదువు గురించి ఈ హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకుందిట. వచ్చిన తర్వాతనే తెలి సింది. తుషార చదివే స్కూల్లోనే బాబుని అడ్మిట్ చేస్తాననీ చెప్పింది. అలా తరచుగా వచ్చి వెడుతూ షాలినికి దగ్గిరయింది. తుషారకీ, వాడికీ రెండేళ్లు తేడా! వాళ్లిద్దరూ ఆడుకోవడానికి, చదువులో పోటీ పడటానికి చక్కగా సరిపోయారు.

"అక్కా, మా ఆఫీస్‌లో ఒకతను నా మీద ఇంట్రస్ట్ చూపిస్తున్నాడు. అతడికి పెళ్లి కాలేదు. నేనీ హైదరాబాద్ వచ్చాక కావా లని తనూ బదిలీ చేయించుకున్నాడు. నీ సలహా ఏమిటో చెప్పు" అంటూ అడిగిందో రోజు.

"నందూ, నీ భర్త తరఫున ఏమైనా ప్రాపర్టీ వచ్చిందా? నీ జీతం ఎంత? నీ వయసెంత? ఈ వివరాలు చెప్పు" అంటూ అడిగి తెల్సుకుని "కొన్ని రోజులపాటు అత గాణ్ణి గమనిద్దాం. నాకోసారి పరిచయం చెయ్. ఆ తర్వాత నా అభిప్రాయమూ, సలహా చెబుతాను" అంది షాలిని.

వెంటనే ఒప్పేసుకుంటుందేమో, తనకు సపోర్ట్ ఇస్తుంది అనుకున్న నందిని కొంతకాలం వేచి చూద్దాం అని షాలిని అనే సరికి ఆమె వదనంలో నిరాశ కొట్టొచ్చినట్టు కనబడింది.

చివరికి ఏమనుకుందో అతగాణ్ణి తీసుకు వచ్చి అక్కకు పరిచయం చేసింది. పరిచ యాలు, పలకరింపులూ అయ్యాక "సుద ర్శన్! మీరు నందినంటే ఇష్టపడుతున్నారని మా సిస్టర్ చెప్పింది. మావైపు నుంచి మీ పెళ్లికి అభ్యంతరం లేదుకాని నందినిపట్ల జాలితో ఆమెను ఇష్టపడుతున్నారా? అందం, వయసూ, ఆకర్షణా కారణంగా క్షణి కావేశంలో తీసుకున్న నిర్ణయమా? లేక మరేదైనా కారణమా? నేనిలా అడగటం మీకు కోపంగా అనిపించచ్చు. మా జాగ్ర త్తలో మేం వుండాలి కనుక అడుగుతు న్నాను... అమ్మాయి ఉద్యోగం వెనకనున్న ఆస్తి మీద భరోసాతో పెళ్లికి సిద్ధపడుతు న్నారా? చెప్పి తీరాలి" అంది పెద్దరికంతో షాలిని.

అనుకోని ప్రశ్నలకు ఉలిక్కిపడి తమా యించుకుని "మేడమ్ మీ సందేహాలు సహే తుకమైనవే. నా నోటితో చెప్పడంకంటే నా బిహేవియరే మీకు జవాబు ఇస్తుంది" అన్నాడు దొరక్కుండా తెలివిగా.

అతనంత త్వరగా బయటపడడని అర్థమై నందినితో ఒంటరిగా వున్నప్పుడు "నందూ! నువ్వతన్ని కాస్త దూరంగా వుంచు. ఏ విష

యంలోనూ తొందరవద్దు సుమా?" అంటూ షాలిని ఇన్‌డైరెక్ట్‌గా చెల్లెల్ని హెచ్చరించింది.

ఇది జరిగిన తర్వాత నందిని అక్కను కలవలేదు. నిజానికి ఈ విషయంలో సుదర్శన్‌కంటే చెల్లికే తన మీద బాగా కోపం వచ్చిందని ఆమె గ్రహించకపోలేదు.

నందిని గురించి తల్లి చెప్పాక షాలిని బాధపడింది. 18 సం.కి పెళ్లి, కొత్త కాపురంలోకి వెంటనే వచ్చి మకాం పెట్టిన అత్తా, ఆడపడుచుల మధ్య భర్తతో చనువు పెంచుకోలేని అశక్తత వెంట వెంటనే అబార్షన్స్, తర్వాత డెలివరీ కాంప్లికేటెడ్ అంటూ అయిదో నెల నుంచీ డెలివరీ అయ్యేదాకా భర్తకు దూరంగా పుట్టింట్లో వుండాల్సి రావడం, బాబు పుట్టాక అతడి అనారోగ్యం, ఇలా దాంపత్య జీవితంలో కోల్పోయిన ఆనందం, అంతలోనే అతడి మరణం, బలవంతాన చదువుపై దృష్టి మళ్లించాల్సి రావడం, అనుభవంలేని ఉద్యోగ నిర్వహణలో అశాంతి, నందిని సుఖపడిందేముంది? తెలిసీ తెలియని వయసులో పెళ్లి తీరని నిరాశను మిగిల్చింది.

ఈ సంఘర్షణకు తోడు సుదర్శన్, నందినిలో ఆశలు రేకెత్తించి ఎండమావుల వంటి కోరికల ఉచ్చు విసిరేడు. సుఖ స్వప్నాల తలుపులు తెరచి భ్రాంతిలో పడేశాడు. ఆ ఒరవడిలో వయసు చేసే అల్లరి తట్టుకోలేక ముందుకు ఉరకాలనే వాంఛతో సతమతమవుతూ, అంతలోనే ఏం నష్టపోవాల్సి వస్తుందో అనే భయంతో నలిగిపోతున్న ఆ అమ్మాయి మనసు అర్థం చేసుకోగలదు షాలిని.

'వయసు చేసే తొందరలు భరించలేకపోతోంది. అందుకు పెళ్లే శరణ్యం అనుకుంటోంది. కానీ ఈ కాలంలో ఎవరు ఏవిధంగావున్నా ఎవరూ పట్టించుకోరని ఈ పిచ్చి పిల్లకు తెలియదా?

మగవాడు గర్ల్ ఫ్రెండ్స్‌తో సంబంధాలు కొనసాగించినట్టే ఆడవాళ్లు బాయ్‌ఫ్రెండ్స్‌తో ఎందుకు సరదాగా వుండరాదూ? మగవాడికి స్వేచ్ఛ న్యాయమే అయితే ఆడవాళ్లకు ఎందుకు న్యాయంకాదు? కొనసాగినంత కాలం, కొనసాగించితే తప్పేముంది? ఇది మానసికమైనది. ఆత్మసాక్షికి తప్పుగా తోచినప్పుడు, మరో రకమైన సమస్యలు ఎదురైనప్పుడు తననుతాను అదుపులో వుంచుకోగల ఆత్మనిగ్రహమూ వస్తుంది. ఇది ఖచ్చితంగా వ్యక్తిగతం' ఇలా ఆలోచిస్తోంది షాలిని, నందిని గురించి.

చాలా రోజుల తర్వాత నందిని వచ్చింది. మనిషి బాగా నీరసించిపోయింది. జబ్బుపడి లేచిన దాన్లా తయారైంది. "అక్కా నువ్వు చెప్పిందే నిజం. సుదర్శన్ అవకాశవాది. నన్ను నా వెనకనున్న రాబడిని, చూసే పరిచయం పెంచుకున్నాడు. నాకు చేయూతనివ్వాలనే మంచితనం ఏకోశానా లేదు. నేను సెక్స్ విషయంలో కండిషన్స్ పెట్టి టైమ్ తీసుకుంటున్నానని కాబోయే భర్తగా, తన కోరిక తీర్చడం లేదనీ, దూరంగా వుంచుతున్నాననే కసితో నాతో మాట్లాడటం మానేశాడు. కాబోయే భర్త అయినప్పుడు తొందర దేనికి చెప్పు. అవసరం తీరాక మొహం చాటేస్తాడన్న అనుమానంతోనే నాకూ అతడిపట్ల వ్యామోహం వున్నా నిగ్రహంగా వుంటూ వచ్చాను.

అక్కా పెళ్లి అనే అబద్ధంతో ఆడవాళ్లను మాయపుచ్చడం ఎందుకో నాకు అర్థం కాదు. ఈ కాలంలో కూడా ఇంకా సెంటిమెంట్స్ పట్టుకునే వున్నారని ఆడవాళ్ల గురించి కొందరి అభిప్రాయం కాబోలు. నీ మాట విని నన్ను నేను రక్షించుకున్నాను. థాంక్స్ అక్కా" అంటున్న నందిని తీవ్రమైన నిరాశా నిస్పృహలతో బేలగా కన్నీళ్లు పెట్టుకుంది.

"నందూ అమ్మాయిల మనసు నాకు తెలుసు. నీ పరిస్థితి అర్థం చేసుకోగలను. సుదర్శన్ ఆకర్షణలో పడి మోసపోతావేమో





నని, హద్దుల్లో వుండమని హెచ్చరించాను. ఇందువల్ల అతడి నైజమూ బైటపడిందికదా! నాకు మగవాడి గురించి బాగా తెలుసు నందినీ. సంపాదనా, శరీరం పంచుకోడానికి సిద్ధపడతాడు తప్పితే బరువు, బాధ్యతలు స్వీకరించడానికి అంగీకరించడు. అందుకే నిన్ను అర్థం చేసుకుని చేయూతనిచ్చి నీ సంతోషాన్ని పంచుకునే ఆప్తమిత్రుడు లభించేవరకూ వేచిచూడు. నా సపోర్ట్ నీకెప్పుడూ వుంటుంది" అంటూ కన్నీరు తుడిచింది షాలిని.

"అక్కా నీ భరోసా చాలు" కొండంత ఆత్మవిశ్వాసంతో చెప్పింది నందిని. రేణూతో నందిని గురించి చెప్పినప్పుడు "హేట్సాఫ్ షాలూ, నీలో మెచ్యూరిటీ లక్షణాలు కనిపిస్తున్నాయ్" అంటూ నవ్వింది.

"మెచ్యూరిటీ ఏమిటే నీ తల కాయ. నాకేం కావాలో, ఎదుటి వారికి ఇవ్వాల్సింది ఏమిటో తెల్సుకోగల ఆలోచన్లు వస్తున్నాయ్ అను"

"అదేలేవోయ్ షాలినీ. నేను చెప్పేది ఏమిటంటే నీలో వ్యక్తిత్వ వికాసం వచ్చిందని"

"అవును రేణూ! రకరకాల వ్యక్తుల జీవితాలే మానసిక విశ్లేషణకు దారి చూపాయి. మంచో చెడో తెలియదు కానీ ఎదుటివాళ్లకు నా వలన ప్రయోజనం చేకూరుతోంది" అంది షాలిని.

★ ★ ★

తుషార పుట్టి పెద్దయ్యేసరికి డబ్బు సంపాదించాలనే యావతో ఇంటిని, షాలినీని, చివరికి తుషారనూ మరచిపోతున్నాడు సమీర్. షాలిని మొదటే అంతంతమాత్రం. కూతుర్ని హాస్టల్‌లో వుంచి చదివిస్తే మంచిదనే అభిప్రాయానికి వచ్చింది. అంటే తల్లిగా మమకారం కూడా లేదా అంటే ఇప్పుడు పిల్లలూ తల్లి చెప్పిన మాటలూ వినడంలేదు. ఎంత చదువుకున్న తల్లినైనా నీకేం తెలీదు మమ్మీ అంటున్నారు పట్టుమని పదిహేనేళ్లు కూడా లేని అమ్మాయిలు కొందరు, అంతా వాళ్లకే తెలిసినట్టు.

తండ్రి బిజీగా వుండటం, పరిసరాల ప్రభావం, సినిమాలూ, అమ్మాయిల్ని ఈ రకంగా తయారు చేస్తున్నాయ్. తల్లిని ఎదిరించడం సులువుగా వుంది. ఏమైనా అంటే నీ చాదస్తంతో ప్రాణం తీస్తున్నావ్. బీపీ వున్నట్టుంది చెక్ చేయించుకో అంటూ హేళన చేస్తున్నారు.

అతిగా పట్టించుకుని ప్రతీ దానికీ ఆంక్షలు పెడుతూ నిరంకుశత్వాన్ని ప్రదర్శిస్తూ ఆత్మీయతా, అనురాగం అంటే అర్థం ఏమిటో మర్చిపోయి 'ఎందుకలా టైమ్ వేస్ట్ చేయడం? ఎప్పుడూ టివి, సినిమాలూ, సరదాలేనా? చదువుకో' అనే వారూ వున్నారు. నిజం చెప్పాలంటే చాలామంది తల్లులూ ఉద్యోగాలు చేయడంవలన ఇంట్లో పిల్లల్ని పట్టించుకునే సమయం వుండటంలేదని, రెసిడెన్షియల్ స్కూల్లోనూ, కాలేజీల్లోనూ చేర్పించేస్తున్నారు. కొంతవరకూ అందువలన ప్రయోజనం వున్నా మమకారాలు మరుగున పడిపోతున్నాయి. ఏం చేయలేని పరిస్థితి.

షాలిని ఉద్యోగం చేయకున్నా తుషారను ఇలా పెంచాలి, ఈ చదువు చదివించాలి అని అనుకోలేదు. మరి కన్నకూతురు పట్ల ఎందుకీ నిరాసక్తత అంటే కొందరు మనుషులంతే మరి. ఎవరైనా షాలినీ, మీ అమ్మాయి బాగోగులు నీకు పట్టవా? అని అడిగితే దానికి స్వేచ్ఛవుంది. వాళ్ల డాడీ కానీ నేను కానీ బలవంతాన ఏదీ నెత్తినరుద్దం అంటుంది.

మరి పట్టించుకోకుండా వదిలేయడం మంచిదా? నువ్వేటూ ఖాళీగానే వుంటావు కదా? అంటే "నా సబ్జెక్ట్ దానికి చెప్పడానికి పనికిరాదు. ఇక ఏం ప్రోత్సహించగలను? వాళ్ల డాడీయా తీరిక లేకుండా వుంటారు. అయినా మా తుషార ఒకరి చేత చెప్పించుకునే స్థాయిలో లేదు" అంటుంది.

నిజం చెప్పాలంటే మనిషిని తీర్చిదిద్దటం





ఒకరి చేతుల్లో వుండదు. వారి కుటుంబ సభ్యుల జీన్స్‌నిబట్టి లక్షణాలు ఏర్పడ తాయి. అందుకేనేమో పూర్వపు రోజుల్లో అటు ఏడు తరాలు, ఇటు ఏడుతరాలు చూసి పెళ్లి చేయాలని భావించేవారు. అప్పట్లో ఉమ్మడి కుటుంబాలు, అధిక సంతానం వలన అవస్థ పడుతూనే కొన్ని సనాతన ధర్మాలను ఆచరించేవారు. విచిత్రం అప్పుడు పెళ్లిళ్లూ అంత కష్టం అవ లేదు.

తుషార హాస్టల్లో వుంటానంటోంది. అని సమీర్‌తో చెప్పడానికి షాలినికి వారం రోజులు పట్టింది.

"అంటే ఇంట్లో వుంటే కాలేజీకి వెళ్లడం కష్టంగా వుందా? "

"చాలా మంది చేరుతున్నార్ట"

"అదే మంచిదిగా తోస్తోంది. లోకజ్ఞానం, కష్టసుఖాలూ తెలిసి వస్తాయ్. అన్నిటికీ మించి నువ్వెటూ తుషార విషయంలో పట్టించుకోవు. అయితే ఒక్క దానివీ లోన్లీ నెస్ ఫీలవుతావేమో" అన్నాడు సమీర్.

"దాని ఇంట్రస్ట్, సదుపాయం చూడాలి కానీ నా మాటకేంలే" అంటూ పదిమందినీ వాకబుచేసి తుషారని బాగా చదివే పిల్లల తోపాటు చేర్పించేసింది. తీరా తుషార హాస్ట ల్‌కి వెడితే ఒంటరితనం ఏమిటో అనుభ వంలోకి వచ్చింది షాలినికి. వెంటనే ఎం.ఏకి ప్రిపేరవసాగింది. అలా చదువులో పడగానే ఇదీ బాగానే వుందనిపించింది. తుషార కూడా కోరుకున్నట్టే మంచి రాంక్ తెచ్చుకుని ఇంజనీరింగ్‌లో చేరింది.

★ ★ ★

ఈమధ్య రేణుని చూసి పెళ్లీ, పిల్లలూ, అంటూ ఏదీ లేకుండా ఒంటరిగా ఎలా వుంటుందా అనిపించేది షాలినికి. అంత లోనే 'పెళ్లి చేసుకున్నందుకు నేను మాత్రం ఏం సుఖంగా వున్నాను? సుఖం అనేది, భర్తతో విహారాలూ, చీరలూ, నగలూ, పిల్లలూ సంసారం అనే వాటిలో వుంటుందా? ఇవేమీ కాక మరో జీవితం...! అంటే రేణూ అనుసరించే జీవితంలో వుంటుందా' అనే ఆలోచన మొదలైంది.

రేణూని చూసిన తర్వాత అసూయగానే వుందామెకు. అలా అని సమీర్ ఆమెకు ఏమీ లోటు చేయలేదు. షాలిని కోరుకున్న అనుభూతి ఎటువంటిది?

రేణూతో తన మనసులోని వెలితిని తెలి యచెప్పింది. "రేణూ, అమ్మావాళ్ళూ చెప్పి నట్టు అజయ్‌ని పెళ్ళి చేసుకుని వుంటే ఎలా వుండేదో. అతణ్ణి కాదని తప్పుచేశానా? "

"షాలినీ, పదిరోజులపాటు నా దగ్గరకి వచ్చి వుండు. సంతోషంగా వుంటుంది" అని రేణూ అనగానే వెళ్ళింది. రెండురోజుల తర్వాత రేణూ అడిగింది. "ఆ నీ బాధేమిటో ఇప్పుడు చెప్పు" అని.

"సమీర్ యాంత్రిక జీవితం నన్ను విసిగి స్తోంది. అతడు కల్పించుకునే ప్రపంచం వేరు. నాకోసం అంటూ అతనేమీ చేయడు"

"తగుదునని, పెళ్ళే పరమార్థంగా, తొంద రపడి, సంసారసాగరంలో దూకేసి, ఇప్పు డేమో, ఏదో అసంతృప్తితో బాధపడుతు న్నావ్. సమీర్‌కి నచ్చినట్టూ వుండలేవు. అలా అని నచ్చినదారేదో నీకు తోచడం లేదు. నీలాంటివారు ఉభయభ్రష్టులు. నీకంటూ వ్యాపకం లేక ఇలా తయారయ్యా వేమో. కాపురానికి వెళ్ళిన కొత్తలో అత్తవా రింటి సమస్యల్ని తీర్చడంలో గడిచిపో యింది. తర్వాత తుషార పెంపకంతో సరి పోయింది. ఇప్పుడింక సమీర్ కావాలని, నీ సమీపంలోనే అతడు వుండాలని కోరుకుం టున్నావు. ఇప్పుడతను మరో వ్యాపకంలో మునిగిపోయాడు.

పిచ్చి షాలూ! లైఫ్ ఎప్పుడూ ఒకేలా వుండదు. వెలుగూ, నీడా వస్తాయి. నీ అనుభవం నాకులేదు. కానీ నేనెప్పుడూ మరో ఆలోచనకు చోటివ్వను. ఒంటరిని కనుక, ఆ అవసరమూలేదు. రాజీపడు షాలినీ. మగవాడు, అందునా సమీర్‌వంటి

ఎగ్జిక్యూటివ్, తన కంపెనీ విస్తరించే ఆలో చన్లు చేస్తాడు. అందుకోసం కష్టపడతాడు. ఇల్లు, భార్య అనేవి ఒక పార్ట్ అవుతుందేకానీ పూర్తిగా అదే ధ్యాసగా వుండడం సాధ్యం కాదు. భార్యగా నువ్వు సహకరించు"

"సమీర్ గురించి నువ్వు చెప్పేది నిజమే. మరి తుషార?"

"తుషార పసిపాప ఏమీకాదు. ఉద్యోగం చేస్తోంది. తన గురించి ఆలోచించుకోగల విజ్ఞురాలు. డోంట్ వర్రీనోయ్" అంటూ షాలినికి సాంత్వన చేకూర్చింది. కొన్నాళ్ళ పాటు రేణూతో గడిపాక ఆమెకు సంతోషంగా అనిపించింది.



**తు**షార రూమ్‌లో ఒక స్లిప్ కనబడింది. "మమ్మీ, నేనూ నా ఫ్రెండ్ మాలా కలిసి వేరే ఫ్లాట్ తీసుకున్నాం. నువ్వు వచ్చాకనే మూవ్ అవాలనుకున్నాను. కానీ వీలుపడ లేదు. ఇప్పుడే వెడుతున్నాను. సండే వస్తాను. తుషార."

డేట్ చూస్తే రేణు ఇంటికి వెళ్ళిన రెండు రోజుల తర్వాతది. 'నా కూతురు చాలా అడ్వాన్స్ అయిపోయింది. వున్న ముగ్గురికీ త్రీ బెడ్‌రూమ్ ఫ్లాట్ ఇరుకైంది. దానికి ప్రైవసీ లేకపోయింది. వేరే వెళ్ళిపోయింది. ఒక్క ఫోన్ కాల్ చేస్తే ఏం పోయిందీ? వచ్చేదాన్ని కాదూ? అసలీపిల్ల పెళ్ళి చేసుకుంటుందా? పెళ్ళి అయిన తర్వాత తన మాటే నెగ్గాలనుకుంటే సాధ్యంకాదు కదా?' అనుకుంది.

సండే తుషార వచ్చినప్పుడు అడిగింది, "తుషారా, వేరే వెళ్ళాలని నీకెందుకు తోచింది?"

"మమ్మీ! నిశ్శబ్దంగా వుండే ఈ ఇంట్లో బోర్ అనిపించింది. నిన్ను చూసి నా ఫ్రెండ్స్ ఇంటికి రారు. నీకు వాళ్ళు రావడం నచ్చదుకదా. ఇప్పుడైతే వాళ్ళకీ, నాకూ కూడా హాపీగా వుంది" అంటుంటే ఏం చెప్పగలదు? మామూలు స్నేహాలా అవి? అబ్బాయిలూ, అమ్మాయిలూ అనే తేడా లేదు. డ్రింక్‌పార్టీలు, జాజ్‌మ్యూజిక్, డాన్స్‌లతో ఇల్లంతా నానా కంగాళీ చేస్తారు. తుషారను మందలించానని కోపం. ఈ కాలం అమ్మాయిలకు తల్లి ఎప్పుడూ చాదస్తం మనిషిలాగానే కనబడుతుంది మరి. తండ్రి ఒకలా, కూతురు ఒకలా. నేనే ఒంటరినైపోయాను. ఒకప్పుడు జాయింట్ ఫ్యామిలీలో పెరిగిన సమీర్ కావాలని బైటకు వచ్చేశాడు. ఫ్రీడం లేదన్నాడు. పెళ్ళయ్యాక ప్రైవసీ పోయిందన్నాడు. మన మధ్యకి ఎవరూ రాకూడదన్నాడు. నువ్వూ, నేనూ మరో లోకంగా విహరించాలన్నాడు.

అంటే... స్వర్గసీమ కూడా కొన్నాళ్ళకు వెగటుగా తోచింది. ఇప్పుడు మరో మార్గంలో ఆనందం వెదుక్కుంటున్నాడా? అతను లేని సమయంలో కంపెనీకి వెళ్ళింది. అక్కడ లోపాలను ఎత్తి చూపిస్తే, 'నీకు ఇటువంటివి తెలియవు. నేను చెప్పినా అర్థంకాదులే! ఎందుకొచ్చిన గొడవా, ఇంట్లో వుండు' అనేశాడు. 'మరి నేను ఎందుకూ పనికిరానా?' అనిపించిందామెకు.

రేణూకి హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అయ్యింది. ఈ కబురు చెప్పగానే, "మా





ఇంట్లో వుండు రేణూ. కంపెనీ నీకు అకామిడేషన్ ఇచ్చినాసరే" అంది సంతోషంగా.

"వద్దు షాలూ. కంపెనీ వర్క్‌మీద చాలామంది కస్టమర్స్ వస్తుంటారు. ఆఫీసర్స్‌తో పార్టీలూ, హంగామా వుంటుంది. నీకు లేనిపోని తలనొప్పి. ఇంట్లో అటువంటివి బాగోవు" అంటూ తిరస్కరించింది.

'నిజమే రేణూకి ప్రైవసీ కావాలికదూ! అది నా ఇంట్లో సాధ్యంకాదు' అనుకుంది. షాలినికి పార్వతి గుర్తొచ్చింది. 'ఆవిడ చేతగాని భర్తతో పాట్లు పడింది. చేతనైన భర్త వుండీ, నేను ఏం సుఖపడ్డానో? కూతురు బిజీ... సమీర్ బిజీ... ఫ్రెండ్ బిజీ నేను ఒక్కదాన్నే ఫ్రీ' అనుకుంది.

మెరుపులా ఒక ఆలోచన వచ్చింది.

'అనాథ శిశుశరణాలయం నడిపితేనో...? రెండు బెడ్‌రూమ్స్ వృథాగా వున్నాయి. అన్ని సదుపాయాలతో విశాలంగా వున్న గదులు అవి!' అనుకుంది. వెంటనే కావలసిన పరికరాలు అమర్చి, పిల్లలకు సదుపాయంగా తయారుచేయించింది. పదిమందీ పోగయ్యారు. దేశంలో అనాథలకేం లోటు? కావలసినంతమంది.

ముఖ్యమంత్రిగారితో కొద్ది పరిచయం వుంది. సమీర్ ద్వారా ఆయనచేత ప్రారంభోత్సవం చేయించింది. ఆయన మనస్ఫూర్తిగా అభినందించారు. తనవంతు సహాయం లక్ష రూపాయలు విరాళం ఇచ్చారు. ఆయన ప్రోత్సాహం షాలినికి కొండంత బలాన్నిచ్చింది. ఇద్దరు ఆయాలు, నలుగురు పనివాళ్ళను కుదిర్చింది. పిల్లల ఆరోగ్యం, పరిశుభ్రత, ఆహారలోపం లేకుండా స్వయంగా పర్యవేక్షిస్తుంది. పీడియాట్రీషియన్ డాక్టర్ నీలిమ సోషల్ సర్వీస్ చేయడానికి ముందుకు వచ్చారు.

చాలా రోజులకి కంపెనీ ట్రిప్‌నుంచి తిరిగివచ్చిన సమీర్, ఈ మార్పు చూసి, మొహం చిట్లించాడు. "ఏమిటీ సంత? " అన్నాడు చిరాగ్గా.

"ప్లీజ్ సమీర్! ఇది నా అభిమతం. కాదనకు. నాకెంతో ఆనందాన్నిచ్చే వ్యాపకం. చేతినిండా పని. మానసికంగా సంతృప్తి. నీకు ఇబ్బంది కలిగించను" అంటూ ఎంతగా చెప్పినా, అతను అప్పటికప్పుడే తనా ఫ్లాట్‌లో వుండలేనంటూ, వేరే ఇండిపెండెంట్ హౌస్ కొనేశాడు.

"ఇలా వేరే వుంటే, నాకు శరణాలయం చూసుకోవడానికి వీలుపడదు. నాకీమాత్రం మనశ్శాంతి వుండనీయవా? "

"నీకు నచ్చకపోయినా, ఇబ్బంది అయినా అక్కడే వుండు"

"అంటే... నీ ఉద్దేశ్యం ఏమిటి? మనం వేరే వుంటామా? "

"ఆ విషయం నిర్ణయించుకోవలసింది నువ్వే. నేను అవుటాఫ్ కంట్రీస్ వెళ్ళి వస్తుంటాను. ఆ టైమ్‌కి నువ్వెవరో పిల్లను చూసుకోవాలి అంటావు. వాళ్ళకి అనారోగ్యం అంటావు. నా మూడ్ అంతా అప్‌సెట్ అవుతుంది. ఇలా దూరంగా వుంటే ఆ గొడవ వుండదు. కావాలంటే మరో నలుగురు ఆయాలను ఏర్పాటుచెయ్" అన్నాడతను.

'ఓ గాడ్. ఎందుకిలా శాసించాలని చూస్తాడు? అతడు వచ్చే టైమ్‌కి, ఇంట్లో వుండాలని తనకు తెలియదూ? అసలు విషయం అతనెవర్నీ భరించలేడు. అతడు తనతో గడిపే సమయంకంటే, విదేశాల్లో వుండే కాలమే ఎక్కువ' అనుకుంది. రేణూ వచ్చినప్పుడు చెప్పింది. "సమీర్‌కి నేనేం చేసినా నచ్చదెందుకు? ప్రోత్సాహం ఇవ్వడు సరికదా చిరాకుపడతాడు. ఈ బంధాలకి అర్థం ఏమిటి రేణూ? "

"షాలూ, నీ దగ్గర నాకు దాపరికం వుండదు. చెబుతున్నాను... నీ గురించి నీకు తెలియడంలేదు. పిల్లలు కావాలని స్త్రీ కోరుకుంటుంది అంటారు. నువ్వు కోరుకోలేదు. సమీర్ గుర్తుచేశాడు. అలాగే తుషా

రను కనడం ఒక భాగంగా అనుకున్నావ్. మీ అమ్మగారు పెంచారు. నువ్వెందుకలా ఎవరికోసమో అన్నట్టు చేశావు? అందుకు ఫలితమే ఇది. సమీర్‌పట్ల నీలో స్పందన లేదు. తుషార నీలో అమ్మను చూళ్ళేదు. పరాయి వాళ్ళమీద నీకున్న జాలీ, దయా, కరుణా, ఇంట్లోవాళ్ళ విషయంలో లేదు. తుషార ఏనాడైతే నీకు కావలసిన అనురాగాన్ని ఇవ్వలేదో, ఆ విలువ నీకు తెలుస్తోంది. ఇది నీ మనస్తత్వం. దీన్ని ఎవరూ మార్చలేరు షాలినీ. ప్రేమానురాగాలు ఇచ్చి పుచ్చుకునేవి. అయాచితంగా లభించవు. అందుకే వాళ్ళిద్దరూ నీకు ఏమీ ఇవ్వలేరు. ఇది వినడానికి బాధగానే వున్నా, జరిగింది ఇదే. అంతేకాదు సమీర్ గురించి ఏవేవో చాలా విన్నాను. నువ్వు గ్రహించలేదూ? "

"ఏం విన్నావ్ రేణూ? " ఆత్రంగా అడిగింది షాలిని.

"అతనికి ఆడవాళ్ళతో సంబంధాలున్నాయని"

"అదంతా వట్టిది రేణూ. నేన్నమ్మను. అతను వర్క్‌హాలిక్. 'ఉమెన్ హాలిక్' మాత్రంకాదు"

"అలా అని నువ్వు భ్రమపడుతున్నావ్. నమ్ముతున్నావ్. ఫారిన్‌ట్రిప్‌లో అతడికి ఎన్నో అవకాశాలు. అందుకే ఎంజాయ్ చేస్తున్నాడు. ఒక్కోసారి ఈ ఊళ్ళో హోటల్‌రూమ్స్‌కి ఆడవాళ్ళు వస్తుంటారు" రేణు బాధగానే చెప్పింది.

షాలిని ఒక్కసారి కూలబడిపోయింది. ఊహించని విఘాతం ఇది. "సారీ షాలినీ, నీకు చెప్పకూడదనే అనుకున్నాను. కానీ ఎవరిద్వారానో నీకు తెలుస్తుంది. అప్పుడెలా ఫీలవుతావోనని, నేనే చెప్పేశాను. నువ్వేమనుకోనంటే చెబుతాను. అందుకు నీ ప్రవర్తనే కారణం షాలినీ!"

"రేణూ, నువ్వూ నన్నే నిందిస్తున్నావా? అతడికి ఏం లోటు చేశాను? "





"అది నీకే తెలియాలి. ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకో నీకీ విషయం బాధ కలిగిస్తుందని నాకు తెలుసు. నువ్వు అతడ్ని మార్చగలవేమో ప్రయత్నిస్తావని చెప్పాను"

"రేణూ, సమీర్‌కి కావలసింది వెదుక్కున్నాడు. నాకు కావాలి అనుకున్నది నేను సాధించాను. ఇద్దరికీ కావలసింది మాత్రమే సాధించలేకపోయాను. మేమూ అందరిలా యాంత్రికంగానే జీవించాం. మామధ్య ప్రేమ, అర్పణ, అన్యోన్యతా లోపించింది... సమీర్‌లో వాళ్ళ తాతగారి లక్షణాలు బయటపడుతున్నాయ్" ఇలా పోల్చుకున్న షాలినికి తన తప్పు ఏమీలేదనే అన్పించింది.

తుషార వచ్చినప్పుడు తన కూడా ఓ అబ్బాయిని తీసుకువచ్చి, పరిచయం చేస్తూ, "మమ్మీ, ఇతను సిద్దార్థ. నాతోబాటే వర్క్ చేస్తాడు. మా ఇద్దరికీ అమెరికా వెళ్ళడానికి ఆఫర్ రావచ్చు" అంటూ చెప్పింది.

ఆ టైమ్‌లో సమీర్ వున్నాడు. వాళ్ళిద్దరి మధ్యా చనువు చూసి 'పెళ్ళి చేసుకుని వెడుతున్నావా? వెళ్ళొచ్చి చేసుకుంటావా? ' అంటూ అడిగాడు.

"వాట్ డాడీ! పెళ్ళి గురించి ఎవరూ ఆలోచించలేదు. సిద్దార్థ్... నువ్వు గానీ ఆలోచిస్తున్నావా? " సీరియస్‌గా సిద్దార్థవైపు చూసి అడిగింది.

"సారీ సర్. మా కెరీర్ మాకు ముఖ్యం..." అన్నాడు సిద్దార్థ.

"ఎంతోమంది పెళ్ళి చేసుకుని టాప్ పొజిషన్‌కి చేరుకున్నారు. వీళ్ళ ఆలోచన్లు విపరీతం" అంది షాలిని వాళ్ళు వెళ్ళిపోయాక భర్తతో.

"తుషారా! ఇలాగే సహజీవనం సాగించాలని భావిస్తున్నారా? " తర్వాత ఎప్పుడో అడిగాడు కూతుర్ని.

"ఎస్ డాడీ! నచ్చినంతకాలం కలిసి వుంటాం. విడిపోవాల్సి వస్తే సేఫ్ ఇది! ఏ గొడవా వుండదు. మేం ఫారిన్ వెళ్లాలని ఎటూ అనుకుంటున్నాం"

"మీ స్టేటస్ ఏమిటి తుషారా? "

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.







ఎడిటర్:

## చతుర

'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.





శ్రీచంద్ర..









# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**ఏప్రిల్ చతుర నవల ఆలంబన**

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

..............................................

..............................................



"జస్ట్ ఫ్రెండ్‌షిప్..." చాలా మామూలుగా చెప్పింది తుషార.

"తుషారా ఐ డోంట్ లైక్ దిస్ సిట్యుయేషన్" షాలిని సహించలేనట్లు చెప్పింది కోపంగా.

"ఐ డోంట్ కేర్ మమ్మీ" అంతకంటే తీవ్రంగా చెప్పింది తుషార. వింటూండిపోయాడు సమీర్. అతనేమాత్రం ఊహించలేదీ సమాధానం.

రాయిలా బిగుసుకుపోయింది షాలిని.

★ ★ ★

"ఆంటీ నన్ను గుర్తుపట్టారా?" ఇంట్లోకి వస్తూ అడిగిందామె.

"ఎవరదీ...?" కొద్దిసేపు ఆలోచించి అంతలోనే గుర్తొచ్చి, "ఉమ కదూ? ఇండియా విజిట్‌కి వచ్చావా?" అంది.

"లేదాంటీ పర్మనెంట్‌గానే వచ్చేశాం. మాకు అక్కడ జాబ్స్‌లేవు. వచ్చేయాల్సి వచ్చింది. తుషార ఎలా వుంది? చాలాకాలంగా మీ కబుర్లు తెలియలేదు"

ఉమ తుషార క్లాస్‌మేట్. ఉమావాళ్ళ నాన్నగారిది మిడిల్‌క్లాస్ ఫ్యామిలీ. ఉమా వాళ్ళ ఫాదర్ హైస్కూల్ హెడ్మాస్టర్‌గా చేశారు. రిటైర్ అయ్యాకనే ఉమకి అనిల్‌తో పెళ్ళి చేశారు. అనిల్ తల్లితండ్రులకు ఒక్కడే కొడుకు. ఇంజనీరు. అమెరికా వెళ్ళబోతున్నట్లు తెలిసి వాళ్ళ తాహతుకి మించి, కట్నకానుకలతో పెళ్ళి చేశారు. ఉమ వెంటనే అమెరికా వెళ్ళిపోయింది. ఉమ తల్లితండ్రులు వాళ్ళ స్వంత ఊరు వెళ్ళిపోవడంతో, ఆ తర్వాత ఉమ గురించి షాలినికీ తెలియలేదు. నాలుగేళ్ళ తర్వాత ఇప్పుడు కనబడింది.

తుషార గురించి వివరాలన్నీ చెప్పింది షాలిని.

"నేను రావడం, తను వెళ్ళడం... విచిత్రంగా జరిగిందన్నమాట. ఖాళీగా వుంటే పిచ్చెక్కినట్టుంటోంది. మీ శిశువిహార్‌లో నాకేమైనా వర్క్ చూపించండి" పరిసరాలను పరికిస్తూ అడిగింది ఉమ.

అసిస్టెంట్ ఎవరైనా వుంటే బాగుండునని మాస్తోంది షాలిని. సమయానికి తెలిసిన ఉమే వచ్చి అడగడంతో, "అలాగే ఉమా, నేనూ అనుకుంటున్నాను. ఎవరైనా వుంటే బాగుండునని. సమయానికి వచ్చావ్. వారంరోజుల్లో వచ్చి చేరు" అంది.

"వారం కూడా అవసరం లేదాంటీ. రేపట్నుంచే వస్తాను" అంటూ ఉత్సాహం చూపించింది ఉమ.

"అనిల్ ఏం చేస్తున్నాడు?"

"ఓన్ కన్సల్టెన్సీ చేస్తున్నాడు"

ఉమకి సంవత్సరం దాటిన పాపవుంది. తన కూడా తీసుకువచ్చేది. తీరిక వున్నప్పుడు తన కుటుంబం గురించీ, తన ఇబ్బందులగురించీ చెప్పినా, షాలినికి వినాలనే ఇంట్రస్ట్ వుండేదికాదు. ఉమను చిన్నబుచ్చలేక విన్నట్టు నటించేది.

ఓసారి తుషార గురించి మాట్లాడుతూ, "తుషార పెళ్ళి చేసుకోదా ఆంటీ? పోనీండి అదే బాగుంది. చేసుకున్నవాళ్ళేమీ సుఖపడిపోరు. మగాడికి ఒక బానిసగా వుండడం కన్నా, పెళ్ళి మానేసి స్వేచ్ఛగా వుండడం మంచిది" అనేది. షాలిని ఎక్కువగా మాట్లాడదు. అందువలన తనే ప్రశ్న, జవాబు చెప్పుకునేది.

పట్టుమని ఆర్నెల్లు రాలేదు ఉమ. ఓరోజు చెప్పకుండా రావడం మానేసింది. 'ఏమైంది? ఫోన్ నంబర్ కానీ ఇంటి అడ్రస్‌కానీ అడగలేదు' అనుకుంది షాలిని. ఓసారి ఇంటి దగ్గర్లోనే వున్నట్టు, చెప్పడం గుర్తొచ్చి ఎలాగో ప్రయత్నంమీద ఆ ఇల్లు తెలుసుకుంది. కానీ ఇంటికి తాళం వేసుంది. పక్క ఫ్లాట్‌లో వాళ్ళకి స్లిప్‌మీద తన పేరు రాసిచ్చి, వచ్చి వెళ్ళానని చెప్పమంది షాలిని.

ఈ సంఘటన జరిగిన పదిరోజుల తర్వాత వచ్చింది ఉమ. "అదేం ఉమా?



ఎక్కడికెళ్ళావ్? చెప్పకుండా వెళ్లిపోయావు. నాకు చాలా ఇబ్బంది అయిపోయింది" అంది షాలిని చిరాగ్గా.

"సారీ ఆంటీ, అమ్మకి ఆరోగ్యం బాగాలేదని ఫోన్రాస్తే సడన్‌గా వెళ్లాల్సివచ్చింది. అక్క తోడుందికదాని వచ్చేశాను" అంటూ ఉమ చెప్పిన సంజాయిషీ షాలిని నమ్మలేదు. ఏదో దాచిపెట్టినట్టు తోచింది. అప్పట్నుంచీ భర్త అనిల్‌మీద నేరాలు చెప్పడం సాగించింది. తనంటూ వున్నానని గుర్తింపే వుండదనీ, కొద్దిరోజులుగా ఇంటికి రావడం లేదనీ చెప్పింది.

ఉమ చెప్పేదంతా శ్రద్ధగా విన్న షాలిని అడిగింది.

"ఎందుకని ఉమా? నువ్వంటే ఇష్టంగా వుండడా? "

"లేదాంటీ... అసలు పెళ్ళి అయినప్పటినుంచీ మా అత్తమామలు కట్నం తక్కువ ఇచ్చారనీ, పెళ్ళి బాగా చేయలేదనీ, మర్యాదలు జరపలేదనీ సాధించేవారు. ఈ దేశం వచ్చేముందు తన ఉద్యోగం పోయిన విషయం నాకు తెలియదు. హెచ్. వన్ వీసా గడువు తీరిపోయింది. మరో ఉద్యోగం రాలేదు. వృద్ధులైన అమ్మానాన్నలను వదిలి వుండలేనని వంక చెప్పారు. నా వాళ్ళంటే పడదు. మా ఇంటికి రండని వాళ్ళని పిలవరు. తనవాళ్ళు తనకెంతో నావాళ్ళు అంత కారా ఆంటీ? తీరి కూర్చుని ఎప్పుడో ఆరు సంవత్సరాలక్రితం పెళ్లిలో మా వాళ్లంతా చేసిన తప్పులు గురించి సాధిస్తాడు.

పోనీ నేనే వెడతానంటే 'దండగ ఖర్చు.. అంతగా వెళ్ళితీరాలంటే సంపాదించుకో. అలాగే నీ ఇష్టం వచ్చినట్టు వెళ్ళచ్చు' అంటూ హేళన చేస్తాడు. సహించలేక, నేను మీ వాళ్ళ ఊరికి రాను. అంటూ పోట్లాడితే మాట్లాడడం తగ్గించాడు. ఆఫీస్ కోసం అంటూ వేరే ఫ్లాట్ రెంట్‌కి తీసుకు





న్నాడు. అదెలాంటి ఆఫీసో, అక్కడ ఏం చేస్తున్నాడో నాకేం తెలియదు.

పాపని మా అత్తగారి దగ్గిర వుంచి చదివిస్తానని అంటే నేను ఒప్పుకోలేదని చెప్పకుండా తీసుకెళ్లిపోయాడు. వెళ్ళి తెచ్చేసుకున్నాను. ఓసారి మా అత్తగారు వచ్చినప్పుడు నన్ను ఒకటే సాధించింది, 'మాకున్న ఒక్క బిడ్డా నీ మూలంగా రావడం మానేశాడు. మమ్మల్ని తన దగ్గిర వుంచుకోడానికి భయపడుతున్నాడు. నీకే రోగమో వచ్చి పోతే మాకు నీ పీడ వదుల్తుంది. అందంచూసి మోసపోయాం, గుణంలేదు' అంటూ. చెప్పుకునేవాళ్ళు లేక, అభిమానంతో బాధతో అమ్మకు ఈ విషయాలన్నీ ఉత్తరం రాశాను. అజాగ్రత్తవలన ఆ ఉత్తరం అనిల్ కంటబడింది. అంతే. సరిగ్గా అప్పట్నించే వేరే వెళ్ళిపోయాడు. నెలకోసారి కొంత డబ్బు తెచ్చి టేబుల్‌మీద పెడతాడు.

అంత ప్రాణంగా వుండే పాపని కన్నెత్తి చూడటంలేదు. నా తప్పు ఏమిటో నేనేంచేయాలో చెప్పండి? కష్టసుఖాలు అమ్మకి చెప్పడం తప్పా? ఎంతో మంచివాళ్ళని, ఇంజినీర్లు కాదనే కారణంగా తిరస్కరించాను. ఇతడితో ఇప్పుడు నరకం చూస్తున్నాను" జరిగినదంతా స్పష్టంగా వివరించింది ఉమ.

"అనిల్‌తో నేను మాట్లాడనా? "

"అలా ఎవరితోనూ మాట్లాడడు. నాకూ మీతో పరిచయం వుందని అతడికి తెలియదు. నేను ఎక్కడికీ వెళ్లనని అనుకుంటాడు. పాపని షికారుకో, స్కూల్‌కో తీసుకెడుతున్నానని అనుకుంటాడు.

"ఆంటీ... నేనో నిశ్చయానికి వచ్చాను... కానీ ఇప్పుడు చెప్పను. అనిల్ విషయంలో మీరిచ్చే సలహా ఏమిటో చెప్పండి..."

"ఉమా... నువ్వు చెప్పింది విన్నాను. అలాగే అనిల్ చెప్పేది నాకు తెలియాలి. ఒకరు చెప్పిందే విని నిర్ధారించడం మంచిది కాదు. నాకా అవకాశం లేదని నువ్వంటున్నావ్. ఇక చెప్పేది ఏముంది? "

వారిమధ్య ఆ చర్చ జరిగిన తర్వాత తిరిగి ఉమ శిశువిహార్‌కి రావడం మానేసింది. 'ఇక ఈ ఉమని నమ్ముకుని ప్రయోజనంలేదు. మరొకరికోసం చూడాలి' అనుకుంటూండగా మళ్ళీ హఠాత్తుగా ఉమ వచ్చేసింది. ఈసారి పాపను తీసుకురాలేదు. షాలిని ఏమీ అడగకుండానే చెప్పింది.

"ఆంటీ... అనిల్‌కి గుడ్‌బై చెప్పేశాను. ఇక మీరే నాకో దారి చూపించాలి"

"ఉమా, నువ్వు చాలా తొందరపాటు నిర్ణయం తీసుకున్నావనిపిస్తోంది. రిలాక్స్‌డ్‌గా ఆలోచిద్దాం" అనునయంగా చెప్పింది షాలిని.

"ఆంటీ జరిగిన విషయాలు మీకన్నీ చెప్పాను. అనిల్ నాతో కొత్తగా ఈరోజే తెగతెంపులు చేసుకోలేదు. చాలా ముందుగా మిమ్మల్ని కలవడానికి రెండు నెలలముందే నన్ను దూరం చేశాడు. ఇంత కాలమూ ఓపికపట్టాను. తప్పు నాదేమోననే వేచివున్నాను. అతడు మారతాడు అనుకున్నాను"

"అనిల్‌తో నువ్వు స్పష్టంగా చెప్పావా? నీలో నువ్వే అనుకుని, తటస్థంగా వుండిపోయావా? ఇద్దరూ కలసి చర్చించుకోలేదా?"

"అనిల్‌తో చర్చించాను. నా పొరబాటే అయితే మన్నించమన్నాను. అతడినుంచి జవాబులేదు. ఇకమీదట ఏ తప్పూ చేయనని ప్రాధేయపడ్డాను. మొహం తిప్పుకున్నాడు. ఒక్కమాటకీ సమాధానం చెప్పని అతడ్ని చూసి విసిగిపోయి, ఉత్తరం రాసి పెట్టి, వచ్చేశాను"

"ఉమా... చేతులు కాలిన తర్వాత తప్పు ఒప్పుకున్నావేమో? అతను కూడా నీలాగే అనుకుని వుండచ్చు"

"మీరు అర్థంచేసుకోవడం లేదాంటీ... తప్పంతా నాదేనంటున్నారు"

"లేదు ఉమా, ఇద్దర్లో ఒక్కరికైనా సర్దుబాటుతత్వం లేకపోతే ఇలాగే జరుగుతుంది. నువ్వు బైటకు వచ్చేశావ్. ఏ ధైర్యంతో ఉమా? మీ ఇద్దర్లో అభిప్రాయబేధాలు మొదలైనప్పుడే ముందు జాగ్రత్తగా ఏదో ఉద్యోగం చూసుకోవలసింది. అదీ చేయలేదు.

పోనీ నీ పుట్టింటివారు ఆర్థికంగా సహాయపడేస్థాయిలో వున్నవారా? అనిల్ నీకు కాంపన్సేషన్ ఇవ్వకుంటే పాపతో ఎలా బతగ్గలవు? ఇటువంటి పరిస్థితిలో నీకుండాల్సింది తెగింపుకాదు. డబ్బు! అది నీ దగ్గర వుందా? నా వంటివాళ్లు చేసే సహాయం ఏమాత్రం అక్కరకు వస్తుంది?

నీ చదువుకి వచ్చే ఉద్యోగం ఏమిటి? జీతం ఎంత? ఆచరణలో ఇవన్నీ సమస్యలు ఉమా! నిన్ను భయపెట్టాలని చెప్పడంలేదు. నీ ఎదుట నిలిచే సవాల్. నువ్వు చెయ్యాల్సింది ఏమంటే అనిల్ నీకింకా డైవోర్స్ పంపలేదు కనుక కొంత అవకాశం ఇచ్చినట్టే. మొదట మీ అమ్మా, నాన్నలను పిలిపించు. నేను అనిల్‌ని పిలుస్తాను. అందరమూ కలసి చర్చించి జరగాల్సింది ఆలోచిద్దాం. పది రోజులు ఇక్కడే వుండు" అంటూ అనునయించింది షాలిని.

రెండురోజుల తర్వాత అనిల్ షాలినిమీద గౌరవంతో ఆమె చెప్పినట్టే తన అమ్మా, నాన్నలను పిలిపించాడు. ఉమ తల్లితండ్రులూ వచ్చారు. షాలినీ, సమీర్ మీడియేటర్స్. సమీర్ అనిల్‌వైపు, షాలిని ఉమవైపు వాదనలు విన్నారు. అనిల్ ఇలా చెప్పాడు. ఉమకు ఇండియా రావడం ఇష్టంలేదు. తిరిగి వెనక్కి వెడదామని పోరుపెట్టడంతో అసలు ఇద్దిరిమధ్యా పోట్లాట ప్రారంభమైంది. అతనేమో కొద్దికాలం తర్వాత వెడదామని, తనకు సహకరించమనీ నచ్చచెప్పాలని చూశాడు.

ఉమ ఇలా అంటుంది. 'కొద్దికాలం అంటే, అనిల్ దృష్టిలో మరో ఇరవై సంవత్సరాలు. పాప అమెరికాలో పెరగడం అనిల్‌కి ఇష్టంలేదు కాబట్టి! పోనీ అలాగే ఇరవై సంవత్స

రాల తర్వాతనే వెడదామంటే మళ్ళీ మొదట్నించీ నిలదొక్కుకోవాలంటే కష్టంకాదా? వయసు పెరిగిన కొద్దీ శారీరక శ్రమ సాధ్యమా? వయస్సులో టైమ్‌వేస్ట్ చేసి, ఎప్పుడో వెళ్ళి, స్థిరపడాలనుకోవడం హాస్యాస్పదంకాదా? పాపలాటి పిల్లలున్నవారు, ఎందరో విదేశాల్లో లేరా? వాళ్ళంతా చెడిపోయినట్టేనా?

అప్పుడు నాతో తన పేరెంట్స్ గురించే ఇండియా వస్తున్నట్టు చెప్పాడు. కానీ ఇప్పుడు మరోలా చెబుతున్నాడు. నిజమే అనుకుంటే వారికి కొడుకు భవిష్యత్ ముఖ్యమా? అన్నీ వదులుకుని తమ దగ్గిర వుండటమే ముఖ్యమా? అనిల్‌ని తల్లితండ్రులతో విడిగా వుంచాలని నేను ఏనాడూ అనుకోలేదు. అతను తల్చుకుంటే వారినే తన దగ్గరకు రప్పించుకోగల అవకాశం వుంటుంది. అసలు విషయం అది కానే కాదు. అనిల్ మమ్మల్ని మోసగించాడు. పెళ్ళికిముందు తాను చదివింది కంప్యూటర్ బ్రాంచ్ అన్నాడు. కానీ చదివింది మెకానికల్ ఇంజినీరింగ్. ఈ కారణంగా అమెరికాలో అతనికి ఏమాత్రమూ జాబ్ ఛాన్స్ లేదు. జాబ్ పోయింది. కంప్యూటర్ కోర్స్ చేయాలంటే చాలా కష్టపడాలి. ఫీజ్ ఎక్కువ కూడా. పనిచేయాలంటే బద్ధకం. ముందుగానే జాగ్రత్తపడి, ఉద్యోగంలో వుండగానే ఏదైనా కోర్స్‌లు చేసివుంటే బాగుండేది. ఏమీ చేయని కారణంగా అమెరికాలో షైన్ కాలేకపోయాడు.

అతడి స్వభావమూ సంకుచితమైనది. నేను ఉద్యోగం చేస్తున్నప్పుడు అతడు చదవచ్చు కాని నా సంపాదనతో చదవడం చిన్నతనం. అహం అడ్డువచ్చింది. నాచేత రిజైన్ చేయించి, ఇండియా వచ్చేవరకూ అతడికి మనశ్శాంతిలేదు. అంతా ఇండియన్ మెంటాలిటీ. పరిసరాలు, అవసరాన్నిబట్టి, మన పద్ధతులు మార్చుకోవచ్చు. మంచి అవకాశం వచ్చినప్పుడు అందిపుచ్చుకోడానికి కష్టపడచ్చు "కొద్దికాలం ఓర్చుకుని నా జీతంతో సరిపెట్టుకుని, లోన్‌తీసుకుని చదువుకుంటే మంచి జాబ్ వస్తుంది. వయసుతో పనిలేకుండా డెబ్బై సంవత్సరాలవారూ చదువుకోవడం మనం చూస్తున్నాం కదా" అంటూ నచ్చచెప్పాలని చూశాను, బతిమాలాను.

"నీ తెలివితేటలు నాకు లేవు. నీకున్న జ్ఞానం నాకు లేదు. నీమీద డిపెండై వుండాల్సిన ఖర్మమూ లేదు" అంటూ కోపగించాడు.

"భార్యాభర్తలు కష్టసుఖాలు పంచుకోవాలి అని చెప్పడమే నేను చేసిన నేరమా? మనిషినిబట్టి తత్వం, అర్థాలూ మారిపోతాయా. పాపను అప్పుడే ప్లాన్‌చేయద్దు. మనం స్థిరపడ్డాక చూద్దాం, అంటే ఒప్పుకోలేదు. బహుశా పాపకు గ్రీన్ కార్డ్ వస్తుందనే ప్లాన్ కావచ్చు. భార్యగా నా మాటనూ గౌరవించాలి కదా? అది లేదు. పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్లు ఒకరినొకరు అర్థంచేసుకునే అవకాశం ఇవ్వడంలేదు. అంతా లాటరీ... ఇలా చెబితే చాలా వున్నాయ్ ఆంటీ"

"నిజమే ఉమ చెప్పిన విషయాలూ ఆలోచించాల్సినవే! అనిల్ అబద్ధం చెబుతున్నాడేమో? ఉమ చెప్పిందే నిజమైతే ఇప్పటికే ఆమెతో సంబంధం తెంచుకున్నాడు. పైకి చెప్పలేదు. సమీర్ నువ్వేం అనుకుంటున్నావ్ అంటే, 'ఏమో షాలూ, ఇద్దరిలో ఎవరు నిజాలు చెబుతున్నారో, అబద్ధాలు చెబుతున్నారో తెలియదు కదా? మనం చేసేది ఏమీ కనిపించడంలేదు. వాళ్ళ లైఫ్ వాళ్లు చూసుకోవలసిందే. వాళ్ళ పెద్దవాళ్లు చూసుకుంటారులే" అన్నాడు.

అనిల్ గురించి తెలియనందువల్ల వాళ్లే పరిష్కరించుకుంటారని షాలినీ అనుకుంది.

★ ★ ★

షాలిని చినమామగారి పిల్లలందరికీ పెళ్ళిళ్లు అయ్యాయి. కోడళ్లు చదువుకున్నవారే! పెద్దవాడు సుందరం, అచ్చం తండ్రి




పోలిక. అమాయకత్వం, ఒదిగివుండే స్వభావం, పిరికితనం. నాలుగు రూపాయ లిస్తే, పది రూపాయలు బాకీ పెట్టే రకం!

మీనాక్షి, శ్రీధరంగారూ ఆరునెలల తేడాలో పోయారు. అప్పుడు సుందరం భార్య సుమతి ఎటువంటిదో తెలిసింది. చాలా మంచిపిల్ల. బుద్ధిమంతురాలు. తోటి కోడళ్లు, బావగారి అమాయకత్వం ఆసరాగా సుమతిని తక్కువ చేసేవారు. చదువున్నా సంస్కారంలేని మనుషులు. సుందరం తమ్ముళ్ళకి చదువులు బాగానే వచ్చాయి. అందువలన మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. చరిత్ర పునరావృతమైంది. సుమతి, పార్వతీ ఒకే మాటమీద అన్యోన్యంగా వుంటారు. చిన్నకోడళ్లు కలసిరారు పార్వతికి. అందుకే మరింత ప్రాణమైంది సుమతి.

"కన్నకొడుకే అనుకో. అన్నింటా తండ్రి పోలికలు వచ్చిపడ్డాయ్ వాడికి. నీ బాధ చూడలేకుండా వున్నాను. వాణ్ణి మందలిం చినా గుణాలు మారవు. మంచీ, చెడూ మనమే చూడాల్సివస్తోంది. అందుకే ఒక్క అమ్మాయి చాలు. మరింక పిల్లలు కలగ కుండా ఆపరేషన్ చేయించుకో. ఈ తరత రాల వారసత్వం వద్దు బాబూ" విరక్తిగా అంది పార్వతి. అదే ఆచరణలో పెట్టింది సుమతి.

షాలిని అత్తాకోడళ్లను చూసి సంతోషప డింది. వాళ్లకి ఏదో సాయపడాలనుకుంది.

"సుమతీ నువ్వు చదువుకున్నదానివి. సుందరానికి చిన్న ఉద్యోగం మా ఊళ్ళోనూ దొరుకుతుంది. నీ కూతుర్ని బాగా చదివిం చచ్చు. నాకు చేదోడుగా శరణాలయం చూసుకుందువుగాని వచ్చెయ్" అంటూ చెప్పింది.

"ఆ మొండి మనిషికి నచ్చచెప్పు షాలూ. అలాగే వస్తాము" అన్నది పార్వతి.

సమీర్‌చేత చెప్పించి సుందరాన్ని హైదరా బాద్ రప్పించింది షాలిని. ఇంటికి దగ్గర్లోనే చిన్న వాటా అద్దెకు కుదిర్చింది. సమీర్ విసుక్కుంటూనే సుందరానికి చిన్న ఉద్యోగం వేయించాడు. పార్వతి నిర్విచా రంగా, పిల్లలందరి దగ్గిరా వుంటూంటుంది. "షాలూ మా ఇంటిని బాగుచేయడానికి వచ్చిన దేవత. అందరం ఒక ఒడ్డుకు చేరాం. నిశ్చింతగా నా జీవితం గడిపేస్తాను" అంటూ తృప్తిపడింది.

కానీ ఆవిడ సంతోషం ఎంతోకాలం నిల వలేదు. చక్రధరంగారు, పార్వతీ తీర్థయాత్ర లకు వెళ్ళి తిరిగిరానేలేదు. మధ్యలో యాక్సి డెంట్ జరిగింది. ఒకేసారి ఈ లోకాన్ని వదిలి వెళ్ళారు. చక్రధరం ముందు పోయి పార్వతి జీవించినా బాగుండేది. చక్రధరం గారికి బాగా దెబ్బలు తగిలాయ్. ఆయన జీవించినా మంచంమీదే గడపాల్సివచ్చేది. అప్పుడు పార్వతికి మరీ ప్రత్యక్షనరకం. ఆవిడ మంచితనమో, చేసిన యాత్రఫలమో, ఎవరికీ ఎవరూ భారంకాకూడదన్నట్టు ఒకే సారి సునాయాసంగా వెళ్ళిపోయారు. సుమతీ, షాలినీ ఇదే అనుకున్నారు.

"అత్తవారింట ప్రవేశించేసరికి మామగారు, అత్తయ్యమీదనే ఆధారపడాల్సివచ్చినందున ఆవిడ చెప్పినట్టు వినడం చూశాను. ఇప్పుడు మా ఆయన్ను చూస్తుంటే అత్తయ్య ఎన్ని విధాల బాధలు అనుభవించారో స్పష్టంగా తెలుస్తోంది" అంటూ షాలిని దగ్గర వాపో యింది సుమతి.

"ఇప్పుడింక చేసేది ఏముంది? సర్దుకుపో వాలి కదా సుమతీ" అంది షాలిని.

"ఏమోనక్కా, నాలో అత్తయ్యకున్నంత సహనంలేదు. ఎప్పుడో ఇంటినుంచి పారిపో వాలనిపిస్తోంది" అనే సుమతికి ఏం చెప్పాలో తెలియలేదు షాలినికి. వీళ్ల గురించి చెప్పిందో 'దారిన పోయేది నెత్తిన వేసుకున్నావ్‌గా అనుభవించు' అంటాడు సమీర్. ఏమిటో బాధపడేవారిని చూసిన ప్పుడు ఆవేశం, జాలీ ముంచుకొస్తాయ్. ఆచరణలో సమస్యలు వచ్చినా, సమీర్‌కి జవాబు చెప్పాల్సివచ్చినా అనవసరంగా తల

దూర్చానా అనుకుంటుంది. త్వరలో శిశుశరణాలయం, స్త్రీల శరణాలయంగా మారుతుందేమో అనే ఊహ రాకపోలేదు షాలినికి. ఓ ఉమా, ఒక సుమతి, మరో రాధ, కుంతీ కళ్ల బడతారేమో.

సుందరం హైదరాబాద్ నగరవాసి అయ్యేసరికి తమ్ముళ్లూ కుటుంబంతోసహా రాకపోకలు సాగించారు. వాళ్లుండేవి చిన్న చిన్న పట్నాలు. అన్నయ్య హైదరాబాద్‌లో వుంటాడు. 'పిల్లలు శెలవులకు హైదరాబాద్ వెళ్ళి అది చూడాలి, ఇది చూడాలి అంటూ పేచీ పెట్టడంతో వచ్చేశాం' అంటూ దిగబడిపోయేవారు. సుందరం వాళ్లని చూసి వుబ్బి తబ్బిబ్బైపోయి, ఎడాపెడా అప్పులుచేసి మరీ ఖర్చు చేసేస్తున్నాడు. వెళ్లేటప్పుడు తనేదో పెద్ద ఆఫీసర్ ఉద్యోగం వెలగపెడుతున్నట్టు తలో వందా పంచిపెడతాడు.

షాలినికి మొరపెట్టుకుంది సుమతి. "అక్కా పెనంమీంచి పొయ్యిలో పడ్డట్టుంది నా పని" అంటూ.

కల్పించుకోవడం బాగుండదేమో. స్వంత అన్నదమ్ములు, పిల్లలూను. ఎవరికి వాళ్ళకి బరువు బాధ్యతా తెలియాలి అనే సంకోచంతో వుండిపోయింది. కానీ సుందరం చేతకానితనానికి షాలినికి బాగా కోపం వచ్చింది. తనకంటే చిన్నవాడే కదాని ఓసారి మందలించింది.

"సుందరం, నీకు వచ్చే జీతంతో ఈ ఖర్చులు తట్టుకోవడం కష్టం. ఈమధ్య మీవాళ్లంతా వచ్చి వెళ్లారుకదా? " అని!

"అవును వదినా. ఖర్చులు తట్టుకోవడం అనేది కష్టమే. అయినవాళ్లు వస్తే ఖర్చు అని ఎలా అనుకుంటాం? ఇలా చెప్పానని కోపంవద్దు. సమీర్ అన్నయ్యతో ఓ మాట చెప్పు చాలు! మా కంపెనీ వాళ్లు బొత్తిగా రెండువేలు ఇస్తున్నారు. అన్ని ధరలు మండిపోతున్నాయ్. నేనేమైనా తక్కువ పని చేస్తానా? నా కష్టానికి అయిదువేలు ఇచ్చినా తక్కువే" అంటూ కొత్త ప్రపోజల్ పెట్టాడు మాట దాటేస్తూ... తెలివితేటలు ఇందులో వచ్చాయ్.

షాలిని సమీర్‌తో చెప్పింది. "సుందరం చేరి రెండేళ్లు అయింది కదా మూడువేలకి జీతం పెంచమని"

ఏకళనున్నాడో "నువ్వోసారి గుర్తుచెయ్" అన్నాడు సమీర్. సుందరం గురించి షాలిని మనసులో 'దుబారా చేయడం తన తప్పుగా అనుకోడంలేదు. కంపెనీవాళ్లు తన ఖర్చులకు తగిన జీతం ఇవ్వరని నేరారోపణ చేస్తున్నాడు' అనుకుంది.

"సుందరం ఈ ఉద్యోగం దొరకడం ఎంత కష్టమో నీకు తెలుసా? మీ అన్నకి బాగా తెలిసినవారు కావడంవలన ఇదైనా ఇచ్చారు. బంధువులైనా, తమ్ముళ్లయినా అవసరాలకు ముఖ్యమైన పన్లకు రావడం తప్పు కాదు. శెలవులనీ, పిల్లలు సరదాపడుతున్నారనీ వచ్చేవాళ్లకోసం దుబారా చేస్తే కంపెనీ జీతాలేమీ పెంచదు. తాహతు తెలిసి ఖర్చు చేయాలి" అంటూ చెప్పింది. ఏమనుకున్నాడో మరి మాట్లాడలేదు. అప్పట్నించీ షాలినితో మాటలు తగ్గించాడు.

సుమతి సుందరం గురించి ఫిర్యాదు చేయని రోజులేదు. పార్వతి కాలంలో భర్త ఎలాటివాడైనా పరువు, మర్యాదలకోసం భరించింది. కానీ సుమతి తర్వాతి జనరేషన్‌లో స్త్రీ కనుక ఆ సహనం, ఓర్పూ లేవు. దానికి తోడు సుమతికి చదువుంది. ఆర్థిక స్వతంత్రం వుంది. భర్త సంపాదనపై 'ఆధారపడాల్సి' వస్తే ఎన్ని తెలివితేటలున్నా వృధాయే! ఉద్యోగం చేసే అమ్మాయిలు ఈ రోజుల్లో భర్తలకు ఏమాత్రమూ భయపడటంలేదు. ఈనాటి అబ్బాయిలు కూడా అందుకే దాసోహం అయిపోతున్నారు. భార్యకు భయపడుతున్నారు.

"మీ అమ్మ మన ఇంటికి రావడానికి వీల్లేదు. మా అమ్మ నా ఇంటికి వచ్చినట్టు, మీ అమ్మ కూడా తన కూతురు ఇంటికి వెళ్ళి వుండచ్చు ఇదే నా దృష్టిలో సరియై





నది" అంటున్నారు కొంతమంది భార్యలు.

'కూతుళ్ళు లేని వాళ్లు ఏంచేయాలి?' అన డిగితే, 'అది నా సమస్య కాదు. లేనివాళ్లు వాళ్లే చూసుకుంటారు' అని చెప్తున్నారు.



రేణూ, షాలినీ కలిసి చాలా రోజులైంది. 'ఫోన్ చేయాలి. సమీర్ గురించి రేణూ చెప్పింది నిజమేనేమో! వయసు పైబడుతుంటే రెండోసారి యవ్వనం తొంగిచూస్తుందట. అందుకే సమీర్ కూడా ఈ దశలో అమ్మాయిల వేట ప్రారంభించాడా? అందుబాటులో వుండే తను బోర్ కొట్టిందా?' అనుకుంది షాలిని. పతీపత్నీ ఔర్ ఓ... అనే హిందీ సినిమా గుర్తొచ్చింది. ఆమెకు 'అజయ్' గుర్తొచ్చాడు మరోసారి.

షాలిని తల్లికి 'అజయ్' అంటే చాలా ఇష్టం. అతను తన అల్లుడు కావాలని ఎంతగానో కోరుకునేది. అప్పట్లో దేశంకాని దేశం పోవాలంటే బెంగగా అనిపించి, అజయ్‌ని తృణీకరించింది. అతడిలో ఆకర్షణా కనిపించలేదు. అప్పుడు సరియైన నిర్ణయం తీసుకునే జ్ఞానం కూడా లేదు షాలినికి.

అందుకే కాబోలు రేణూ అంటుంది. 'నీ వయసుకు తగిన మెచ్యూరిటీ లేదని! అసలు కొందరి జీవితాలే అంత కాబోలు అందనిది అపురూపంగానూ, అందినది వెగటుగానూ కనిపిస్తుంది' తనపట్ల నిర్లక్ష్యం చూపించే సమీర్ అంటే షాలినికి విరక్తిగా అనిపించింది. ఎక్కడో వేలమైళ్ల దూరంలో తన గురించి అసలు ఆలోచిస్తాడో లేదో తెలియని అజయ్ మనసులో మెదిలాడు ఆమెకు. అనుకోకుండా అజయ్ కలిస్తే, తను కూడా అతడి స్నేహం, సామీప్యం కోరుకుంటుందేమో? 'అజయ్ నిన్ను కాదని, ఎంత తప్పు చేశానో అప్పుడు గ్రహించుకోలేకపోయాను. 'ఇప్పుడు తెలిసీ, అందనంత దూరంలో వున్నావ్' అనుకుంది. పెద్దవాళ్లు చేసిన పెళ్ళిళ్లు సఫలంకావు అని ఉమ అంటుంది కాని అమ్మా-నాన్నలు అజయ్‌ని చేసుకో అన్నప్పుడు, అజ్ఞానంతో కాదన్నందుకు, తప్పు నాది కాని, వాళ్లది కాదు అనుకుంది. ఉమ సంగతి వేరు. వాళ్లు తిరిగి కలుసుకోవచ్చు ఒకసారి ఒడుదుడుకులు వచ్చాయి కనుక, జాగ్రత్తగానూ మసులుకుంటారు. వాళ్లకి వయసుంది. టైమూ వుంది. తనకి వయసు లేదు. టైమ్ కలిసొచ్చినా వృథాయే కదా? అప్రయత్నంగా అజయ్ తలపులతో ఆమె ప్రమేయంలేకనే కళ్లు చెమర్చాయి. ఒక్కసారి అశక్తత ఏదో అలుముకుంది ఆమెలో! వచ్చే ఆలోచనలను బలవంతాన మళ్ళించడానికి తనకి ఇష్టమైన మేరీ కరొలి 'థెల్మా' నవల తీసి చదవసాగింది.

షాలిని ఒకోసారి తన మనసుకి కష్టం తోచినప్పుడు చేసే పని బుక్ రీడింగ్. ఎన్ని వందల పుస్తకాలు చదివిందో గుర్తేలేదు.

శరణాలయంలో పాపలంతా ఎదిగి, చదువుకునే వయసుకి వచ్చారు. వీళ్లని ఏం చేయాలి? పసివారి బాధ్యత సక్రమంగా నెరవేర్చడం సులువే. కానీ వయసొచ్చిన అమ్మాయిల విషయంలో బాధ్యత కష్టతరమైనది. ఏ కారణంగానైనా దూరం వెళ్ళాల్సివస్తే ఎవరికి అప్పగించాలి? ఉమ, సుమతి

వున్నారు కానీ ఉమ సందిగ్ధావస్థలో వుంది. సుమతి బెటర్. తనెక్కడికీ వెళ్ళదు సరికదా నమ్మకమైనది అనుకుని, రేణూని సలహా అడిగింది. ఎప్పటి సంగతో ఇప్పుడెందుకు? చూడచ్చులే అన్నది రేణూ!

"రేణూ, పసివాళ్లను సాకడం కష్టం. సమీర్ కూడా విసుక్కుంటున్నాడు. ఇక కొత్తవారిని చేర్చుకునే పరిస్థితిలేదు. శిశుశర ణాలయాన్ని స్త్రీ శరణాలయంగా మార్చడా నికి వేరే ప్రయత్నాలు ఏం చేయాలో లీగ ల్‌గా తెలుసుకోవాలి" అంది.

"షాలూ! అసలు నువ్వు, సమీర్‌తోపాటు బిజినెస్ ట్రిప్‌కి వెళ్ళచ్చు కదా? ఎందుకు వెళ్ళవు? "

"నన్నో గెస్ట్‌హౌస్‌లోనో, హోటల్లోనూ వుంచి, కాన్ఫరెన్స్ అంటూ తిరుగుతాడు. ఆ మాత్రానికి ఏ ఊరికో వెళ్ళడం దేనికని?

షాపింగ్‌కో, సైట్ సీయింగ్‌కో ఒంటరి గానే వెళ్లాలి. అందులోనూ అవన్నీ ఇదివ రకు చూసినవే" అంటూ వివరించింది షాలిని.

'ఉమ గురించి ఏం తెలియలేదు. మళ్లీ తను కలవనేలేదు. అందరూ నన్ను అవస రానికి వాడుకుని వదిలేస్తున్నారేమో' అను కుంది షాలిని.

హఠాత్తుగా ఒక అనుమానం వచ్చిందా మెకి. సుమతి కూడా అటువంటిదేనా? సమాధానం త్వరలోనే తెలిసివచ్చింది షాలి నికి.

సుమతి వచ్చి చాలారోజులైంది. పనుండి ఏ ఊరైనా వెళ్లిందా? అలా అయితే చెప్పి వెళ్లేదే అనుకుంది. కానీ సుందరం ఇంటికి వెళ్లడానికి ఖాళీ అవలేదు.

ఓరోజు సుమతినుంచి వచ్చిన ఉత్తరంతో చాలా విషయాలు తెలిసివచ్చాయి షాలినికి. "అక్కా, ఈమధ్య నా క్లాస్‌మేట్ శ్రీనాథ్ అనే అతను ఈ ఊరొచ్చాడు. నీ మరిదితో విసిగివేసారిన నాకు అతడి రాక కొత్త ఊపి




రిపోసింది. మూర్ఖత్వం, చేతకానితనం మూర్తీభవించిన నీ మరిదితో వేగటం నా శక్యం కావడంలేదు. అందుకే చాలా రోజు లుగా శ్రీనాథ్‌తో ఎటాచ్‌మెంట్ పెంచుకు న్నాను. నీ దగ్గర దాచలేను. అతడూ, నేనూ పెళ్లిచేసుకోవడానికి నిర్ణయించుకున్నాం. అందుకే సుందరాన్ని వదిలి అతడితో వెళ్లి పోయాను. సుమతి"

వెంటనే సుందరం ఇంటికి వెళ్లింది షాలిని. ఆరోజు ఆదివారం. ఇంట్లోనే వున్నాడు. కాసేపు మామూలుగా పలక రించి "పాపా, సుమతీ లేరా సుందరం? " అడిగిందామె.

"సుమతి గురించి తెలియకనే అడుగుతు న్నావా? మీరిద్దరూ చాలా క్లోజ్ కదా. పైగా నువ్వే కదూ పట్టుబట్టి ఈ ఊరు తీసుకొ చ్చావు. ఏమీ తెలియనట్టు అడుగుతావేం? నీ సలహా, సంప్రదింపు లేకుండా ఆవిడ గారు ఏ పనీ చేయదుగా" అన్నాడు నిష్ఠూ రంగా.

"నాకేమీ తెలియదు. సుమతి నాకేమీ చెప్పనూలేదు. మీ మంచికోసం, మిమ్మల్ని ఒక దారికి తేవాలనీ ఈ ఊరు రమ్మని చెప్పాను. నిష్ఠూరంగా మాట్లాడతావేం సుందరం? "

"ఇప్పుడు ఏమనుకున్నా ఉపయోగం ఏముంది వదినా? నేనీ ఊళ్లో వుండలేను. మన ఊరు వెళ్లిపోతాను. అడిగినవాళ్లకి సుమతి చచ్చిపోయిందని చెబుతాను" అన్నాడు కోపంగా.

"సుందరం! సుమతిని సమర్థిస్తున్నానని అనుకోకు. ఆమె ఇంటినుంచి వెళ్లిపోవడానికి నువ్వే కారణం. ఈ విషయం అర్థమైందా నీకు? "

"నేను కారణమా? సుమతిలో సంసార స్త్రీకి వుండాల్సిన లక్షణాలు లేవు. తను మహా తెలివిగలదాన్నని గర్వం. తను చెప్పి నట్టు వినాలని రోజూ గొడవే. నా వాళ్లెవరూ నచ్చరు. వాళ్లు ఇంటికి రాకూడదు. పైసా నుంచీ ఖర్చులు చెప్పాలి. ప్రతిదానికి అడ్డు

తగులుతుంది. నీతో ఏం చెప్పుకోను? నేను చేతకానివాణ్ణట. తను కాబట్టి ఇంతకాలం భరించిందట. సహించలేక చేయి చేసుకున్నాను. అసలు విషయం అదికాదు. తనతో చదివిన శ్రీనాథ్ ఈమధ్య తరచుగా రాకపోకలు సాగించాడు. వాడి మాయలో పడింది. నేను చేతకానివాణ్ణని ఈరోజే తెలుసుకుందంటే శ్రీనాథ్ రావడం, మాయ మాటలు చెప్పడంవల్లనే. నా భార్య లేచిపోయింది వదినా నేను అసమర్థుణ్ణని, యోగ్యత లేనివాణ్ణని, అందంగా లేనని, సంపాదనాపరుణ్ణి కాదనీ..." అంత మనిషీ చిన్నపిల్లాడిలా ఏడుస్తోంటే, ఇతను తెలివిలేనివాడా? ఇప్పుడు అతను చెప్పిన విషయాలన్నీ నిజా లేకదా! అవన్నీ గ్రహించినవాడు అమాయకుడెలా అయాడు? మనిషిలో మార్పు వచ్చిందో, పరిస్థితులవలన చేతకానివాడిలా వుండిపోయాడో అర్థంకాలేదు షాలినికి.

సుమతి సుందరానికి చేసిన ఉపకారం ఏమిటంటే కూతుర్ని కూడా తీసుకెళ్ళింది. శ్రీనాథ్ చాలామంచివాడు. ఇద్దర్నీ బాగా చూసుకుంటున్నాడు అంటూ ఉత్తరంలో రాసింది.

సుందరం తరచుగా వస్తున్నాడు.

"సుందరం! కోపంతో నేను కారణంగా చెబుతున్నావ్ కానీ, సుమతి గురించి నీకే బాగా తెల్సు. అత్తయ్యా, సుమతి కలసిమెలసిలేరూ? ఇంటి విషయాలు వాళ్లే సమర్థించుకోలేదూ? నా మాట విను. బాధ్యత తెల్సుకో. పదిరూపాయిలు సంపాదించి, ఐదే ఖర్చు చెయ్. కొన్ని అనుభవాలు బాధ్యతల్ని నేర్పుతాయి" అంటూ అనునయంగా చెప్పింది.

"నీ సలహా సానుభూతి ఆశించి రాలేదు. ఇకనుంచీ నా కారణంగా ఎవరినీ కష్టపెట్టనులే వదినా. వెళ్లిపోతున్నానని చెప్పడానికి వచ్చాను. మీ సహాయానికి కోటి నమస్కారాలు" అంటూ చెప్పి వెళ్లిపోయాడు.

'ఈ వెన్నెముక లేని మనుషులు ఇలాగే మూర్ఖంగా వుంటారు. స్వంతంగా ఏమీ చేసుకోలేరు. ఇంకొకరి సాయం తీసుకోరు' అనుకుంది షాలిని.

★ ★ ★

రెండేళ్ల తర్వాత తుషార ఇండియా వచ్చింది. హఠాత్తుగా ఫోన్ చేయకుండానే వచ్చేసిన కూతుర్ని చూసి, "వచ్చేముందు కబురేలేదు. ఇటే వస్తున్నావా?" అనడిగింది షాలిని.

"ఎటూ వస్తున్నానుకదాని ఫోన్ చేయలేదు మమ్మీ" అంది తుషార.

"ఒక్కదానివే వచ్చావా?"

"లేక? ఎవర్ని తీసుకువస్తాననుకున్నావ్?"

"సిద్ధార్థతో... మీరిద్దరూ అక్కడ పెళ్లి చేసుకుని వుంటారని నా ఊహ"

"వెళ్లేముందు అదే ఆలోచనతో వెళ్లలేదు కానీ, మేం ఒకే అపార్ట్‌మెంట్‌లో కలసివుండగా సంవత్సరం తర్వాత అడిగాడు. పర్మనెంట్‌గా సెటిల్ అవుదామా అని. ఇండియా వెళ్లాక పెళ్లి చేసుకుంటే అంతా సంతోషిస్తారు కదా అన్నాను. సరేనన్నాడు. కానీ మా ప్రాజెక్ట్‌ని అలా పొడిగిస్తూపోవడంతో, అప్పట్లో ఇండియా రావడానికి వీలుకాలేదు. అదీ ఒకందుకు మంచిదే అయింది మమ్మీ. సిద్ధార్థ్‌కి ఒక ఎయిమ్ అంటూ లేదు. క్షణానికో అభిప్రాయం మార్చుకుంటాడు. అక్కడ తనకి వచ్చిన అవకాశాలను వదులుకున్నాడు. అదేంటి సిద్ధూ, అలా చేశావ్ అంటే నువ్వు మంచి జాబ్‌లో వున్నావు కదా. నేనింకా చదవాలనుకుంటున్నాను అంటాడు. నిజమే చదువుకోడానికి అంతేలేదు. కానీ నామీద డిపెండవడం నచ్చలేదు. అలాని నేను చెబితే మగవాణ్ణి అనే ఈగో. వర్క్‌లో కూడా నా వెనుక ఫాలో కావడమే తప్ప స్వంతంగా తన తెలివితేటలు ఉపయోగించడు. అసలు ఒరిజినల్‌గా మప్పే అనీ అర్థమైంది" అంటూ నవ్వేసి, "ఇలా అతడి నేచర్

స్పష్టంగా తెలిసివచ్చాక అతన్నుంచి విడిపో యాను. అంతటితో సిద్ధార్థ్ ఫ్రెండ్‌షిప్ కట్ట యింది, అంతే"

తుషార చాలా తేలిగ్గా చెప్పేసరికి షాలి నికి భయం పట్టుకుంది. 'తుషార జీవితం గురించి తనేదో ఆశించడం తెలివి తక్కువ. కొంపతీసి దీనికీ రంగారావుగారి పోలిక వచ్చిందా ఏం ఖర్మ? ఎదుటివారిని అదుపా జ్ఞల్లో వుంచుకోవాలనే మెంటాలిటీ' అనుకుని ఇక ఆలోచించడం మానేసి కూతురు అమె రికా కబుర్లు చెబుతుంటే వింటూండిపో యింది.

"మమ్మీ! డాడీ కనుక అమెరికా వెడితే మంచి ఛాన్సెస్ వుంటాయి. చెప్పకూ డదూ? !"

"మీ డాడీ ఒకరు చెబితే వినడమా? తనకే తోచాలి. ఇంట్రస్ట్ వుండాలి. అదీకాక ఇప్పుడు అక్కడ ఏం చేయగలరు తుషారా? "

"నేను డాడీని అమెరికా రప్పించి తీరు తాను చూస్తుండు"

"అంటే నువ్వు మళ్లీ వెడుతున్నావా? "

"అవును మమ్మీ. అక్కడ మరో జాబ్ వచ్చింది నాకు. ఇక్కడ కంపెనీకి రిజైన్ చేసేసి, నాకు రావల్సిన అకౌంట్ తీసుకుపో వాలనీ, మూడేళ్లయింది కదా, మిమ్మల్ని చూడాలని వచ్చాను"

"సరేకానీ, మీ డాడీ అమెరికా వెళ్లడానికి సిద్ధపడినా నేనీ దేశాన్ని వదిలి వెళ్లలేను. నేను స్టార్ట్ చేసిన హోమ్, ఆ పిల్లలూ ఏమ వుతారు? " షాలిని ప్రసంగం మార్చేసరికి తుషార అక్కణ్ణించి లేచి ఎప్పుడు వెళ్లిందో వెళ్లిపోయింది. అక్కడ లేనేలేదు. షాలిని నోరు ఠక్కున మూతపడింది.

మూణ్ణెల్ల కంపెనీ ట్రిప్ తర్వాత సమీర్ కూడా ఇంటికి వచ్చాడు. షాలినికి చాలా ఆనందం కలిగింది. ముగ్గురం కలిసి ఎంత కాలమైందో అనుకుంది. ఎప్పుడూ లేనిది ఈసారి సమీర్ చాలా 'టైర్డ్'గా కనిపిం చాడు. వస్తూనే చేతిలోని బ్రీఫ్‌కేస్ సోఫాలో పడేసి, పైన తన రూంలోకి వెళ్లిపోయాడు.

ఆ బ్రీఫ్‌కేస్ పొరపాటున కూడా ఎక్కడా వదలడు. అందులో చాలా ఇంపార్టెంట్ పేపర్స్ వుంటాయి. వింతగా అనిపించి, బ్రీఫ్‌కేస్ జాగ్రత్తచేసి, వేడివేడి కాఫీతో షాలిని కూడా అతని రూంలోకి వెళ్లింది.

అలసటగా బెడ్‌రూంలో వున్న సోఫాలో, కాళ్లపై మోచేయి ఆన్చుకుని ఒరిగినట్టున్న అతడ్ని చూసేసరికి, షాలినిలో హఠాత్తుగా మమత పొంగివచ్చింది. కాఫీకప్పు టేబుల్ మీద పెట్టి "సమ్మూ, ఏమిటీ ఇంతగా అల సిపోయావ్? " అంటూ పక్కనే కూర్చొని రెండుచేతులతో అతడి తలను ఎదపై చేర్చు కుంది.

ఆ మమతానుబంధానికి కరిగిపోయి, "షాలూ!" అంటూ మరింతగా హత్తుకుపో యాడు సమీర్. అతడ్ని పసివాడిలా లాలిం చింది. ఆ స్పర్శ, పులకరింపులకి పరవశించి పోయిన వాళ్లిద్దరూ చాలాసేపు తన్మయ త్వంగా వుండిపోయారు. అంతటి మాధుర్యం చాలాకాలం తర్వాత లభించినం దున ఇద్దరికీ కాలమే తెలియలేదు. ఆ లాలింపులోని భావం మనసులకే తెలు స్తుంది. అందుకే వాళ్లు మాట్లాడుకోలేదు. కదిలితే కరిగిపోతుందేమోనని గుండెలో తుల్లో దాచేసుకుంది షాలిని. అతడూ అదే ఆర్తితో పరవశించిపోయాడు. ఆలుమగల మధ్య కొన్ని అపురూపమైన క్షణాలుం టాయి. అవి ఎవరికీ చెప్పలేనివి.

డైనింగ్‌టేబుల్ దగ్గర చాలాకాలానికి ముగ్గురూ కలిసి డిన్నర్ చేస్తూ ఆత్మీయంగా మాట్లాడుకున్నారు. ఆరోజు తుషార అక్కడే వుండిపోయింది. చాలాసేపు ఫామిలీ ప్రాబ్లమ్స్ చర్చించుకున్నారు. ఆరోజులా ప్రతిరోజూ శాశ్వతంగా నిల్చిపోతే ఎంత బా గుండునని షాలిని అనుకుంది.

★ ★ ★

మర్నాడు పదిగంటలకి బ్రేక్‌ఫాస్ట్ చేసి




'కంపెనీకి వెళ్లొస్తానమ్మా' అంటూ చెప్పి వెళ్లింది తుషార. సమీర్ మాత్రం ఇంట్లోనే వుండిపోయాడు. ఫోన్‌కాల్స్ వచ్చినా తను ట్రిప్‌నుంచి వచ్చినట్టు చెప్పొద్దన్నాడు. సెల్ ఫోన్ ఆఫ్ చేసేశాడు. ఆరోజు సమీర్ మామూలు మనిషిగా మారిపోయాడు. షాలినిని కొత్త పెళ్లికూతురన్నట్టు క్షణం విడ వలేదు. షాలినికి కొత్త జీవితంలో అడుగు పెట్టినట్టనిపించింది. మనసులోని నైరాశ్య మంతా మటుమాయమైపోయింది. గతాన్ని, భవిష్యత్‌ని తల్చుకోవాలని లేనేలేదామెకి. సమీర్‌లో ఈ అద్భుతమైన, అపురూపమైన మార్పేమిటో తెలుసుకోవాలనీలేదు, శాశ్వత మైపోవాలనే కోరికతప్ప.

ఒకప్పుడు సమీర్‌కి దూరమైపోయినం దున ఎటో వెళ్లిపోవాలనిపించింది. ఒక లాంటి విరక్తిభావం కలిగింది. ఇప్పుడు... 'నయం, అలాంటి పొరబాటు చేయకపో వడం మంచిదైంది' అనుకుంది. దాంపత్య జీవితం పరస్పరం ముడిపడివుంటుంది. భార్యాభర్తలు రాగద్వేషాలకి అతీతులుకారు. ఒక్కోసారి ఇదేం జీవితమని విరక్తీ, మరో సారి అపురూపమైన అనురక్తీ వారిని కట్టి వుంచుతుంది. అయితే ఏదైనా శృతిమించక తగు మోతాదులో వున్నప్పుడూ, విరక్తిలో ఓర్పు కలిగి వున్నప్పుడే, ఎన్ని ఒడుదుడు కులు వచ్చినా నిలబడుతుంది. ఈ ఒక్క అవకాశం పెళ్లి, భర్తా అనే కట్టుబాటులో వుందేమో.

అందుకే సమీర్‌పట్ల ఎంతటి అసంతృప్తి వున్నప్పటికీ తన పరిధిలో వ్యాపకం కల్పిం చుకుని, మనసు మళ్లించింది తప్ప మరోలా ఆలోచించలేదు.

అదే తుషార పెళ్లిదాకా రాకుండానే తనకే మాత్రం పొంతన కుదరని సిద్ధార్థ్‌ని మరో ఆలోచన లేకుండా పక్కకి నెట్టేసింది. అందుక్కారణం జనరేషన్ గ్యాప్ కావచ్చు మారుతున్న స్థితిగతులూ కావచ్చు మనిషి జీవితంలో దశలవారీగా మార్పులు చోటు చేసుకుంటాయ్. అనుభవాల సారమే జీవితం. కొందరి అనుభవాలు చేదుగా వుంటాయి. మరికొన్ని జీవితంపట్ల ఆశను, మమకారాన్ని పెంచుతాయి.

ఒకప్పుడు సమీర్ షాలినినుంచి దూరమ య్యాడు. అతని కారణాలు అతనివి. అతడి దృక్పథంలో మార్పు వచ్చింది. ఆ టైమ్‌లో షాలిని వివేకంతో మనశ్శాంతి కోరి శరణాల యాన్ని ఆశ్రయించింది. అందువలన ఆమెలో ఆత్మవిశ్వాసం పెరుగుతూ వచ్చింది. పసివాళ్ల ఆలనాపాలనలో మరో ప్రపంచం సృష్టించుకుంది. సమీర్ ఆమె మనసుకి చేసిన గాయాన్నుంచి ఉపశమనం కలిగింది. భార్యాభర్తలమధ్య ఏర్పడిన అగా ధంనుంచి ఊరట కలిగింది. ఆ ఓర్పే ఇప్పటి జీవితానికి ఆలంబనగా నిల్చింది.

నా వయసూ, అనుభవం, ఆదరణా కొందరి జీవితాల్లో వెలుగు నింపితే కావ ల్సింది ఏముంది? శరణాలయంలో పెరిగి, పెద్దై బాధ్యత గలవారిగా మారి వారికి నచ్చిన మంచిమార్గాన్ని ఎంచుకున్నారని తృప్తిపడింది షాలిని. ఇప్పటి యువతులు, మహిళలు ఒత్తిడివలన సంసారాల్లో కల తలు కొనితెచ్చుకుంటున్నారు. మంచీ, చెడూ ఆలోచించే సమయం కూడా వాళ్లకిలేదు. అప్పటికి ఏది తోస్తే అది ఆచరణలో పెట్టే స్తున్నారు. తొందరపాటు నిర్ణయాలు ఒక్కో సారి ప్రమాదకారణాలు అవుతున్నాయి.

అటువంటివారికి కౌన్సిలింగ్ ఏర్పాటు చేస్తే సంసారాలు చక్కదిద్దుకుంటారనే ఆలో చన రావడం తరువాయి ఆచరణలో పెట్టింది. ప్రత్యేకించి ఆఫీస్‌లా రిజిస్టర్ చేయలేదు. తెలిసినవాళ్లు ఒకళ్లిద్దరున్నా వారి ద్వారా సదిమందికీ తెలియడం, ఉప యోగపడటంతో అనుకున్న ఫలితాలు కని పించాయి.

ఓరోజు ఉమా, భర్తా వచ్చారు. ఉమలో పూర్వపు అధైర్యం లేదిప్పుడు. సంతోషంగా కనిపిస్తోంది. "ఎలా వున్నారు ఉమా?"

అభిమానంగా అడిగింది షాలిని.

"మిమ్మల్ని కలిసి చాలా రోజులైందంటూ తీసుకువచ్చింది ఉమ" అన్నాడు అనీల్.

"ఈ ఆంటీని మరచిపోయినట్టున్నావే ఉమా?" నవ్వుతూ అంది షాలిని.

"సారీ ఆంటీ. మామయ్యగారి ఆరోగ్యం బాగాలేక వెళ్లినదాన్ని చాలాకాలం వుండిపోవాల్సివచ్చింది" సంజాయిషీ చెబుతూ అంది ఉమ.

"మా ఇద్దరి అవగాహనా లోపం కారణంగా మనస్పర్థలు వచ్చాయి. నేను అప్పట్లో చాలా చికాకుల్లో వుండి ఉమని గాయపరిచేలా ప్రవర్తించాను. ఇద్దరమూ అసహనంతో విడిపోవాలనే నిర్ణయించుకున్నాం కూడా. కానీ నన్ను నేను కంట్రోల్ చేసుకుని బాగా ఆలోచించాను. ఉమ నేను కోరుకున్నవిధంగా లేనప్పుడు నేనే ఆమెకి తగినట్లు మారితే నయమనిపించింది.

పంతానికి పోయి, ఉమ మాత్రం దూరంగా వెళ్లి ఎలా జీవించగలదు? పాప భవిష్యత్ ఏమిటి? ఒక తండ్రిగా జన్మనిచ్చి పాపని అనాథని చేయడం ఎంతవరకూ న్యాయం? ఉమకి మరో భర్త లభించవచ్చు. కానీ పాపకి పితృవాత్సల్యం లభ్యం కాదనే వివేకం నన్ను హెచ్చరించడం వలన ఆ ఆలోచన విరమించుకున్నాను. నాన్నగారి ఆరోగ్యం బాగుండకపోవడంతో ఆయనతో పాటు వుండాల్సివచ్చింది. ఉమ కూడా ఆయనకి సేవచేసింది. ఉమని చూసిన అమ్మలో మార్పు వచ్చింది. కోడల్ని ఆదరించింది. నాన్నగారు అనారోగ్యంతో మరణించారు. అమ్మలో అహంకారం, గర్వం, దురుసుతనం తగ్గాయి. దైవభక్తిలో మునిగిపోయింది. అత్తాకోడళ్లు, తల్లీకూతుళ్లలా మారిపోయారు. మేం ఇప్పుడు చాలా హ్యాపీగా వున్నాం" అంటూ చెప్పుకొచ్చాడు అనీల్.

అతను బయటికి వెళ్లినప్పుడు "ఉమా, ఇది నిజమేనా? అనీల్ నీకు అనుకూలంగా మారిపోయాడా?" అని అడిగింది షాలిని.

"ఔనాంటీ. అనీల్ పూర్తిగా మారిపోయాడు. నేను కూడా గతాన్ని మరచి ముఖ్యంగా మీరు అనుభవంతో చెప్పిన మాటలు విన్న తర్వాత అతని అండ లేకుండా జీవించడం నిజ జీవితంలో సాధ్యంకాదని తెలుసుకున్నాను. ఆవేశం అనర్థమని అర్థమైంది. మామగారి మరణం మా అందర్నీ దగ్గరికి చేర్చింది. పంతానికి పోయి సాధించేది ఏమీలేదు. పాపకి తండ్రి ప్రేమని దూరం చేసినదాన్నవుతాను. మా అత్తగారు తన పూర్వీకులు గ్రామంలో నిర్మించిన దేవాలయానికి తానే అర్చకురాలిగా వెళ్లాలని నిశ్చయించుకున్నారు. ఆవిధంగా ఏర్పాటుచేసి వచ్చాం" అంటూ జరిగినవన్నీ వివరించింది.

"చూశావా ఉమా, కొన్ని సమస్యలని కాలమే పరిష్కరిస్తుంది. ఆల్ ది బెస్ట్" అంటూ వీడ్కోలు చెప్పింది షాలిని.

★ ★ ★

"నా పేరు అంజని. ఉమ మీ గురించి చెప్పి, అడ్రస్ ఇచ్చి కలవమంది. నేనామెకి దూరపు బంధువుని" అంటూ పరిచయం చేసుకుంది ముప్ఫై సంవత్సరాల యువతి.

"అలాగా, రామ్మా. నీ సమస్య ఏమిటో చెప్పు. నాకు చేతనైన సహాయం చేస్తాను" అంటూ ఆదరంగా పిలిచింది షాలిని.

"నేనిక్కడ వర్కింగ్ విమెన్స్ హాస్టల్లో వుంటున్నాను"

"నువ్వు కనీస సభ్యత పాటించకుండా నేరుగా వచ్చేశావు"

"సారీ ఆంటీ, ఆవేశంలో ఆత్రుతగా మీ పర్మిషన్ తీసుకోకుండా వచ్చాను" క్షమాపణ కోరింది అంజని.

"నువ్వు ఉమకి బంధువయినా కాకపోయినా ఇక్కడికి వచ్చేవారంతా నాకు సమానమే. నీకంటే ముందు వచ్చినవారు చాలా సేపటినుంచీ వెయిట్ చేస్తున్నారు. నువ్వు బైటకు వెళ్లి అలా వున్నవారెవరో కనుక్కుని పంపించు. ఆ తర్వాతనే నువ్వు రా"




# పరిణముత్యాలు

* న్యాయాన్ని, ధర్మాన్ని, సుఖ సంతోషాల్నీ, ఆఖరుకు దైవత్వాన్ని కూడా యుద్ధోన్మాదం నశింప చేస్తుంది.

– చార్లెస్ సైనర్

* ప్రశాంతత నాలుగు రకాలు. మాటలకు సంబంధించినది, కళ్లకు సంబంధించినది, చెవులకు సంబంధించినది, మనసుకు సంబంధించినది. వీటిలో మానసిక ప్రశాంతత చాలా విశిష్టమైనది.

– రమణ మహర్షి

* నీవు సమర్థుడవు కావాలనుకుంటే ఓడినవారి పట్ల జాలి చూపడం కాదు, గెలిచినవారిని చూసి అసూయ చెందాలి.

– ఒక సూక్తి

* ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలనే కోరిక, దాన్ని మార్చాలనే కోరిక - ఈ రెండూ మానవ ప్రగతికి ప్రధాన ప్రేరకాలు.

– రస్సెల్

* కోపంగా ఉన్నప్పుడు ఉత్తరానికి జవాబు రాయవద్దు.

– చైనా సామెత

* అసత్యవాదులు ఒక అబద్ధాన్ని కప్పి పుచ్చడానికి ఇరవై అబద్ధాల్ని చెప్పాలన్న విషయాన్ని తెలుసుకోరు.

– అలెగ్జాండర్ పోప్

* పెరుగుతోన్న వయసుతో కాదు, చేసే సత్క్రియలతో జీవితం సార్థకమవుతుంది.

– షెరిడాన్

* ఇంద్రియనిగ్రహం వల్ల లౌకిక మార్గం, ఆధ్యాత్మికమార్గం రెండూ సుఖమయమవుతాయి.

– డాంటే

* పూర్తిగా వికసించిన గులాబీ సువాసన తెలుసుకోవాలంటే ముళ్ల బాధ తప్పదు.

– సుభాష్‌చంద్ర బోస్

* దుడుకుతనం కొంతమందికి విజయాన్నిస్తుందేమోకానీ ఎంతోమందికి దురదృష్టానికే హేతువవుతుంది.

– ఎమర్సన్

సేకరణ : జయప్రకాష్ నారాయణ్

అంటూ చెప్పగానే తల వంచుకుని బైటకి వెళ్లింది అంజని. ఆమెకన్నా ముందు వచ్చినవారు ఇద్దరున్నారు. వారు మాట్లాడి వెళ్లాకనే వచ్చింది అంజని.

"గుడ్, తప్పు దిద్దుకున్నావ్. ఓకే. ఇప్పుడు చెప్పు. ఎంత లేటైనా నీతో మాట్లాడతాను" అంది షాలిని.

"థాంక్స్ ఆంటీ, నాకు పదహారు సంవత్సరాల వయసులో పెళ్లయింది. నా భర్తకి అప్పటికి సుమారు ముప్ఫై సంవత్సరాలు. పెళ్లంటే ఇష్టంలేదనీ, చదువుకుంటాననీ ఎంతగా పేచీ పెట్టినా మా తల్లిదండ్రులు బలవంతాన పెళ్లి జరిపించారు. నా భర్త మోటుగా, అసహ్యంగా వుండటమేకాదు, మృగంలా ప్రవర్తించాడు. రూపానికీ, చేతలకీ ఒకేలా వున్న అతణ్ణి భరించలేక ఫస్ట్ నైట్ అయిన మర్నాడే భయపడి వచ్చేశాను. అమ్మతో చెప్పి ఏడ్చాను. అమ్మ ఊరడించి నాన్నగారితో నా భర్తకి చెప్పించింది. 'అమ్మాయి చిన్నపిల్ల, భయపడుతోంది. కొద్దికాలం ఓర్చుకుంటే అనుకూలంగా నడుచుకుంటుంది. దయచేసి టైమ్ ఇవ్వండని'. అతను సరేనని నాన్నముందు ఒప్పుకుని, రాత్రయ్యేసరికి వేధించసాగాడు. అప్పుడు నాన్నగారికి తను చేసిన తప్పు తెలిసివచ్చింది. కోపంతో అతడితో ఘర్షణపడ్డారు. ఏమాత్రమూ వివేకంలేని ఆ మనిషి తనకి సరిజోడీ కాని నన్ను పెళ్లి చేసుకోవడమేగాక, దౌర్జన్యంగా లొంగదీసుకోవాలని ప్రయత్నించడంతో ఈ పెళ్లి చేసినందుకు అందరూ విచారించారు. ఏంచెయ్యాలా అని ఆలోచిస్తూండగా అతడే నేను వైవాహిక జీవితానికి అర్హురాలిని కాదని డైవోర్స్‌కి అప్లై చేశాడు.

అలా అతణ్ణించి మూడు రోజులకే తెగతెంపులు జరిగాయి. అక్కాబావల ప్రోత్సాహంతో ప్రైవేట్‌గా పరీక్షలకి చదివి గ్రాడ్యుయేషన్ చేశాను. చిన్న ఉద్యోగమూ వచ్చింది. నాన్నగారు సడన్‌గా హార్ట్ ఎటాక్‌తో చనిపోయారు. అమ్మ అన్నయ్యతో వెళ్లిపోయింది. నాకిక అక్కాబావలే శరణ్యం అయ్యారు. నేను బైటకి వెళ్లి వుంటానంటే 'నీకొచ్చే జీతం తక్కువ. వెళ్లి ఏంబాధలు పడతావు?' అంటూ బావగారు ఒప్పుకోలేదు. అక్క కూడా తన స్వార్థం ఆలోచించి పిల్లలని, ఇంటిని కనిపెట్టివుండే ఆయాలా భావించి బావనే సమర్థించింది. అప్పటి దాకా ఒక చెల్లిలా ఆశ్రయమిచ్చిన బావలో రానురాను రాక్షసుడు నిద్రలేచాడు. దానికి తోడు అక్కకి అనారోగ్యం. నన్ను చూపులతో వెంటాడటం, కోరికతో వేధించడం కొనసాగించాడు. ఒంటరిగా వుండే అవకాశం కోసం కొన్నాళ్లు వేచివున్నాడు. అక్క అసహాయత కారణంగా ఆమె ఎదుటే తన కోరిక తెలియచెప్పసాగాడు. నేను అక్కతో చెప్పేశాను. ఇక అక్కడ వుండటం నా తరం కాదని, బావ మారిపోయాడని.

ఓరోజు, "అన్నయ్య దగ్గరికి వెడతావా, వర్కింగ్ విమెన్స్ హాస్టల్లో చేర్తావా?" అనడిగింది. అంతకుముందోసారి అన్నయ్య దగ్గరున్న అమ్మని చూడాలని వెళ్లినప్పుడు "అంజూ, ఇక్కడ వుండటం నాతరంకాదు. నువ్వు, నేను వేరే ఇల్లు తీసుకుని వుందాం. డబ్బు చాలకపోతే నేనూ ఏదైనా పనిచేస్తాను" అంటూ వదినదగ్గర వుండలేని నిస్సహాయత వెల్లడించింది అమ్మ. వదిన గురించి తెలిసిందే! కాబట్టి, అన్నయ్య దగ్గర వుండే ప్రసక్తి లేనేలేదు. అమ్మని కూడా తెచ్చుకుని వేరే ఇల్లు తీసుకుని వుంటున్నాం.

తాత్కాలికంగా బావ పోరు తప్పింది. ఎప్పుడైనా దొరక్కపోతానా అని ఆశ చావక, ఇంటికి వచ్చినా అమ్మ ఆ అవకాశం రాకుండా చేసేది. దాంతో రావడం మానుకున్నాడు.

నేనూ, అమ్మా ఉన్నంతలో జాగ్రత్తగా ఖర్చు చేస్తూ కుదుటపడ్డాం. నా దైనందిన జీవితంలో ఒకతను బస్‌లో పరిచయమయ్యాడు. తన కష్టసుఖాలు చెప్పుకోవడంతో




నేనూ నా గురించి చెప్పాను. క్రమంగా నేను అతని ఆకర్షణలో పడ్డాను. ఆకర్షణ అనేది ప్రేమకు దారి తీయచ్చు. పెళ్ళికీ కారణం కావచ్చు. నేను ప్రేమలో పడితే, అతడు మాత్రం అవసరార్థమే నాతో పరిచయం పెంచుకున్నాడనీ, ప్రేమ అనే ట్రాప్‌లో పడవేశాడనీ తెలుసుకునేసరికి నా సర్వస్వం కోల్పోయాను.

అతడు నాతో చెప్పిన వాటిలో సగం అబద్ధాలే. తండ్రి తన తల్లికి తాళి కట్టిన భర్త కాడట. అందువలన తండ్రి పేరు చెప్పుకోలేని అనాథగా మిగిలిపోయాడట. తల్లి ఒట్టి అమాయకురాలు కనుకనే మోసపోయిందట. తండ్రి అనే అతడు ఏ మాత్రమూ ఆర్థికపరంగా ఆదుకోలేదట. తల్లి ఇచ్చిన సుఖానికి బదులుగా ఇల్లు కొనిస్తానంటే అభిమానపడి తను వద్దన్నాడట. తల్లి గురించే తను పెళ్ళి చేసుకోలేదట. వచ్చిన కోడలు అమ్మను సరిగా చూడదనే భయమట. నన్ను చూసినప్పుడు ఆవిడకు తగిన కోడల్ని అని తెలుసుకున్నాడట.

"అమ్మతో మాట్లాడు. ఆవిడ అంగీకరిస్తే పెళ్ళి చేసుకుందాం" అన్నాను అతన్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియక. లేకుంటే అమ్మ అంగీకారంతో పనేమీలేనేలేదు.

"అలాకాదు. నేను చిన్న ఉద్యోగం చేస్తున్నాను అంజనీ! ఎప్పటికైనా నేనొక ఆఫీసర్ కావాలని ఆశయం. అందుకే ఐ.ఎ.ఎస్.కి ప్రిపేర్ అవుతున్నాను. కోచింగ్ తీసుకుంటున్నాను. నాకు సెలక్షన్ వచ్చాకనే మనం పెళ్ళి చేసుకుందాం. అందుకు నీ ప్రోత్సాహం కావాలి. నాకోసం నువ్వు వేచి వుండాలి" అన్నాడు.

"నువ్వు కోచింగ్ తీసుకుని అవసరం అయితే రెండోసారి పరీక్ష రాయవలసి వచ్చేసరికి ఏజ్ బార్ అవదా?" అనడిగాను యథాలాపంగా. అప్పుడొక యదార్థం అతడు ముందుగా చెప్పనిది తెలిసి వచ్చింది. అతడు చెప్పిందేమిటంటే తనకు రిజర్వేషన్ వుందని.

"ఏ కులం అయితేనేంలే! మంచి ఆశయంతో, కలక్టర్ కావాలనుకున్నప్పుడు. అతడు చెప్పిన ఆశయాలను ఆచరణలో పెట్టినప్పుడు చాలా గొప్పవాడే కాగలడు" అనిపించింది.

"సంతోషంగా నీకోసం ఎన్ని జన్మలైనా వేచి వుంటాను" అన్నాను మనస్ఫూర్తిగా. ఈ మాటలలో నా బలహీనత ధృవపడిందేమో నేను ఆలోచించలేదు.

అతడికి మనసా, వాచా అంకితమైపోయి, అతను కోరిన విధంగా సహకరిస్తూ వచ్చాను. ఓసారి అతడికి తీవ్రమైన జ్వరం వచ్చింది. ఒంటరిగా జ్వరంతో రూమ్‌లో ఒక్కడూ ఎలా వుంటాడనే జాలితో మా ఇంటికి తీసుకువచ్చి, రెండురోజులు అమ్మా, నేనూ కనిపెట్టి వున్నాం. బావనుంచి నా శీలాన్ని కాపాడగలిగిన అమ్మ, ఇప్పుడు నాకు ఇష్టమేకదా, అతడు కాబోయే భర్తే కదా! అనుకుందేమో. నాకడ్డు రాలేదు.

అదిగో ఆ నమ్మకమే. జ్వరంతో వున్న ఆ అవకాశవాది పాలిట వరం అయింది. నేను నా సర్వస్వం దోచుకున్న అతణ్ణి మాత్రమే తప్పు పట్టను. ఎంత పెళ్ళి అవబోతోంది అనే నమ్మకం వున్నా అతడి సామీప్యం, సెక్స్ కావాలని ఆత్రపడే వయసూ గల నేను కూడా ఆ సుఖాన్ని ఆశించానని, మీ దగ్గర నిర్మొహమాటంగా ఒప్పుకుంటాను ఆంటీ. నన్ను వంచన చేసుకుని, మీ ఎదురుగా అమాయకత్వం నటించలేను.

అతడు ఆరోగ్యం చేకూరి, ఇంటికి వెళ్ళిపోయాడు. అమ్మ అతణ్ణి ఆదుకోగలిగామని చాలా సంతోషించింది. అమ్మకి నాపట్ల ఎంతో శ్రద్ధ. ఎవరైనా సహాయం కోరి వస్తే, తన కొడుకులా భావించి ఆదరించగల గొప్ప మనసావిడది. అమ్మతో మా ఇద్దరి పరిచయాన్ని చాలా తక్కువ చేసి చెప్పాను. మా ఆఫీస్‌లోనే పనిచేస్తాడనీ, అతడి తల్లి గ్రామంలో ఎక్కడో వుందనీ, త్వరలో తీసు

కువస్తాడనీ చెప్పాను. అమ్మకి ఇరుగు పొరుగు వారితో చనువుగా ఉండడటం అల వాటులేదు. ఇద్దరమూ ఆడవాళ్ళం. ఎవ రితో పరిచయాలు పెంచుకున్నా, ఏ అనర్థా లకు దారితీస్తాయోనని భయం. తన వయ సుగల ఒకరిద్దరితో మాత్రమే మాట్లాడు తుంది.

రెండురోజులు మా ఇంట్లో వున్న అతడు ఎవరని వారు అడిగితే, అమ్మ దాచకుండా చెప్పింది. కాబోయే అల్లుడని. అమ్మంటే వారికి చాలా అభిమానం. వారిని పిల్లలు పట్టించుకోరు. అమ్మ చేదోడుగా వుంటుం దని కష్టసుఖాలు పంచుకుంటారు. ఈ విధంగా గుట్టుగా జీవిస్తున్న మా జీవితం లోకి రాహువులా ప్రవేశించి అల్లకల్లోలం రేపాడు అతడు.

మా ఇద్దరిమధ్యా దగ్గర బంధం ఏర్పడ్డాక నేను తరచుగా అతడ్ని కలుస్తూనే వున్నాను. కానీ అతడి ప్రవర్తన రానురాను అనుమానాస్పదంగా తోచింది. నా రాక అంతగా ఇష్టపడకపోవడం, కొంతమంది అమ్మాయిలు అతడి ఇంటికి రాకపోకలు సాగించడం, వాళ్ళెవరని నిలదీస్తే బంధువు లనీ, పరీక్ష ఫీజులకోసం, ట్యూషన్స్ చెబుతు న్నానని అబద్ధాలు చెప్పడం కొనసాగిం చాడు. అతడి నిజస్వరూపం ఏమిటో తెలిసి వచ్చి అసహ్యం కలిగింది. నా అనుమానం నిజం అనడానికి రుజువులూ దొరికాయి. పూర్తిగా అర్థమైంది. అతడు పక్కా మోస గాడు. ఐ.ఎ.ఎస్. లేదు, కోచింగూలేదు. నాలాంటి ఒంటరివాళ్ళకు వల వేసి మోజు తీర్చుకునే కామాంధుడు.

అన్నింటికీ అమ్మేగా తోడు. 'నమ్మిన నిన్ను మభ్యపెట్టాను. నేను దారుణంగా మోసపోయాను' అంటూ అమ్మ ఒడిలో తల దాచుకుని విలపించాను. అమ్మ నన్ను ఓదార్చింది. 'నామీద కోపం రాదూ. అసహ్యం లేదూ' అంటూ రోదించాను.

"పిచ్చితల్లీ, ఆడపిల్ల జాగ్రత్తగా వుండాలని అనుకుంటూనే విషవలయంలో చిక్కుకుం టోంది. నీ మనసు నాకు తెలియదా తల్లీ. తగిన తోడుకోసం ఆత్రపడడం నీ తప్పుకా దమ్మా! నేనే అర్థం చేసుకోకుంటే అమ్మను కానేకాను" అంటూ అక్కున చేర్చుకుంది. ఇదో మర్చిపోలేని గుణపాఠం. ఎవరినీ నమ్మరాదనే హెచ్చరిక. ఇది నా కథ"

"ఇప్పుడు నా వలన నీకు కావల్సిన సహాయం ఏముంది?" అంజని చెప్పిం దంతా విని అడిగింది షాలిని.

"ఆ దుర్మార్గుడ్ని ఏదోవిధంగా రచ్చకీడ్చి బుద్ధి చెప్పేదాకా నా మనసు శాంతించదు. మీరు నాకు సహకరించండి" అంజని రౌద్ర రూపం దాల్చిన దుర్గాభవానిలా మారిపో యింది.

"అంజనీ, నీ జీవితం విషాదవంతమే. చాలా కుటుంబాల్లో ఆడపిల్లలు ఈ రకమైన సమస్యలు ఎదుర్కొంటూనే వున్నారు. సమ స్యనుబట్టి పరిష్కారమూ వుంది. పరిచయం పెళ్ళివరకూ రాకపోవడమే మంచిదైంది. ఇప్పుడు కొద్దికాలమే నిన్ను బాధ వేధిస్తుంది. పెళ్ళి అయితే జీవితకాలమూ నరకప్రాయమే అయివుండేది. సమయం చూసి ఎటాక్ చేద్దాం. అతడికి అనుమానం రాకుండా ప్రవ ర్తించు. గొడవ పెట్టుకోకు. సామరస్యంగా వుండు. మరోవైపునుంచి నేను నా ప్రయ త్నాలు చేస్తాను. నీ సమస్య నాక్కూడా ఓ సవాల్. సక్సెస్ అయితే ఇద్దరిదీ విజయమే అవుతుంది. నీకు వేరే జాగ్రత్తలు చెప్పాల్సిన అవసరంలేదు. నువ్వేమీ తెలివి తక్కువదా నివి కాదు. అతడి అడ్రస్ ఇయ్యి. నువ్వు నిశ్చింతగా వుండు" అంటూ చెప్పి పంపించే సింది కానీ, ఎదుర్కోవడంలో చాలా మెలకు వలు పాటించాలని అర్థం అయింది. ఇటు వంటి దుర్మార్గులు పెద్దల అండ చూసుకునే వీరవిహారం చేస్తుంటారు. సామాన్యులు ఎదుర్కోలేక అవమానాల పాలవుతారు తప్పితే అతడ్ని ఏమీ చేయలేరు.

అడ్రస్ పరిశీలనగా చూస్తే ఎవరో ఇదే





అడ్రస్‌తో పరిచయం వున్నవాళ్ళేనని అన్పిం చింది. పాత డైరీలు తిరిగేస్తే చివరికి కన బడింది. అదే చిరునామా. పేరు మాత్రం వేరు... ప్రణతిది!

ఆలోచిస్తే ప్రణతి ఎవరో గుర్తుకు వచ్చింది. ఆ అమ్మాయి ఓసారి ప్రయా ణంలో ఫ్లాట్‌ఫాంమీద ఏడుస్తూ కనబ డింది. పట్టుమని పదేళ్ళు లేవు. "ఎవరమ్మా నువ్వు? మీవాళ్ళెవరితోనైనా వచ్చి తప్పిపో యావా? ఇంటినుంచి పారిపోయి వచ్చావా? ఎవరైనా మాయమాటలతో తీసుకొచ్చారా? " అని అడిగితే హృదయవిదా రకంగా ఏడుస్తూ మధ్యలో వెక్కిళ్ళుపెడుతూ చెప్పిందాపాప. "మా నాన్న మామయ్యగారి ఊరు వెడదామని చెప్పాడు. ఈ స్టేషన్‌లో దింపేసి నీకు చాక్లెట్స్ తెస్తాను. ఇక్కడ కూర్చోమని చెప్పాడు. నాన్న రాలేదు. రైలు వెళ్ళిపోయింది. నాకు భయం వేస్తోంది" అంటూ చెప్పింది.

"మరి మీ అమ్మ ఏమైంది? " అని అడి గితే,

"అమ్మలేదు. చచ్చిపోయింది" అంటూ మళ్ళీ బావురుమంది. దుర్మార్గుడైన తండ్రి కావాలని వదిలించుకున్నట్టు అర్థమైంది షాలినికి. తన కూడా తీసుకువచ్చింది. శర ణాలయంలో పెరిగి పెద్దదైంది. చాలా కాలం తర్వాత తన ఊరునుంచి వచ్చిన దూరపు బంధువుల అబ్బాయిని పెళ్ళి చేసు కోవాలని నిర్ణయించుకుని తన అనుమతి కోరింది. అతణ్ణి శతవిధాల ప్రశ్నించి నమ్మకం కుదిరాక తనే పెళ్ళి చేయించింది. అడపా దడపా వెళ్ళి చూసి వచ్చేది. వాళ్ళి ద్దరూ అన్యోన్యంగా వున్నారని తెలిశాక ఆ విషయాన్ని వదిలేసింది.

ఇప్పుడిలా అంజనిద్వారా ఈ ప్రణతి అడ్రస్ చూడడం తటస్థపడింది. అంటే అంజనిని మోసగించింది ప్రణతి భర్త అయి వుంటాడా లేక వాళ్ళీ ఊరునుంచి వెళ్ళి పోతూ ఇల్లు ఎవరికైనా అమ్మడంకానీ, అద్దె కివ్వడం కానీ చేసి వుండాలి. ఆ అడ్రస్‌కి వెళ్ళి ఎంక్వైరీ చేస్తే అన్నీ తెలిసిపోతాయి. సరిగ్గా ఇంటిముందు కారు దిగిన షాలినికి పరిసరాలు బాగా గుర్తువచ్చాయి. అయితే ఇంటికి తాళం వుంది. పక్కింట్లో అడిగితే పిలిచి, కూర్చోపెట్టి షాలిని పేరు ప్రఖ్యా తులు తెలుసుకుని అంతా వివరంగా చెప్పారు.

ఆ ఇంట్లో వుండే అతని పేరు హరి బాబు. మొదట ఇంట్లో దిగినప్పుడు పెళ్ళైం దనీ, భార్య డెలివరీకి వెళ్ళిందనీ, సంవత్సరం దాకా రాదనీ చెప్పాడు. ఎవరెవరో ఆడ వాళ్ళు వచ్చిపోతుండడం చూసి అడిగితే బంధువులనీ, స్నేహితులనీ చెప్పసాగాడు. రాత్రిళ్ళు హరిబాబు ప్రవర్తన అనుమానాస్ప దంగా వుండడం గమనించి, ఇల్లు ఖాళీ చేయమన్నారు.

అద్దె మీరడిగినంతా చెల్లిస్తాను. ఈ ఇల్లు నాకు బాగా కలిసివచ్చింది. దయచేసి ఖాళీ చేయమనద్దు. అంటూ బతిమిలాడితే, మా ఆయన "పోనిద్దూ అతడి గొడవ మనకెం దుకు? పేచీకోరు కాదు. మీరు జాగ్రత్తగా వుండండని మమ్మల్ని మందలిస్తే చేసేదిలేక వూరుకున్నాం. మీరు పెద్దమనుషుల్లా పరు వుగల వారిగా కనిపించారని వివరాలు చెప్పాం" అన్నారు.

"హరిబాబు భార్య ప్రవర్తన ఎలా వుండేది? " ప్రణతి గురించి షాలిని అడి గింది.

"ఆ అమ్మాయి చాలా మంచిపిల్ల. ఏనాడూ బైటకి వచ్చేదికాదు. తప్పనిసరిగా మాతో మాట్లాడేది. అతను కంట్రోల్ చేసే వాడో, ఆ అమ్మాయి స్వభావమో తెలుసు కునే అవకాశం లేకపోయింది"

"హరిబాబు ఈ ఇంట్లో ప్రవేశించే టైంలో ప్రణతి లేదు. డెలివరీ అయ్యాక అంటే సుమారు సంవత్సరం తర్వాత వచ్చింది. అంతేకదా మీరు చెప్పేది? ప్రణతి వచ్చాక కూడా ఆడవాళ్ళు వచ్చేవారా? "

"సాధారణంగా భార్య వుండగా వచ్చే బంధువులను పెద్దగా పట్టించుకోం. ఆవిడ లేనప్పుడు వచ్చిన ఆడవాళ్ళంటే కుతూహలం కలగడం సహజమేకదండీ..." వాళ్ళ చర్యను సమర్థించుకోవడం నవ్వు తెప్పించింది షాలినికి.

ఆమెకు స్పష్టంగా అర్థమైపోయింది.

హరిబాబును నమ్మిన ప్రణతి పూర్తిగా మోసపోయింది. అయితే ప్రణతి ఎక్కడ వున్నట్టు? హరిబాబును అడిగితే చెబుతాడా? అంజని గురించి నిలేస్తే ఏం సమాధానం చెబుతాడు? ఇంతవరకూ షాలిని పరిష్కరించిన సమస్యలు ఒకరకం, అంజనిది మరొకరకం. క్లిష్టతరమైంది కూడా. హరిబాబుతో మాట్లాడి చూద్దాం. ప్రణతికి ఎవరూ లేరుకదా? హరిబాబు బంధువని ఎలా గుర్తించింది? డెలివరీకి మరో ఊరు వెళ్ళే అవసరంలేదు, అవకాశమూలేదు. బహుశా... ప్రణతికి తన విశృంఖల శృంగార చర్యలు తెలియకుండా వుండడానికి వేరే ఉంచాడా? ఇవన్నీ ప్రణతిని కలిసినప్పుడే తెలుస్తాయి. అనుకుంది షాలిని.

ఊరికే చూడాలని వెళ్ళినట్టుగా, రెండురోజుల తర్వాత షాలిని హరిబాబు ఇంటికి మళ్ళీ వెళ్ళింది. ఈసారి అతను ఇంట్లోనే వున్నాడు. షాలిన్ని చూసి కంగారుపడ్డాడు. ఆశ్చర్యం నటిస్తూ, "రండి మేడమ్! చాలాకాలానికి గుర్తొచ్చాం" అంటూ తప్పనిసరిగా ఆహ్వానించాడు.

"అవును హరీ! చాలాకాలంగా ప్రణతి కబురేమీ తెలియలేదు. ఇల్లూ, భర్తా, పిల్లలూ, సంసారం గొడవల్లో మామూలేకదాని, చూడాలనిపించి వచ్చాను" అంది మామూలుగా.

"సారీ మేడమ్! నేను ప్రణతికి చెబుతూనే వున్నాను. ఆంటీకి కనిపించి పిల్లలకి ఆశీస్సులు తీసుకోమని. తనకి ఆరోగ్యం బాగుండడంలేదులెండి. నెల తప్పినప్పట్నించీ బెడ్ రెస్ట్ కావాలని డాక్టర్స్ అన్నారు. అందుకే మా అమ్మగారింటికి పంపించాను" అన్నాడు.

"హరీ! ప్రణతిని చూడాలి. మీ అమ్మగారి అడ్రస్ ఇవ్వు" అని అడిగింది అతడి ముఖ కవళికలను పరిశీలిస్తూ షాలిని.

"అయ్యో మేడమ్. మీరా వూరు వెళ్ళడం అసాధ్యం. ఒట్టి పల్లెటూరు. రోడ్డు సరిగ్గా లేదు. ప్రయాణ సాధనాలు లేవు. కారు వెళ్ళదు, కరెంట్ లేదు"

"ఊరుకోవోయ్ హరీ! మనిషికోసం వెడతాంకానీ, సదుపాయాలకేంలే" అంటూ అతను ఎన్ని రకాల కారణాలు చెప్పినా షాలిని పట్టుబట్టింది. ఇక తన చాతుర్యం పనికిరాదని తెల్సుకుని "క్షమించండి మేడమ్, ఆమె నాతో తెగతెంపులు చేసుకుని వేరే వెళ్ళిపోయింది" మెల్లిగా బయటపెట్టాడు.

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగింది షాలిని.

"నేను జీవితాన్ని పరిపూర్ణంగా ఎంజాయ్ చేయాలనే మనస్తత్వం కలవాడ్ని. నా అలవాట్లు ప్రణతికి నచ్చలేదు. ప్రతీ విషయంలోనూ అభిప్రాయ భేదాలు, పోట్లాటలు, ఇలా మా మధ్య అగాధం పెరిగిపోయింది. చివరికి చెప్పకుండానే ఇంటినుంచి వెళ్ళిపోయింది"

హరి మాటలు పూర్తికాకుండానే కోపంగా చెప్పింది షాలిని.

"సరదాలు, చెడు వ్యసనాలూ ఒకటికావు. నీ గురించి ఈ మధ్య చాలా విషయాలు తెలిశాయి. నువ్వో పయోముఖ విషకుంభానివి. లేని బంధుత్వాలు చెప్పి, నన్నూ, ప్రణతినీ మోసగించావు. ప్రణతిని నేను పది సంవత్సరాల వయసునుంచీ ఎరుగుదును. ఆమె స్వభావం నాకు బాగా తెలుసును. అభాగ్యురాలైన ప్రణతిని ఏమాశించి మోస

గించావు? నీకు ఆడవాళ్ళే కావాలంటే అటువంటివాళ్ళు చాలామంది వుంటారు. ఎర వేయక్కర్లేదు. శరణాలయం పసివాళ్ళ మధ్యలో నిశ్చింతగా సాగిపోయే ఆ పిల్ల జీవితాన్ని పెడదారి పట్టించావు. ముందుగానే వివరాలన్నీ సేకరించి, మమ్మల్ని మోసగించావ్.

ప్రణతి ఏమైందో చెప్పు. అమాయకంగా నిన్ను నమ్మి వచ్చిన ఆ పిల్లకి ఎటువంటి ఆపద కలిగినా నిన్ను విడిచిపెట్టను. జైలుకి పంపి తీరుతాను. ఇక మీదట ఏ ఆడపిల్లా, నీ వలన మోసపోకుండా తగిన శిక్ష పడేలా చేయగలను. నీ గుట్టూమట్టూ రాబడతాను" ఒళ్ళు తెలియని కోపంతో అరిచింది షాలిని. పక్కనున్నవారంతా వచ్చి చేరడంతో వంచిన తల ఎత్తలేదు హరిబాబు.

అప్పటికెలాగో ఆమె ఆగ్రహాన్ని కంట్రోల్ చేసి తీసుకుపోయారు పక్క వాటావాళ్ళు. ఇంటికి వచ్చేసరికి అంజని వచ్చి వుంది. షాలిని తీరు చూడగానే చాలావరకూ అర్థం చేసుకుంది.

"ఆంటీ, ప్రణతి, నేను, మరో అమ్మాయి... ఇలా ఎందరో హరిబాబు వలలో పడ్డ చేపలం. కావాలని వలవేసిన వ్యక్తి తిరిగి నీటిలో వదిలిపెడతాడనుకోవడం భ్రమ. హరిబాబులాంటివారు చాలామంది వుంటారు. ప్రణతి, నేను కట్నం ఇవ్వలేని నిరుపేద అమ్మాయిలు దీపం వంటి అతడి వేడిలో భస్మీపటలం అవుతుంటారు. దీపం సెగ ఎప్పటికైనా మాడ్చి మసి చేయగలదని గ్రహించుకోని వారు అలా ఆకర్షణలో పడిపోతూనే వుంటారు. కానీ ఈ విషయాన్ని చాలా ఆలస్యంగా తెలుసుకుంటారు. అదే దురదృష్టం" అంది అంజని.

అమ్మాయిలు అన్నీ తెలిసి కూడా మోసపోతూనే వుంటారు. మగవాడు తప్పు చేసినప్పుడు పశ్చాత్తాపపడతాడా? లేక ఆ తప్పుకే అలవాటు పడిపోతాడా? అసలు అతను తప్పు అనుకోడుగా. మగవాడికి అదో ఎంజాయ్‌మెంట్ అంతే!




"మమ్మీ లైఫ్‌కి ఛేంజ్ కావాలి. నువ్వు, డాడీ అమెరికా ట్రిప్ వేయండి. ప్రపంచంలో తెలుసుకోవల్సినవి చాలా వున్నాయి. అనుభవించాల్సినవి మరెన్నో అందాలున్నాయి" అంటూ తుషార ఇ.మెయిల్ పంపినప్పుడు, సమీర్ కూడా సరిగ్గా అదే ఆలోచనలో ఉన్నాడు. అందుకే వెంటనే "షాలూ ప్రయాణానికి ఏర్పాట్లు చెయ్. టికెట్స్ బుక్ చేస్తాను" అన్నాడు.

"ఎలా సమీర్? ఈ శరణాలయాన్ని అర్థాంతరంగా ఎవరికి విడిచిపెట్టను? " దిగులుగా చెప్పింది షాలిని.

"అదిగో అదే మరి వద్దంటాను. ముప్ఫై సంవత్సరాలు ఇలాగే గడిచిపోయాయి. జీవితంలో మార్పు వుండాలి. రొటీన్ లైఫ్ నుంచి ఛేంజ్ కోరుకోవాలి. శరణాలయాన్ని కొన్ని రోజులు మర్చిపో" అన్నాడు కోపంగా.

"నిజమే. ఆలోచిస్తే విజ్ఞానమూ, మనసుకి ఉల్లాసమూను. సమీర్ సంతోషంగా

అడిగినప్పుడు అలాగే పద వెడదాం అనుంటే ఎంత సంతోషించేవాడు. ఏమిటో అప్రయత్నంగా మనసులోమాట వచ్చేసింది. శరణాలయానికేం ఎవరో ఒకరికి అప్పగించవచ్చు అంజని అమ్మగారున్నారు కదా. ఆవిడకి అప్పగించేస్తాను. కొన్ని బంధనాలు వదులుకుని, వ్యక్తిగత జీవితానికీ, జీవిత సహచరునికీ విలువ ఇవ్వాలి. కదా అని తెలుసుకుంది షాలిని.

తుషార మిన్నిసోటా స్టేట్‌లోని మినియాపొలిస్ అనే ఊళ్ళో వుంటుంది. షికాగో ఎయిర్‌పోర్ట్‌కి తుషారతోపాటు రేణూ రిసీవ్ చేసుకోవడానికి వచ్చింది.

రేణూ అమెరికా ట్రిప్‌లో వుందని తెలుసును కానీ ఇలా ఎయిర్‌పోర్ట్‌కి వస్తుందని షాలిని ఊహించలేదు.



"మమ్మీ! రేణూ ఆంటీ అమెరికా వచ్చి నెల్రోజులైంది. మీరు వస్తున్నారని తెలిసి ఇలా వచ్చింది. నీకు మంచి కంపెనీ" అంది తుషార.

"హాయ్ షాలూ! హౌ ఆర్ యూ సమీర్? " ఇద్దర్నీ ఒకేసారి పలకరించింది.



"ముగ్గురూ కలిసి రెండు నెలలూ ఇట్టే గడిపేశారు. రేణూ అంతకుముందు రెండు సార్లు వెళ్ళానని ఆగిపోయింది. రేణూ, సమీర్ చూడాల్సిన ప్లేసెస్ గురించి ఓ లిస్ట్ తయారుచేశారు.

నయాగరా ఫాల్స్ చూడడానికి వెళ్ళాలని అనుకున్నారు. "రేణూ, నువ్వు చాలాసార్లు అమెరికా వచ్చావుకదా? ఏం చూడాలో చెప్పు" అడిగింది షాలిని.

"అదే! నేనూ, సమీర్ కలిసి ప్లాన్ చేశాం. షాలూ, ఈ దేశంలో నాకు బాగా నచ్చినవి నయాగరా ఫాల్స్, రెండోది గ్రాండ్ కాని యన్స్. ఎన్నిసార్లు చూసినా నాకైతే బోర్ కొట్టదు. రెండూ భిన్న ప్రదేశాలు. గ్రాండ్ కానియన్ లోయలైతే, అత్యంత ఆనందంతో అంతెత్తునుంచి దూకే జలపాతం నయాగరా! ఎత్తుకంటే దీని వైశాల్యం ఎక్కువ. ఆ అనుభూతిని అనుభవించాలేకానీ వర్ణించడం సాధ్యంకాదు.

"భావకవులకు పరవశాన్ని కలిగిస్తుంది. చూపరులకు వినోదం, ఆహ్లాదం కలిగిస్తుంది"

"సమీర్ నీకేమనిపిస్తుంది? మాట్లాడవేం? " సమీర్‌ని అడిగింది రేణు.

"నేను యూరప్, ఆసియా దేశాలు చూశానుకానీ, అమెరికా రావడం మొదటిసారి. చూసిన దానివి చెబుతున్నావ్‌కదా. లెటజ్ ఎంజాయ్" అన్నాడు సమీర్.

తుషార కూడా వస్తే బాగుండుననిపించింది షాలినికి. తనకి చాలా వర్క్ వుండిపోయిందంటూ ఆగిపోయింది తుషార. షాలిని రేణూని పరిశీలిస్తుండిపోయింది. ఇండియాలో సమీర్‌తో చాలా తక్కువగా మాట్లాడేది. ఇప్పుడు అతడితో ఒకటే కబుర్లు. సమీర్ షాలినితో అవసరం అయితేనే మాట్లాడుతున్నాడు. షాలిని కొద్దిగా హర్టయింది. అసలు ఆమె ఈ ట్రిప్ అతడి కోసమే బయలుదేరింది. అతడు ఆమెను పట్టించుకోనందుకు సహజంగానే బాధపడింది. అయితే బయట పళ్లేదు.

రేణూకి ఎప్పుడూ మాడ్రన్ డ్రసెస్ అలవాటే. అమెరికాలో అమెరికన్ స్టయిల్స్ ఫాలో అవడం షాలినికి ఎబ్బెట్టుగా తోచింది. అమెరికా అందమైనది. పరిశుభ్రమైనదీ! ఇక్కడ వయసుమళ్లిన వారు హుందాగా వుంటే టీనేజర్స్ విశృంఖలంగా వుంటారు. పబ్లిక్‌లోనే రొమాన్స్. అక్కడ ఎవరూ పట్టించుకోరు. ఇది ఈ దేశానికి మామూలే! యంగ్ జనరేషన్ వారి ఫ్యాషన్స్ మొదటిసారి చూసినప్పుడు వింతగా అనిపిస్తాయి. వుండబట్టలేక తన మనసులో మాట కూతురితో చెప్పింది షాలిని.

"యువార్ ఎడ్యుకేటెడ్ మామ్, నో కామెంట్! టేకిట్ ఈజీ" అనేసింది. అమెరికాలో మమ్మీ అనరు. మామ్ అంటారు. చదువుకున్నాను కాబట్టి కామెంట్ చేయకూడదు నిజమే! నా అభిప్రాయాన్ని కన్నకూతురితో చెప్పడం కూడా తప్పేనా? అనుకుంది.

'ఇంచుమించు తన వయసే రేణూది. చక్కగా ఎక్కడ ఎలా వుండాలో అలా వుంటుంది' అనుకోకుండా వుండలేకపోయింది రేణూతో తనను పోల్చుకున్న షాలిని. సమీర్ ఆమెను కొంటెగా దగ్గిరకి తీసుకుని హత్తుకుని కిస్ చేస్తే "ఇక్కడి వాతావరణం నిన్ను కూడా రెచ్చగొడుతున్నట్టుందే" అంది చిలిపిగా. అతడి అసంకల్ప చర్యలో ఏదో వెల్తి తోచింది.

"ఓగాడ్! నేను కిస్ చేసింది జడ పదార్థాన్నా? " కొంటెగానే అన్నా హేళనగా తోచింది షాలినికి.

అంతదాకా ఎక్కడ వుందో రేణూ హఠాత్తుగా వచ్చేసింది. "షాలూని నీతోబాటు బిజినెస్ ట్రిప్‌కి తీసుకెళ్లనందున ఏం మిస్ అయ్యావో తెలిసి వచ్చిందా సమీర్? " అంది పరిహాసంగా.

"నీ ఫ్రెండ్ మరీ బీసీ నాటి స్త్రీ. అవన్నీ




గగన కుసుమాల పరక్తిగా అన్నాడు సమీర్. ఇంటికి వచ్చేశారు.

షాలిని మనసు ఈ మాటతో దెబ్బతింది. సమీర్ కాజువల్‌గా అన్నాడా? తన అభిప్రాయాన్ని వెల్లడించే సమయం ఇదే అని చెప్పాడా? మళ్లీ సందిగ్ధంలో పడింది షాలిని. ఆలోచన్లు పెడదారి పడుతున్నాయని మనసు ప్రశాంతంగా వుంచుకోవాలనీ తననుతాను కంట్రోల్ చేసుకునే షాలినికి ఏదో ఒక సంఘటన తిరిగి మనసును కృంగదీస్తోందో లేదా ఆమెకు మరో అర్థం తోస్తోందో!

ఏదైతేనేం? సమీర్, తనూ హాపీగా వుండాలనుకుంటే రేణూ ప్రవేశం నచ్చలేదు షాలినికి. అందులోనూ సమీర్ రేణూ వైపు ఆకర్షితుడవుతున్నట్టు తోచింది. రేణూని పరిశీలనగా చూసింది. తనకన్నా స్లిమ్‌గా వుంది. డైటింగ్ చేసి, ఎక్సర్‌సైజ్ చేసి బాడీని ఫిట్‌గా వుంచుకుంటుంది. కొంచెం వయసు మళ్లాక వడలినట్టున్న రేణూ అమెరికా వచ్చాక మునుపెన్నడూ లేనంత అందంగా వుంది. కొద్దిగా నిగారింపు వచ్చి ఏదో తెలియని ఆకర్షణ ఏర్పడింది. ఎప్పుడూ మేకప్ చెరగనీయదు. తన గురించి తాను శ్రద్ధ తీసుకుంటుంది. ప్రతి చర్యలోనూ ప్రత్యేకతే! కొందరికి ఇవన్నీ అతికినట్టు సరిపోతాయి. కొందరు ఎంత నేర్చుకున్నా ఎబ్బెట్టుగానే వుంటాయి. రేణు అదృష్టవంతురాలు. స్వేచ్ఛ, అందం, ఆకర్షణ, చదువు, ఉద్యోగం... చూసినకొద్దీ అసూయ కలగసాగింది. పెళ్లి చేసుకోనందుకు దిగులు, సమస్యలూ బాధించవు. ఎప్పుడూ ఫ్రెష్‌గా వుంటుంది. మాటలతో కవ్వించగలదు అనుకుంది.

'ఏమిటిది, ఈ రోజు రేణూ గురించి ఎక్కువగా ఆలోచిస్తున్నానే! రేణూ ఇంతకు ముందు మంచి స్నేహితురాలు, ఆత్మీయురాలు అనుకున్నానే! ఇప్పుడు నా ఆలోచనలు పెడదారి పట్టాయి. మార్పు నాలోనా? రేణూలో వచ్చిందా? నేను మారడం సహజమా? మంచిగానా? చెడుగా మారేనా? ఓసారెప్పుడో సమీర్‌కి ఆడవాళ్ల పరిచయాలున్నాయని చెప్పింది రేణూయే! ఇప్పుడు రేణూతో కొనసాగుతోందా? ' షాలూ ఆలోచనలు నలువైపులా పరిగెడుతున్నాయి ఈ రోజు.

అంతలో రేణూ పిల్చింది. "షాలూ, లేచి తయారవ్. మాల్‌కి వెడదాం కొంచెం పనుంది"

"సారీ రేణూ! నువ్వెళ్లి వద్దూ, నాక్కొంచెం తలనొప్పిగా వుంది"

"కాస్త అలా తిరిగివస్తే అన్నీ పోతాయి లేవోయ్. ఒక్కదానివీ ఇంట్లో ఏం చేస్తావ్? " అంది. అంటే సమీర్ కూడా వెడతాడా? అనుకునిఒక్క క్షణం ఆలోచించి డ్రస్ ఛేంజ్ చేసుకోవాలని లేచివెళ్లింది.

తిరిగి వచ్చేసరికి సమీర్ అంటున్నాడు "రేణూ నువ్వు, షాలినీ ఎలా ఫ్రెండ్స్ అయ్యారోయ్? నువ్వెప్పుడూ ఫ్రెష్‌గా, లవ్లీగా వుంటావ్"

బదులుగా రేణూ అంటున్నది "ఈ షాలూకి శరణాలయం, అనాథలు అంటే వున్న ఇంట్రస్ట్ ఇక దేనిలోనూ వుండదా సమీర్? "

షాలిని షాక్ అయింది రేణూ మాటలు విని.

"చూశావ్‌గా? పెళ్లయింది మొదలు ఇంతే రేణూ! లైఫ్ మరీ బోర్‌గా వుందని అమెరికా తీసుకొచ్చానా ఇక్కడా అంతే! ఏదో పోగొట్టుకున్న దాన్లా వుంది. నాకైతే ఈ వాతావరణం, మనుషులూ, పరిసరాలూ, మత్తెక్కిస్తుంటే ఎటొచ్చీ అనుభవించడానికే తోడు లేనట్టనిపిస్తోంది" దిగులుగా సమీర్ చెబుతుంటే నేనున్నాగా, స్వర్గం చూపిస్తా అంటూ సమీర్‌ని వాటేసుకుంటుందేమో రేణూ అనే భయంతో "నేను రెడీ వెడదామా? " అంది షాలూ, లేని ఉత్సాహం తెచ్చి పెట్టుకుని.



చతుర... 57

మాలాఫ్ అమెరికాకి వెళ్లి తిరిగి వచ్చేసరికి నాలుగ్గంటలు టైమ్ పట్టింది. దార్లో వస్తూనే పిజ్జా తెచ్చుకున్నారు. ఫ్రిజ్‌లో ఫుడ్ చాలా వుంది అనబోయి నవ్వుతారని భయమేసి వూరుకుంది షాలిని.

"సమీర్ ఈ పిజ్జాలోకి వెనిగర్‌లో వూర బెట్టిన పెప్పర్, మష్రూమ్స్, ఆలివ్స్ వేయించాను" రేణూ చెబుతోంది.

"రేణూ నీ టేస్ట్ ఎప్పుడూ నీకు తగినట్టే వుంటుంది. అందుకే నువ్వంటే నాకిష్టం" అన్నాడు హుషార్‌గా సమీర్.

షాలిని బొమ్మలా కూర్చుండిపోయింది. ఇప్పుడు సమీర్ రేణూని బాహాటంగానే మెచ్చుకుంటున్నాడు. షాలిని వుందని జంకడంలేదు.

ఇంటికొచ్చాక తుషార, రేణూ, సమీర్ వైన్ డ్రింక్ చేస్తూ అంత పెద్ద పిజ్జాని పట్టించేశారు.

షాలిని చిన్న ముక్క తినేసరికి ఆ కారానికి కళ్లంట నీళ్లొచ్చాయ్.

"మామ్ వై డోంట్ యు లైక్ దిస్?" అడిగింది తుషార తల్లిని.

"మీ మామ్ పెరగన్నం తప్ప తినదు తుషారా" అన్నాడు సమీర్ జోక్ చేస్తూ. వాళ్ల మాటలేవీ పట్టించుకోనట్టు ప్లేట్స్ అన్నీ డిష్ వాషర్‌లో సర్దసాగింది షాలిని.

నయాగరా ట్రిప్ కూడా సమీర్, రేణూ ఎంజాయ్ చేశారేకానీ షాలిని ప్రేక్షకురాలిగా వుండిపోయింది. తిరిగి వచ్చాక చాలా రోజుల వరకూ కనిపించలేదు రేణు.

"రేణూ ఆంటీ భలే యాక్టివ్ డాడీ! బ్యూటిఫుల్ పిక్చర్" అంటూ తండ్రీకూతురూ డిజిటల్ కెమేరా పిక్చర్స్ కంప్యూటర్‌లో లోడ్ చేసి చూస్తున్నారు.

"ఈ యాంగిల్లో మామ్ స్లిమ్‌గా వుంది" అంటున్నాడు సమీర్. "డాడ్ నువ్వు బాగానే వున్నావ్ కానీ పొట్ట తగ్గించాలి. లీవ్ ఓవర్ డ్రింకింగ్" తండ్రికి సజస్ట్ చేసింది తుషార.

తనక్కడ వుందని రేణూని ఆట్టే మెచ్చుకోలేదు అనుకుంది షాలిని. తనూ వచ్చి పిక్చర్స్ చూసింది. అన్నీ చాలా బాగా వచ్చాయ్.

"తుషారా ఇక్కడ చాలా మంది ఇండియన్స్ వున్నారటకదా? నువ్వెప్పుడూ చూపించనేలేదు నీకెవరూ తెలియదా?" అంది షాలిని.

"వున్నారు కానీ నేనంత క్లోజ్‌గా వారితో మూవ్ అవను. నీక్కావాలంటే వినీలకి చెప్పి వాళ్లింట్లో ఓ రోజు డ్రాప్ చేస్తాను. తను పరిచయం చేస్తుంది. అక్కడ వాళ్లింటి దగ్గర్లో ఇండియన్ ఫ్యామ్లీస్ వున్నారు"

"ఇప్పుడంతగా వెదికి మరీ పరిచయం చేసుకోవాలా? మనం తిరిగి ఇండియా వెళ్లేవాళ్లమే కదా?" అన్నాడు సమీర్. అతడికీ అంతగా ఇష్టంలేదు వాళ్లని కలవడం.

షాలిని చిన్నబుచ్చుకోవడం చూసిన తుషార, "పోన్లే డాడ్! మామ్‌కి బోర్ కొడుతోందేమో! నువ్వెటూ న్యూయార్క్ వెళ్లినప్పుడు మామ్ ఒక్కతే వుంటుంది. ఇండియన్ ఫ్యామ్లీస్‌తో టైమ్‌పాస్" అంది తుషార తల్లివైపు మాట్లాడుతూ.

వినీల వాళ్లింట్లో దిగబెట్టిందో రోజు తుషార.

"ఆంటీ, కొంతకాలం అయితే కానీ ఇక్కడి వాతావరణానికి పరిసరాలకి అలవాటు పడలేరు. అలా అని ఒంటరిగానూ వుండలేరు. మా అమ్మగారు అత్తగారూ, ఇండియాలో కూడా ఒంటరిగా వుండలేరు. ఇక్కడికే వచ్చి వుందామని మొదట అనుకున్నారుకానీ ఇక్కడా తోచలేదు. ఇండియాలో అయితే మీకు దూరంగా వున్నామనే బాధకానీ నా పన్లు నేను చేసుకుంటాను. అవసరం అయితే చేసుకోలేకపోతే అప్పుడే వస్తాను. కొన్నాళ్లు వుండనీ అంటారు. సంవత్సరానికి ఓసారి ఆవిడ వస్తే మరో సంవత్సరం నేను ఇండియా వెడతాను" అంది వినీల.

"అవును వినీలా! చదువూ, ఉద్యోగం వున్నవారైతే ఏదో పని చేస్తారు. కొన్ని





సుఖాలు, సదుపాయాలూ ఇక్కడవున్నా మనదేశంలో పదిమంది బంధువుల రాక పోకలూ, ఫంక్షన్స్ సందడిగా వుంటుంది. ఏ డాక్టర్ దగ్గిరకి వెళ్లాలన్నా ఆటోలో ఎవ రికి వారు వెళ్లగల సదుపాయం వుంటుంది. ఇరుగూ, పొరుగూ పిలిస్తే పలుకుతారు. ఓల్డేజ్ ఇండియాలోనే సుఖంగా గడుస్తుంది. ప్రతీ దానికీ కొన్ని కష్టాలూ వుంటాయి, సుఖాలూ వుంటాయి"

"రేపు సన్‌డే నాకు తెలిసిన ఫ్రెండ్స్, పేరెంట్స్ సమావేశం వుంది. మీకు పరి చయం చేస్తాను" అంది వినీల. వినీలకు ఇద్దరు పిల్లలు. భర్త డాక్టర్. మంచి సంపా దన కనుక వినీల ఉద్యోగం చేయదు. ఖాళీ గానే వుంటుంది. ఇండియన్స్ అంతా కలసి ఒక క్లబ్ రన్ చేస్తున్నారు.

"పిల్లలకోసం అమెరికా వచ్చినప్పుడు అందరూ కలవచ్చని ఈ క్లబ్ స్థాపించారు. పండగలు, ఫంక్షన్స్, వ్రతాలు నిర్వహి స్తారు. సంవత్సరానిక్కానీ, లైఫ్ మెంబర్‌షి ప్‌కానీ తీసుకోవచ్చు. ఫ్రెండ్స్ వరకూ లభి స్తారు" అంటూ వినీల ఆ క్లబ్ గురించి వివరాలు చెప్పింది.

ఆ క్లబ్‌కి తీసుకువెళ్లి హారతి, వేదవతి, శకుంతల, జయంతి, యశోదా అనే వారిని పరిచయం చేసింది. వాళ్లు షాలిన్ని అభిమా నంగా, తెలిసినట్టే పలకరించారు. "వెల్‌కమ్ టు న్యూ మెంబర్ షాలినీ" అన్నారు చేయి కలుపుతూ.

"లేదండీ, ఇంకా నేను మెంబర్‌షిప్ తీసు కోలేదు. జస్ట్ పరిచయంకోసం వచ్చాను" అంది. వారు సమీర్ గురించి అడిగారు. ఇప్పుడే వినీల ద్వారా ఈ క్లబ్ గురించి తెలి సింది. ఈసారి తీసుకు వస్తాను అని చెప్పింది.

"మనదేశం నుంచి వచ్చి అయిదు సంవ త్సరాలు గడిచింది. అక్కడ మన జనరేషన్ మార్పు గురించి చెప్పండి" అన్నారు హారతి.

"నేను గమనించినంత వరకూ చెబు తాను" అంటూ షాలిని చెప్పసాగింది.

"తల్లితండ్రులు ఇండియాలోనూ, పిల్లలు అమెరికాలో వుండటం చాలా కామన్ అయి పోయింది. భార్యాభర్తలు అయితే ఒకరికొ కరు తోడు వుంటారు. ఒకరు గతించి మరొ కరు ఒంటరిగా వుండాల్సి వచ్చినప్పుడు పూర్వంలా, అయ్యో! పిల్లలు దూరంగా వున్నార్రు. నా జీవితం గడిచేదెలా? అనా రోగ్యం వస్తే ఎవరు చూస్తారు? అనే ఆలో చనలకు దూరంగా వుంటూ తగిన అవసరా లకు ముందు జాగ్రత్తతో డబ్బు సమకూర్చు కుని ఒంటరిగా వుండటానికి ఏమాత్రమూ సందేహించడంలేదు. ఆరోగ్యం కోసం వాకింగ్, రెగ్యులర్ డాక్టర్ చెకప్, డైటింగ్ చేస్తూ తమ వరకు టైమ్ పాస్ చేయగల వ్యాపకాన్ని కల్పించుకుంటున్నారు. భర్త లైబ్రెరీకి వెడితే భార్య భక్తిలో మునిగిపో వటం, ఇద్దరిదీ ఒకే టేస్ట్ అయితే వారి అన్యోన్యతకు ఢోకాలేదు.

మరో అడుగు ముందుకేసిన స్త్రీలు, పెళ్లి కాకున్నా తమకంటూ ఒక లోకాన్ని సృష్టిం చుకుని జీవితాన్ని సద్వినియోగం చేసుకుం టున్నారు. ఎవరిమీదా ఆధారపడాలని అను కోవడంలేదు. ఫ్రెండ్స్‌తో సైట్ సీయింగ్ ప్లజంట్ ట్రిప్స్, పార్టీలు, ఎంటర్‌టైన్ మెంట్స్, బుక్‌రీడింగ్ ఇలా వారివారి మన స్తత్వాన్ని బట్టి జీవించగల ధైర్యం తెచ్చుకు న్నారు"

"సంతానం వుండికూడా ఇలా ఎవరి దారి నవారు పిల్లలూ, పేరెంట్స్ జీవించడంలో బంధాలు, బంధుత్వాలు తల్లీబిడ్డలనే రక్త సంబంధం లేకుండా, కుటుంబం అనే వ్యవస్థ నశించిపోదా?" అంది జయంతి.

"అందుకు కేవలం ఒక్కరే కారకులు వుండరు. ఇక్కడి జీవితాన్ని పరిశీలించిన ప్పుడు నాకు అర్థమైంది. పేరెంట్స్‌ని తెచ్చి పెట్టుకోవడం వలన పేరెంట్స్‌కేమీ వుప యోగం వుండదు. కంటికి కనిపిస్తూంటారు

తప్పితే ఊరికే కూర్చోలేక ఏదో ఒక పని చేయడానికి ప్రయత్నించడం, వృద్ధాప్యంవలన చేతులు వణికి వస్తువులు జారిపడటం, సడన్‌గా అనారోగ్యంచేస్తే ఎమర్జెన్సీకి కాల్ చేయడం హాస్పిటల్లో వుండాల్సివస్తే తోడు ఇవన్నీ సమస్యలే అమెరికాలో. పిల్లలు శెలవుపెట్టి పేరెంట్స్‌తో వుండాలనేది జరగని పని. మన ఇండియన్స్‌లో చాలామంది మనస్తత్వం ఎలాంటిదంటే హాస్పిటల్లో వున్నప్పుడు నలుగురూ వచ్చి చూడాలనీ, అలా వస్తే అభిమానం వున్నవాళ్లనేది నర నరాల్లో జీర్ణించుకుపోయింది. ఇటువంటి పద్ధతులు అమెరికాలో సాధ్యంకావు. ఫోన్‌లో పలకరించేపాటి టైమ్ దొరికితే గొప్ప విషయం. అందుకే ఈ విషయాలు గ్రహించినవారు పిల్లలు తల్లితండ్రులను పట్టించుకోరనీ, దూరంగా వుంచుతారనీ అపవాదు పిల్లలపై పడకూడదని 'మేము పరాయిదేశంలో వుండలేం. తోచదు. అన్నింటికీ పిల్లల్ని ఇబ్బంది పెట్టాలి. చేసు కోగలిగీ అశక్తులమైపోతాం. నడిచివెళ్లి తెచ్చుకునేంత దగ్గిర్లో ఇళ్లు వుండవు. సాధారణంగా కారు డ్రైవింగ్ మస్ట్. కారు మనిషి మనిషికీ అవసరం. వయసు మళ్లినవారికి కొత్తగా పరాయి దేశంలో అన్నీ నేర్చుకోవడానికి కొన్ని సంవత్సరాల టైమ్ పడుతుంది. అందుకే పాపం పిల్లలు రమ్మని ఎంతగా బతిమాలినా వెళ్లలేం. ఆ తప్పు మాదే! సరిపెట్టుకోలేని మనస్తత్వం' అంటూ నెపం వారి మీదనే వేసుకుంటున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే యూత్ జనరేషన్ నాగరికతా వ్యామోహంలో తేలుతూంటే పరిస్థితులు ఆకళింపు చేసుకున్న ఓల్డ్ జనరేషన్ కూడా అన్నింటా వెస్టన్ కల్చర్ ఫాలో అవుతున్నారు."

"అంటే హోమ్ ఎలోన్, ఓల్డేజ్‌హోమ్స్ ఎట్సెట్రా అంతేకదూ?" అంది శకుంతల.

"ఔను, కరక్ట్‌గా చెప్పారు. కాలానుగుణంగా సర్దుకుపోయే మనస్తత్వం, ఖాళీగా వుండకుండా ఏదో ఒక పని చేయగల సామర్థ్యమూ కలవారికి ఈ అమెరికా జీవితము హాపీగా వుంటుంది" అంది షాలిని.

"ఔనండీ, మీ మానసిక విశ్లేషణ గొప్పగా వుంది. మనుషుల్ని ఇట్టే చదివేయగల నేర్పుంది మీలో. మీ కంపెనీ మాకెంతో నచ్చింది. మీరు అమెరికాలో సెటిల్ అవుతారా? లేక ఇండియాలోనా?" అడిగింది వేదవతి.

"మా తుషార ఇక్కడే వుంటుంది. మా వారి ఇంట్రెస్ట్‌ని బట్టి మా సెటిల్మెంట్ వుంటుంది"

"అంటే మీరు మీవారినే అనుకరిస్తారన్న మాట. మీకంటూ వ్యక్తిత్వంలేదా? మీవారు మీకు ఫ్రీడమ్ ఇవ్వరా?" అంది శకుంతల.

శకుంతల ప్రశ్నలో విప్లవ ధోరణీ, స్త్రీవాదం కనిపించి వెంటనే జవాబు ఇవ్వలేకపోయింది షాలిని. ఏదో ఒకటి చెప్పాలి. మొదటి పరిచయంలోనే ఈవిడ ఇంత లోతుగా మాట్లాడగలదని ఊహించలేదు. "ప్రతి జంటల్లోనూ భేదాభిప్రాయాలు సహజం. కొన్ని భర్త చెప్పిన విషయాలు మనకు నచ్చకపోయినా అభిమానాన్ని చంపుకోవలసి వచ్చినా పెళ్లితో కట్టుబాట్లు, సర్దుకు పోవడాలూ తప్పవు కదండీ! మన వివాహ వ్యవస్థలో సహజీవనం అనే పదానికి అర్థం ఇదేమరి! నా భర్త అమెరికాలో స్థిరపడతాను అంటే కాదు నేను ఇండియానే లైక్ చేస్తాను అని భీష్మించుకుని కూర్చుంటే బావుకునేది ఏముంటుందండీ! చిన్న మాట పట్టింపుతో దాంపత్య జీవితాన్ని విచ్ఛిన్నం చేసుకోగలమా? తప్పదు మరి" నిష్కర్షగా చెప్పింది తన మనసులో మాట.

తుషార అడిగింది "ఎలావుంది మామ్? ఇక్కడి లైఫ్?"

"చూడటానికి చాలా బాగుంది"

"అమెరికా వచ్చేసి వుండిపోవాలని





లేదా? "

"అవసరాన్నిబట్టి రావల్సి వుంటుందేమో!"

సమీర్ తన ఫ్రెండ్స్‌ని చూసి వస్తానంటూ న్యూయార్క్ వెళ్లాడు. రెండు వారాల తర్వాత "మామ్ నీక్కూడా వెళ్లాలని వుంటే పంపమన్నారు డాడ్. వెళతావా? " తల్లిని అడిగింది తుషార.

సమీర్ దగ్గిరకి వెళ్లాలనే అనిపించింది. అసలు కూడా తీసుకెళ్లి వుంటే అతడితో వెళ్లేదే.

"అన్నట్టు, రేణూ ఆంటీ కాల్ చేసింది. తనూ న్యూయార్క్ వెడుతోందట అందుకే తనతో పంపమన్నారు డాడ్!"

"అలాగా! ఎన్ని రోజుల ట్రిప్? "

"ఇదిగో మాట్లాడి నువ్వే అడుగు" అంటూ తండ్రికి డయల్ చేసింది తుషార.

"హలో సమీర్. నేను రేణూతో వస్తున్నాను. ఎన్ని రోజులు మనం అక్కడ వుంటాం చెప్పు"

"రెండు వారాలని అనుకుంటున్నాను. అవసరాన్నిబట్టి చూద్దాం. నువ్వు అమ్మమ్మలా పట్టుచీరలూ, జరీచీరలూ తీసుకుని రావద్దు. అమెరికాలో అమెరికన్‌లాగే వుండు"

"అయితే జీన్స్ తెచ్చుకోమంటావా? " అసహనంతో అడిగింది షాలిని.

"నువ్వసలు ఏమీతేవద్దు. నేను రెడీ చేశాన్లే ఇక్కడ"

"సరే నీ ఇష్టం" అతడితో వాదన దేనికీ? అతడి ఆనందంకోసం ఎలా వుండమంటే అలా వుంటాను. అందరితో చెప్పానుగా. వైవాహిక జీవితానికి నిర్వచనం ఆచరణలో చూపించవద్దా మరి అనుకుంది.

రేణు ఎయిర్‌పోర్ట్‌లోనే కలిసింది.

"హాయ్ షాలూ! నాకు కంపెనీ ఆడిట్ వుంది నెల రోజులపాటు" తన రాకకు కారణం చెప్పింది.

"రేణూ ఇప్పట్లో ఇండియా రావా? "

"ఇప్పట్లో అనే కాదు. ఎప్పటికీ రాను. షాలూ నా ధ్యేయం ఇప్పటికి నెరవేరింది. ఈ స్థాయికి చేరుకోవాలని ఎంతగా తపన పడ్డానో! ఎంతగా కష్టపడ్డానో నీకు తెలియదు. ఎలా అయితేనేం మొత్తానికి సాధించాను"

"నీకేంలే రేణూ! ఒకరి అడుపాజ్ఞలుండవు. నీకు నచ్చినట్టు చేయచ్చు"

రిసీవ్ చేసుకోవడానికి సమీర్ ఎయిర్‌పోర్ట్‌కి వచ్చాడు. అతడికి ఇంటర్నేషనల్ డ్రైవింగ్ లైసెన్స్ వుంది. కారు రెంట్‌కి తీసుకుని తెస్తాడు. డబ్బుకి కొదవలేదు. అతడి ప్రయత్నాలు చూస్తుంటే న్యూయార్క్‌లో బిజినెస్ చేయాలనే ఆలోచనలతో వచ్చి వుంటాడని షాలిని అనుమానం.

అతడింకా షాలినితోగానీ తుషారతోగానీ చెప్పలేదు. అడగటం దేనికీ తనే చెబుతాడని షాలిని అనుకుంది.

"రేణూ మాతో వచ్చెయ్" రేణూని పిల్చాడు సమీర్.

"ఇప్పుడు కాదు సమీర్. తర్వాత వస్తాను" అంటూ వేరే టాక్సీలో వెళ్లింది. తనపట్ల ఇదివరకున్న ఆప్యాయత కనబడటంలేదు. రేణూ మారింది. ఎప్పుడూ ఏదో బిజీ. తన గొడవేదో తనది. నేనైతే ఖాళీగా వున్నాను. రేణూ చాలా యాక్టివ్. అందులోనూ సి.ఏ చేసిందేమో క్షణం తీరికలేని ప్రొఫెషన్ అనుకుంది.

నాల్గు రోజులు అటూ ఇటూ తిరిగి వచ్చాక చెప్పాడు సమీర్.

"షాలూ! ఇక్కడ నా ఫ్రెండ్ ఒకతను వున్నాడు. అతని పార్టనర్‌గా బిజినెస్‌లో జాయిన్ అవమంటున్నాడు. లైఫ్ ఛేంజ్. నాక్కూడా ఇంట్రస్ట్ వుంది. ఏమంటావ్? "

'ఆల్రెడీ తను డిసైడ్ చేసిన తర్వాతనే నాకు చెప్పాడు. నా ఇష్టాయిష్టాలతో పనేం లేదు. అంటే త్వరలో ఈ దేశానికి షిఫ్ట్ అవ్వాల్సిందేనన్నమాట!' అనుకుంది షాలిని.

"సమీర్! ఇప్పుడీ వయసులో ఈ దేశం వచ్చి చేయగల బిజినెస్ ఏముంది? "

# ఏరినముత్యాలు

* మనం ఎప్పుడూ పాత జ్ఞాపకాలు స్ఫురణకు తెచ్చుకుంటూ వుండాలి. కొత్త ఆశలతో జీవించాలి.

– హెమింగ్వే

* వైవాహిక జీవితం సుఖంగా గడవాలంటే దంపతులిరువురూ ఒకరినొకరు గౌరవించుకోవాలి. మంచి స్నేహితుల్లా మసలాలి.

– ఆర్. క్యిలన్

* నీ మనసులోనే అంతా వుంది. నీ ఆలోచనల ప్రకారమే నువ్వు రూపొందుతావు.

– బుద్ధుడు

* శరీరానికి ఏర్పడిన వ్యాధికన్నా మనసుకి ఏర్పడిన వ్యాధి అత్యంత ప్రమాదకరమైనది.

– సిసిరో

* ఏ తప్పులూ చేయకుండా జీవితాన్ని గడుపుతూ, తాను గొప్పవాణ్ణి అనుకో కూడదు. తాము చేసే తప్పుల నుంచి, భంగపాటుల నుంచి గుణపాఠాలు నేర్చుకుని భవిష్యత్తును తీర్చిదిద్దుకోగల వారే గొప్పవారు.

– బెర్నార్డ్‌షా

* మనం ఏ పనినయినా ఎంత తొందరగా చేసినప్పటికీ జనం మరచి పోతారు. అయితే ఆ పనిని చక్కగా చేసినట్లయితే వారు జ్ఞాపకం పెట్టుకుంటారు.

– హవ్వర్డ్ న్యూటన్

* ప్రపంచమంతా నిన్ను విడనాడినప్పుడు, అసలైన మిత్రుడు వచ్చి నీకు చేయూతనిస్తాడు.

– నైజీరియన్ సూక్తి

* తప్పక విజయం లభించే మార్గాన్ని ఓ చీమ చూపుతుంది.

– హెమింగ్వే

* దైవంపట్ల భయభక్తులతో వుండడం, జ్ఞానానికి చేరువకావడమే.

– చిన్మయానంద

* నువ్వు ప్రతీ విషయాన్నీ అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే నీకీ విషయం అర్థంకాదు. నిన్ను నువ్వు అర్థం చేసుకోగలిగితే నువ్వు అన్ని విషయాలనీ అర్థం చేసుకోగల్గుతావు.

– ఒక సూక్తి

* గత జీవితాన్ని నువ్వు తెలుసుకోవాలనుకుంటే నీ ప్రస్తుత పరిస్థితిలోకి తొంగి చూడు. నీ భవిష్యత్తు తెలుసుకోవాలనుకుంటే ఇప్పటి నీ చర్యలు పరిశీలించు.

– టాల్‌స్టాయ్

సేకరణ: **కొడిమెల శ్రీరామమూర్తి**

"బిజినెస్‌కి ఏజ్ లిమిట్ ఏముంది షాలూ- ఇక్కడ వారిని చూశావా? డబ్బై సంవత్సరాల వాళ్లు కూడా ఏదో వర్క్ చేస్తా రేకాని ఖాళీగా వుండరు. ఈ అమెరికన్స్‌ని ఆదర్శంగా తీసుకోవాలి. ఓ అమెరికన్ ఫ్రెండయితే ఏమన్నాడో తెల్సా? ఆర్‌యు మేరిడ్? అనడిగాడు" అంటూ పగలబడి నవ్వాడు.

"సర్లే! నువ్వెప్పుడూ నిర్ణయం తీసుకున్నా కనేకదా నాకు చెప్పేది. అయినా నాకు బుద్ధిరాదు. నా ధోరణిలో అడుగుతుం'టాను"

"ఒకోసారి నిర్ణయాలనేవి క్షణాల్లో అమలు చేయాల్సి వుంటుంది. మా ఆవిడ అనుమతి తీసుకోడానికి టైమ్ ఇవ్వండి అని అడుగుతామా చెప్పు? అప్పటికే తుషారతోనూ రేణూతోనూ డిస్కస్ చేశాన్లే" కూల్‌గా చెప్పాడు.

"రేణూనా? " షాలిని గుండెల్లో మంట రేగింది.

"అవును రేణూనే! ఆవిడ ఎంత ఇంటిలిజెంట్ అనీ! నువ్వు గుర్తించనేలేదు. ఎన్నో పెద్ద కంపెనీల ఆడిట్‌వర్క్ హేండిల్ చేస్తుంది. అసలు ఇండియాలోనే చాలా పేరు సంపాదించింది. చిన్న వయసులోనే డబ్బూ ప్రతిష్టా సంపాదించేసింది" మెచ్చికోలుగా అంటుంటే షాలినికి కారం రాసుకున్నట్టుంది. 'నేనూ మామూలు ఆడదాన్నే. ఒకప్పుడు నా ప్రియమైన రేణూని ఎవరు మెచ్చుకున్నా ఆనందించగల స్థాయినుంచి నా భర్త మెచ్చుకోవడం మాత్రం సహించలేని స్థాయికి దిగజారి పోతున్నాను. అసూయ భయంకరమైన వ్యాధిలాంటిది కాబోలు' అనుకుంది.

మాట మారుస్తూ "నీ ఆఫీస్ నాకోసారి చూపించు" అంది.

"డబ్ల్యూటిసిలో వుంది. వెడదాం. రేపు రేణూ కూడా వుంటుందక్కడ" మళ్లీ రేణూ దగ్గరికే వెడుతోంది టాపిక్. తను ఏది తప్పించుకోవాలనుకుందో దాని చుట్టూ తిరిగే సంభాషణను తప్పించలేక నిస్సహాయురాలవుతోంది షాలిని.

"ఇంతకీ నీ ఫ్రెండ్ పార్టనర్ ఎవరు? ఇండియన్ ఆర్ అమెరికన్? "

"విలియమ్స్ అనే అమెరికన్. మిలినియర్‌లే. వైఫ్ పేరు లిండా" అడక్కుండానే అతడి భార్యపేరు కూడా చెప్పాడు.

"అయితే సమీర్ నువ్వు అమెరికాలో సెటిల్ కావాలని డిసైడ్ చేసుకున్నావా? "

"చూద్దాం వుండు. ముఖ్యంగా రేణూ అడ్వయిజర్. తన ఒపీనియన్ కూడా తెల్సుకోవడం ముఖ్యం"

"మరి... మరి నా శరణాలయం? "

"భలేదానివిలే! నీ శరణాలయాన్ని అమెరికాకి తరలించేస్తావా ఏమిటి? అదక్కడే వుంటుంది. మనం మాత్రం ఇక్కడుంటాం"

"అయ్యో సమీర్! పిల్లలందరూ నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. ఎలా? "

అంతే సమీర్‌కి కోపం వచ్చేసింది.

"నువ్వు నాకెక్కడ దొరికావ్ తల్లీ? నేను ఎంతో ఉత్సాహంతో ప్లాన్ చేస్తే నీళ్ళు కార్చేసి మూడంతా పాడుచేయడం అలవాటైపోయింది నీకు"

"అదికాదు సమీర్... పోనీ మినియాపొలిస్‌లో తుషార వున్నచోటే వుందాం"

"ఏం మాట్లాడుతున్నావ్ షాలినీ నువ్వు? ఎక్కడి న్యూయార్క్, ఎక్కడి మినియాపొలిస్? చదువుకునీ మూర్ఖంగా, మాట్లాడుతావేం? " చిరాగ్గా అన్నాడు.

అంతే. అయిపోయింది. నాలుగుమాటలు సవ్యంగా మాట్లాడుకుంటే, ఆ తర్వాత తేడా వచ్చేస్తుంది. ప్రసంగం పెడదారిలో పడుతుంది. అయినా సమీర్ చెప్పినట్టు నేనే మూర్ఖంగా మాట్లాడుతున్నానేమో. అయినవాళ్ళు ఇక్కడుంటే శరణాలయ ఉద్ధరణకు ఇండియాలో వుండి పోవాలనుకోవడం పెద్ద పొరబాటే. అయితే నేను చేసిన

మంచిపనివల్ల మనశ్శాంతి, ఆనందమూ దక్కింది. మనసు కలత చెందితే రేణే ఆప్తురాలు. ఎంత కాదనుకున్నా, ఆమెను చూసి అసూయపడినా, కష్టసుఖాలు చెప్పుకుంటే ఏదో ఒక సలహా ఇస్తుంటుంది.

రేణుతో చెప్పింది "సమీర్ ఇక్కడకు వచ్చేద్దాం అంటున్నాడు. నేను ఏం చేయగలను? " అని.

"ఎందుకు షాలూ వర్రీ అవుతావు? ఏదో మార్గం కనిపిస్తుంది. బేబి సిట్టింగ్ చేయచ్చు ఆలోచనా, ఆరోగ్యం వుంటే చాలు. ఏదైనా చేయవచ్చు మేమంతా లేమా? " అంది ఓదార్పుగా.

"రేణూ మనుషులు మారుతున్నారా? ఆలోచనావిధానం మారుతోందా? "

"షాలూ, ఆలోచనా విధానం మారడం సహజంకదా? ఎప్పుడో వంద సంవత్సరాల క్రితం చేసిన చట్టాలు, స్వతంత్రం రాకమునుపు అనుకరిస్తూ వస్తున్న బ్రిటిష్ రాజ్యాంగవిధానం, పాతరాతి యుగాన్నుంచీ పాటిస్తూ వచ్చిన శాస్త్రాలూ, సిద్ధాంతాలు ఈనాటి యుగంలో కూడా పాటించడం హాస్యాస్పదం. ఎందుకంటే అప్పటి మనుషుల తీరునుబట్టి అవి చెల్లాయ్.

"సమీర్ నాన్నగారు తన తండ్రి చెప్పుచేతల్లో లేరని, బాబాయి ఆర్థికంగానూ, శారీరకంగానే బలహీనుడు కాబట్టి తండ్రికి దాసోహం అయ్యాడని నువ్వే చెప్పావ్. ఇప్పుడీ తరంలో సమీర్ అవకాశాన్ని వినియోగించుకోవడంలో తప్పులేదు షాలూ! అతడికి ప్రోత్సాహాన్నివ్వాల్సింది పోయి, ఏదో మునిగిపోయినట్టు మాట్లాడుతావేం.

"నిజం చెప్పనా షాలూ! నీకిక్కడ గుర్తింపు వుండదని, ఇండియాలో అయితే నీ సలహా, అవసరం కావాలంటూ ఎవరో ఒకరు ప్రాధేయపడుతుంటారనీ అనుకుంటున్నావు కదూ? కొన్నాళ్ళకు నువ్వు మంచిగా చెప్పే సలహా అయినా వాళ్లకు నచ్చకపోవచ్చు ఎప్పుడూ ఎదుటివారు నీ మార్గాన్నే అనుసరిస్తారని అనుకోకు. నీ తరం మారిపోయిందని గుర్తుచేసుకో.

"నువ్వూ, నేనూ ఇంచుమించు ఒకే వయసువాళ్ళం. అయినా నువ్వు డిగ్రీ చదువుతూనే ఒక గౌరవాన్ని అందుకున్నావు. నేను చదువుకి అంతులేదని కొనసాగించి, ఎదుగుతూనే వున్నాను. నాకిది చాలు అనే తృప్తి వుండదు. ఇంకా ఏదో సాధించాలని అనిపిస్తుంది. ఈ రోజుల్లో అమ్మాయిలూ, అబ్బాయిలూ ఎలా వున్నారో చూడు, ఇంజినీరింగ్, ఎంబిఏ, సి.ఏ. తప్పితే మెడికల్ కోర్సో, మరొకటో చదివేవారు చాలా తక్కువగా వున్నారు"

"అదంతా డబ్బుకోసం పడే తాపత్రయం" అంది షాలిని.

"అది చాలా తప్పు అభిప్రాయం షాలూ! కొంతమందికి జ్ఞానతృష్ణ తీరదు. ఆ సంపద కోసమే చదువుతారు. చదవాలంటే డబ్బుకావాలి కనుక, సంపాదనా అవసరమే! మనీ వాల్యూ డవున్ అయిపోవడంలేదా షాలూ? నువ్వు ఇల్లు కట్టినరోజు అయిదు లక్షలు మాత్రమే. ఇప్పుడు పదిహేను లక్షలు లేనిదే ఆ ఇల్లు రాదు. తుషార చదువుకి లక్ష రూపాయలు ఖర్చు అయింది. మరి ఇప్పుడో? " అంటూ వాదించింది రేణూ!

చాలారోజుల తర్వాత వాళ్ళిద్దరూ మనసు విప్పి మాట్లాడుకున్నారు. రేణూ చెప్పిందంతా నిజమే. అందుకే సమీర్ ఈమె విజ్ఞానఖని... తెలివితేటల పుట్ట అంటాడు. ఇటువంటివాళ్ళకి పెళ్ళీ, దాంపత్యజీవితం కంటే ఏదో సాధించాలనే 'దాహం' ఎక్కువ.

★ ★ ★

"షాలినీ ఎలా వున్నారు? నేను యశోదను" అటునుంచి చెప్పింది.

"ఓ... యశోదా? బాగానే వున్నానండీ. మీకు నా ఫోన్ నంబర్ ఎలా తెలిసింది? "

"తుషార ఇచ్చింది. మీరు న్యూయార్క్‌లో వుంటున్నారని కూడా చెప్పింది.





మనం తరచుగా కల్సుకోవచ్చు. వీలు కాకపోతే ఇలా ఫోన్‌లో మాట్లాడుకోవచ్చు. మనం మొదటిసారి ఎక్కువగా మాట్లాడుకోనేలేదు. మీరు ఈ దేశంలో వుండాలంటే అంతగా ఇష్టపడరని తుషార చెప్పింది లెండి. మీకు తుషార ఒక్క అమ్మాయేనా? అబ్బాయిల్లేరా? ఔనూ... తుషార ఇంకా పెళ్ళి చేసుకోలేదేమండీ? పెళ్ళెందుకులెండి ఈ దేశంలో! బాయ్‌ఫ్రెండ్స్, డేటింగ్... మా మనవలు వున్నారుగా, వాళ్ళూ అంతే లెండి. మా అబ్బాయీ, కోడలూ ఏమీ పట్టించుకోరు, వాళ్ళని అదుపు చేయరు. స్వేచ్ఛగా వదిలేశారు.

ఏం దేశమోనండీ ఇది. చూస్తున్నారుగా? ఒక్కళ్ళకీ సిగ్గూ, శరమూలేదు. ఓ పక్క దేవుడూ, దేవాలయమూ అంటూ భక్తి ప్రదర్శిస్తారు. మరోపక్క మితిమీరిన స్వేచ్ఛ. మన ఇండియన్స్ కూడా చెడిపోయారు" అంటూ నాన్‌స్టాప్‌గా చెప్పుకుపోతుంటే షాలినికి నోటంట ఒక్కమాటా రాలేదు. అసలావిడ అవకాశం ఇస్తేకదా?

"ఏమిటండీ షాలినిగారూ, మాట్లాడడం లేదు? బోర్ కొట్టేస్తున్నానా? "

"అహ... ఏంలేదు చెప్పండి. వింటున్నాను"

"ఇండియాలో మీవారు ఏం చేసేవారండీ? మీరేమైనా చదువుకున్నారా? మళ్ళీ ఎవరితోనూ నేను చెప్పేననకండీ... ఆ శకుంతల లేదూ? ఆవిడకి భర్తపోయి ఆర్నెల్లు కాలేదు. తగుదునమ్మా అంటూ కూతురు దగ్గిరకి వచ్చింది. అంతదాకా బాగానే వుంది. వాళ్ళింటిపక్కనున్న అమెరికన్‌ని పెళ్ళిచేసుకుందండీ. శివ... శివా...! పిల్లలేకాదు, వయసు మళ్ళినవాళ్ళూ అలాగే తయారయ్యారు" ఇక సహించలేని షాలిని తోటి ఆడవాళ్లను విమర్శించే ఈవిడ, తన వెనకాల కూడా ఏదో అంటుందని అర్థం చేసుకుని, "సారీ యశోదగారూ, నాక్కొంచెం పనుంది. మరోసారి మాట్లాడుకుందాం. ఈసారి నేనే మీకు ఫోన్ చేస్తాలెండి" అంటూ ఫోన్ పెట్టేసింది.

తుషార పిల్చినప్పుడు, "ఆ యశోదగారికి నీ ఫోన్ నంబర్ ఎందుకిచ్చావే బాబూ, సుత్తి కొట్టేసింది" అంటూ ఆవిడ ఫోన్‌లో మాట్లాడిన విధానం వివరించింది.

"సారీ మామ్. ఆవిడ అలాటిదని తెలియక, నీకు టైంపాస్ అనుకుని ఇచ్చాను. హారతీ ఆంటీ చాలా మంచివారని వినీల అంటుంది. కావాలంటే ఆవిడతో మాట్లాడు" అంటూ నంబరిచ్చింది.

ఆ తర్వాత ఓరోజు హారతే మాట్లాడింది యశోదగారే ఫోన్ నంబర్ ఇచ్చారంటూ!

"ఔనండీ. ఆ యశోద మనం చెప్పేది వినదు. గంటల తరబడీ ఎవరో ఒకర్ని కామెంట్ చేస్తూనే వుంటుంది. మరీ అంత దారుణంగా శకుంతలగారి గురించీ, ఇక్కడి పద్ధతుల గురించీ చెప్పడం చిరాకుగా అన్పించింది" అంటూ తన అభిప్రాయం వెల్లడించింది షాలిని.

"యశోదగారి కోడలు చాలా మంచమ్మాయ్! మామగారు చనిపోతే ఈ యశోద ఒక్కతే వుండాలని, పట్టుబట్టి, కాదంటున్నా భర్తను పంపించి ఇక్కడకు రప్పించింది అత్తగార్ని. యశోదగారు ఏక్షణాన అడుగుపెట్టిందో అప్పట్నించీ భార్యాభర్తలు ఒక్కరోజు కూడా సుఖంగా లేరు. పోనీ ఏమీ తోచక అలా వుంటోందేమోనని ఇండియన్ క్లబ్‌లో చేర్పించారు. దాంతో ఇంటికే పరిమితమైన ఆవిడ బుద్ధి బైటవారికి కూడా తలనెప్పిగా తయారైంది. సాధ్యమైనంత త్వరలో ఆవిడను ఇండియా పంపేయాలని నిశ్చయించుకున్నారు"

అంటూ హారతి చెప్పినప్పుడు షాలినికి అయోమయంగా అనిపించింది.

★ ★ ★

సమీర్ న్యూయార్క్‌లోనే వున్నాడు. షాలిని మాత్రం తుషార దగ్గిరకి వచ్చినప్పుడు "ఇదేంటి మామ్? డాడ్‌ని ఒంటరిగా

వదిలివచ్చావా?" అంది తుషార.

"ఒంటిగా వున్నా, జంటగా వున్నా తేడా లేదులే" అంది షాలిని.

జనవరి నెల్లో సంక్రాంతి వేడుకలు జరిపారు. మీరా అనే అమ్మాయికి సీమంతం అంటూ పేరంటం పిల్చారు. వినీలతో వెళ్ళింది షాలిని. పేరంటం అయ్యాక అంతా కలసి భోజనాలు చేస్తున్నాం. జట్లు జట్లుగా విడిపోయి కబుర్లు చెప్పుకుంటున్నారు అందరూ.

హారతీ, షాలినీ బాగా క్లోజ్ అయ్యారు. ఇద్దరూ ఓచోట కూర్చున్నారు. "షాలినీ ఇక్కడ అమెరికన్స్ కూడా డెలివరీ అయేలోగా మన సీమంతంలాగే 'బేబీ షవర్' అని చేస్తారు. పుట్టబోయేది స్కానింగ్‌లో ఆడ, మగ అని ముందే తెలుస్తుంది కాబట్టి తగిన గిఫ్ట్స్ తెస్తారు. అమ్మాయి అయితే పింక్ కలర్, అబ్బాయి అయితే బ్లూ కలర్‌లో డ్రస్‌నుంచి బెడ్, రూమ్ అన్నీ ఆయా కలర్‌లోనే చక్కగా డెకరేట్ చేస్తారు. మనలాగే కొన్ని సెంటిమెంట్స్ వుంటాయి. దగ్గిర బంధువో, ఫ్రెండో అంతకుముందు పిల్లలున్నవారి క్రెడిల్, టాయ్ లాటివి న్యూబోర్న్ బేబీకి వుపయోగించడం చేస్తారు. మన పెద్దవాళ్లు కూడా మన ఇళ్లల్లో అక్కడక్కడ ఈ సాంప్రదాయం కొనసాగిస్తారు చూడు అలా అన్నమాట"

మరోచోట కొందరు అమ్మాయిలు చేరి మాట్లాడుకుంటున్నారు. వాళ్ల మాటలు అచ్చం ఇండియాలో ఆడవాళ్ల మాటల తీరులోనే వున్నాయ్.

"మీరా కట్టుకున్న శారీ వాళ్ళత్తగారు పంపించారట. ఎంత పిచ్చిగా వుందో చూడు. అసలు మీరాకి శారీ అంటేనే చిరాకు. పాపం ఎలా భరిస్తోందో! చూస్తుండు క్షణంలో మార్చేస్తుంది. తనకి చాలా ఎక్స్‌పెన్సివ్ డ్రసెస్ వున్నాయి. ఎందులోనూ కాంపర్‌మైజ్ అవనే అవదు. తను చాలా అందంగా వుంటుంది కదా! మరింత స్పెషల్‌గా కనిపించాలని అనుకోవడం సహజం కదూ?" ఆ అమ్మాయి మాట పూర్తికానేలేదు మీరా మొహమంతా ఎర్రగా చేసుకుని లేచి వెళ్ళిపోయింది ఆ శారీ మార్చడానికి. మరో శారీ కట్టుకుని వచ్చి గర్వంగా చెప్పింది, "ఈ శారీ మా అమ్మగారు బెంగుళూర్‌లో కొని ఢిల్లీ తీసుకొచ్చి తెలిసినవారిద్వారా పంపించారు. నేనంటే మా అమ్మకి చాలా ఇష్టం. ఇప్పుడే ఇంటర్‌నెట్‌లో చాట్ చేసి వస్తాను. ఒక్క నిముషం..." అంటూ గిరుక్కున మళ్ళీ లోనికెళ్ళిపోయింది.

"ఎంతైనా కన్నతల్లి... కన్నతల్లే కదూ? ఈరోజుకోసం ప్రత్యేకంగా ఈ శారీ, మాచింగ్ జ్యూయలరీసెట్, చాలా ఖరీదు పెట్టి కొని, పంపించార్ట. అద్భుతంగా అమరింది మీరాకి. ఆ అత్తగారు పంపిన శారీ అయిదువందలు కూడా వుండదు. మట్టిగాజులు మాచింగ్‌వి పంపిందట. అది కూడా మీరా భర్త పంపిన డబ్బులో మిగిల్చి కొని పంపారు. మీరా భర్త చాలా డబ్బు పంపుతాడట. దాంతో కూతురి పెళ్లి చేశారు. ఇల్లు కొనుక్కున్నారు. కోడలికి మాత్రం అయిదు వందలకంటే పెట్టడానికి చేతులు రాలేదు. ఇదంతా మీరా చెప్పింది" అంటూ తనకి తెలిసిన సమాచారాన్ని అందరికీ చాటింది ఓ అమ్మాయి.

మరోచోట అబ్బాయిలు తాము ఏం తక్కువ తిన్నామని ఆడవాళ్లను మించి భేషజంగా చెప్పుకుంటున్నారు. "ఏమయ్యా రాహుల్! నీ కంపెనీ షేర్స్ మంచి ధర పలికాయ్. అదృష్టవంతుడివి. అటు అందమైన మీరా, అయిశ్వర్యంతో వరించి వచ్చింది. ఇటు కొడుకు పుట్టే టైమ్‌కి కంపెనీ షేర్స్ కలిసి వచ్చాయ్. హార్టీ కంగ్రాచ్యులేషన్స్" అన్నారు.

వారి పొగడ్తలకు రాహుల్ వదనంలో ప్రపంచాన్నే జయించినంత గర్వం కదలాడింది. "ఇండియాలో వున్నప్పుడు నాతో




బాటే సత్యంలో వర్క్‌చేసేవాడు... మనోజ్... అనీ, అతను అమెరికా రావాలని ఎంతగా ట్రైచేశాడో! బాస్ ఆ అవకాశం రానీయలేదు. నాకేమాత్రం రావాలని ఇంట్రస్ట్ లేనేలేదు. మా పేరెంట్స్‌కి నేను ఒక్కణ్ణే. మా తాతగారికి బోలెడంత ప్రాపర్టీ వుంది. దానికి వారసుణ్ణి నేనే! అయ్ డోంట్ కేర్ మనీ. పిటీ... అదే బాస్ 'వెళ్లవయ్యా బాబూ! మన కంపెనీ జాతకమంతా నీ చేతుల్లోనే వుంది. నీకెంత కావాలో అంకె వెయ్ చాలు అన్నాడు. ఎవరికీ ఇవ్వనంత శాలరీ ఆఫర్ చేయడమేకాక, బతిమాలి మరీ పంపించాడు" అంటూ నిజమో కాదో తెలియదు కానీ అతిశయంగా చెబుతున్నాడు ఒకతను.

"అందుకేనా పాపం, ఆ ప్రాజక్ట్ ఆదరాబాదరా అయిందనిపించి, మరో కంపెనీకి మారిపోయావ్ అవకాశవాదీ" అంటూ చురక వేశాడు వెంకటేష్ అనే అతను.

"నందితా, ఈ సెట్ చాలా బాగుందోయ్. ఇక్కడే కొన్నావా? "

"లేదు... మా మామ్ పంపింది. (అంతా వట్టిదే) ఈసారి ఇండియా వెళ్లేప్పుడు నాలుగు గోల్డ్ బిస్కట్స్ తీసుకెళ్ళాలి"

"ఎవరికి? మీ అమ్మగారికా? చెల్లికా? "

"మా చెల్లికి ఎందుకిస్తాను? నేనే మార్చి డైమండ్ సెట్ కొంటాను"

"నేను ఇండియా వెడితే, మా ఆడపడుచు రాక్షసికి అమెరికన్ జార్జెట్ శారీస్ తీసుకెళ్లాలి. లేకుంటే మా అమ్మకీ, అక్కకీ కొన్నవి లాక్కుంటారు"

"ఓ అయిడియా చెప్పనా? మనం ఇక్కడికొచ్చిన కొత్తలో సిల్లీగా శారీస్ కొనేసి కట్టుకునేవాళ్ళం గుర్తుందా? అవి ఇంకా కొత్తగా అలాగే వుంటాయ్. దాచి వుంచి, నీట్‌గా ప్యాక్‌చేసి, కొన్నానని వాళ్లతో చెప్పి, ఇచ్చెయ్. పీడా వదుల్తుంది" అనూల్యమైన సలహా ఇచ్చిందో సుందరి.

"ఆ మాత్రం తెలివి నాకులేదనా తల్లీ చెబుతున్నావ్. ఏనాడో ఆ పని చేసేశాను"

"అయినా అరవిందా, నువ్వు శారీస్ కొన్నావంటే నేన్నమ్మను"

"నమ్మద్దులే! ఇదిగో ఇలాటి అవసరాలకి పనికొస్తాయని డామేజ్ వున్న శారీస్ సేల్‌లో పెడుతుంటారు కదే... అవి కొన్నాను" ఆ మాటలకు అదో జోక్‌లా అంతా పగలబడి నవ్వారు.

వీళ్ల వయసుకి మించి, తమ నీచబుద్ధిని బయటపెడుతుంటే షాలినికి చాలా చిరాకనిపించింది. అసహనంగా వుండిపోయింది. ఆడజాతి ఏదేశమేగినా, ఎందుకాలిడినా ఇదే తంతు. కాలం మారడం ఏదీ? మనస్తత్వాలు మారేయా. ఎక్కడా? అప్పుడు, ఎప్పుడూ అంతా ఒకేలా వున్నారే మరి! అటు రేణు మరీ ఫాస్ట్.

ఇటు వీళ్లు ఎదగని ఆలోచనల్తో పాత తరం ప్రతినిధులుగా మిగిలిపోయారు. అయినా నేను చూసింది కొద్దిమందినే! అంత తొందరగా నిర్ణయానికి రాకూడదేమో!



"షాలూ, ఇండియా వెళ్ళి, మన వ్యవహారాలన్నీ చక్కబెట్టుకుని రావాలి. ఇక బయ

లుదేరుదామా? " అన్నాడు సమీర్.

"సాధ్యమైనంత త్వరగా వచ్చేయండి షాలూ" అంది రేణూ!

"ముందంతా, మీరిద్దరూ కలిసే ప్లాన్ చేసి వుండాలే" అంది షాలిని.

"ఔను. ప్రతీ దానికి చక్కగా ప్లాన్ చేయడం, పెర్‌ఫెక్ట్‌గా ఫాలో చేయడం, రేణూ స్పెషాల్టీ"

"చూశావా మామ్! నేను ఎప్పుడో చెప్పాను. డాడ్‌ని అమెరికా తీసుకువెళతానని! సరిగ్గా అలాగే జరుగుతోంది" అంది తుషార సంతోషంగా.

ఇండియా వచ్చాక సమీర్ ఇల్లు సేల్ చేద్దాం అన్నాడు. షాలిని ఒప్పుకోలేదు. శరణాలయానికి డొనేట్ చేయాలని ఆమె ఆలోచన.

"ఇప్పుడు మనకి డబ్బు చాలా అవసరం. ఆ ఫ్లాట్ అలా వదిలేద్దాం. ఈ ఇల్లు మంచి సెంటర్‌లో వుంది కనుక మంచి ప్రైస్ వస్తుంది" అన్నాడు.

ఓరోజు ప్రణతి దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది.

ఎప్పటి ప్రణతి? షాలిని ఆమె గురించి మర్చేపోయింది. పాపం గుర్తుంచుకుని రాసినట్టుంది. ఏం రాసిందో? ఆత్రంగా కవరు చించి చదవసాగింది.

"ఆంటీ,

అనాథకు ఆశ్రయం ఇచ్చి ఒక మనిషిగా తీర్చిదిద్దారు. నాకు జీవితాన్ని సాఫీగా కొనసాగించే యోగ్యత లేదేమో! హరిబాబు పన్నిన మాయలో ఇరుక్కుని, నా బ్రతుకు బండలు చేసుకున్నాను. అప్పుడే ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించాను. కానీ నా ఎదుట ఎందరో అమ్మాయిలు, హరిబాబు కామదాహానికి బలైపోవడం చూసి వూరుకోరాదనీ, చచ్చి సాధించేకంటే, బతికి సాధించాల్సింది చాలా వుందని తెలుసుకున్నాను.

ఒక మాధవనే అమ్మాయి, మరో పద్మజ, అంజని ఇలా నాకు తెలిసింది కొందరే! తెలియని వారెందరున్నారో? ఆ అభాగినులకు చేయూత నివ్వాలి. వారితో కలిసి, ఇతగాడికి తగిన బుద్ధిచెప్పాలి అనుకున్నాను. అదనుకోసం చూసి, హరిబాబును హత్యచేశాను. పోలీసుస్టేషన్‌లో లొంగిపోయాను. విచిత్రమేమిటంటే అప్పటికే, నేనతన్ని చంపడానికి ముందే విషప్రయోగం జరిగింది. విచారణలో ఈ విషయం తెలియవచ్చింది. దాంతో శిక్ష తగ్గింది.

ఇప్పుడు మీకు ఈ ఉత్తరం జైలునుంచే రాస్తున్నాను. నాకిప్పుడు చాలా తృప్తిగా వుంది. పాప పుణ్యాల గురించి నేను పట్టించుకోను. మనిషికి చేతనైతే ప్రాణం పోయాలేకానీ, తీసే హక్కులేదని కొందరు అనొచ్చు హరిబాబు ఆడవాళ్ల శీలంతో ఆడుకోవడంకన్నా, నేను చేసిన హత్య ఘోరమైన నేరం కాదు. స్త్రీకి ఇష్టమైతే అతడు ఎలాటి పనిచేసినా బాధలేదు. నయవంచనతో, పెళ్ళి పేరుతో మోసగించడమే నేరం. న్యాయశాస్త్రంలో శిక్ష, నేరం వేరుగా వుండచ్చు కానీ నాకు తోచిన న్యాయం అతడి ప్రాణాలు తీసి, మనిషిని మరో తప్పుచేసే ఆస్కారం లేకుండా చేయడం. మీరు నన్ను అర్థంచేసుకోగలరు. ఎందుకంటే, మీ పెంపకంలోని సంస్కారం అది! మీరు నా గురించి తెలుసుకోవాలని ఎన్నో ప్రయత్నాలు చేసినట్టు నాకు తెలుసొంటీ. నేను మోసపోయానని గ్రహించుకున్నాక మీ దగ్గిరకు వచ్చి వుండాలని చాలా అనుకున్నాను. కాని, పగతీర్చుకోమని నా మనసు పదేపదే హెచ్చరించడం వలన మనసు అటే మొగ్గింది. నేను హరిబాబును చంపి, హంతకురాలినయ్యానని ఎంత మాత్రమూ బాధ పడను.

ప్రణతి"

"అయ్యో ప్రణతీ, నీ జీవితం హరిబాబు చేతుల్లో పడి ఈ రకంగా మలుపు తిరిగిందా? " జాలిగా అనుకుంది షాలిని.

★ ★ ★

అతి కష్టంమీద శరణాలయాన్ని వదిలి,





సమీర్‌తో బయలుదేరింది. ఈ దేశంలో పుట్టిన మహిళ భర్తను అనుసరించడం తప్పనిసరి. తనకంటూ వ్యక్తిత్వం, ఇష్టమూ, ధ్యేయమూ వుండకూడదు. వున్నా అది భర్తకి నచ్చేది అయివుండాలి. ఇందుకే తుషార పెళ్ళి గురించి తలపెట్టదేమో అని పించేది షాలినికి.

తుషార నిర్ణయం, షాలినికి ఎంతో నచ్చింది. తను సాధించలేనిది కూతురు సాధించినందుకు గర్వంగా అనిపించింది. బహుశా తుషార రేణుని ఆదర్శంగా తీసు కుందేమో!

'సమీర్ నాకు నచ్చేలా వుంటే, తుషా రను, రేణూను మరోలా అంచనా వేసేదా న్నేమో!' షాలిని తన్లో తను నవ్వుకుంది ఈ ఆలోచనకు.



అమెరికాలో కొత్తజీవితం ప్రారంభ మైంది. రేణూ, సమీర్‌ల ప్రవర్తన చూశాక, షాలినికి ఓ విషయం బాగా తెలిసివచ్చింది. సమీర్ న్యూయార్క్‌లో బిజినెస్ కాంటాక్ట్ పెట్టుకున్నది రేణూ సామీప్యంలో వుండా లనే! అటు సంపాదనా, ఇటు రేణూ సాహ చర్యం! భర్తను అనుమానిస్తోందా లేక అది నిజమా?

నిజమే అయితే షాలిని కూడా అమెరికా రావాలని ఎందుకు కోరుకుంటాడు. ఏదిఏ మైనా అతడు షాలిన్ని వదులుకోడు. రేణూని దూరం చేసుకోడు. ఒకోసారి రేణూ నమ్మక ద్రోహం చేసిందని బాధప డేది షాలిని. స్నేహాన్ని ఆసరాచేసుకుని తన జీవితంలో ప్రవేశించి సమీర్‌ని ఆకట్టు కుంది. ఇందులో ద్రోహం ఏముందీ? ఎవరి మనసు ఏవయసులో ఏ ఆకర్షణకు లోనవుతుందో ఎవరు చెప్పగలరు?

'అసలే సమీర్ అందగాడు. వయసు మళ్లిన అతనిలో గ్లామర్ తగ్గలేదు సరికదా అదోరకం హుందాతనం తెచ్చిపెట్టింది. అతడు పక్కదార్లు పట్టకుండా చూసుకోవల సిన బాధ్యత తనదే.

'నా గురించి ఆలోచించుకున్నానుగానీ అతడి ఇష్టానికి విలువ ఇవ్వలేకపోయా నేమో! అతడు చెప్పింది వెంటనే ఒప్పుకు న్నానా? మొదట వ్యతిరేకిస్తూ గత్యంతరం లేనట్టు అంగీకరించాను!' మొట్టమొదటిసా రిగా తన తప్పుగురించి ఆత్మపరిశీలన చేసు కోసాగింది షాలిని.

'అతడు వెళ్లాలన్న పార్టీకి వెళ్లలేదు. అతడు కోరిన డ్రస్ వేసుకోలేదు.

అతడి సరదాలను సంతోషంగా అంగీక రించింది లేదు.

అతడు కోరుకున్న అందాలు భార్యలో చూసుకోవాలనుకోవడం తప్పుకాదే! అక్క ర్లేని విషయాలకు ప్రాముఖ్యతనిచ్చి కోరిన వేవీ అంగీకరించలేదు.

ఎంతసేపూ దీనజనోద్ధరణా, శరణాల యమే ఆదర్శమనుకుంటూ, అతడు సహక రించలేదని విసుక్కున్నది. పైగా ప్రతీ విష యంలోనూ, రాజీపడినట్టు ఫీలైపోయింది. అతడికి నిరాశ కలిగిస్తూ మరో వలయంలో కూరుకుపోయింది. అందుకే కోరుకున్న ట్టుండే రేణువైపు పరుగు తీసింది అతడి మనసు.

సమీర్‌కి ఆడవాళ్లతో పరిచయాలున్నా యని చెప్పింది రేణూ! అదే అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంది. పరిపరి విధాల ఆలోచించి పశ్చాత్తాపంతో ఏడ్చేసింది షాలిని. మనసులో కొంతభారం తగ్గినట్టు తోచిందామెకు. ఒక నిశ్చయానికి వచ్చింది. తను వేసిన అంచనాలు కరక్ట్ అయితే ఆ క్షణం నుంచే సమీర్‌కి సహకరించాలని అనుకుంది. తన సొత్తును రేణూకి దక్కనీ యరాదనుకుంది.

'ఇప్పుడు సమీర్ మనసును వెనక్కి తీసు కురాగలదా తను? తాళికట్టిన భార్య అనే బంధం ఇద్దర్నీ ఒక చోట వుంచింది తప్పితే ఇప్పుడతను మానసికంగా అంగీకరించగ లడా? ఏమో! చేతకానట్టు ఎందుకు వూరు



కోవాలి? నిజానికి రేణూ నాకంటే అందంగా వుండదు. అయితే రేణూలో ఆకర్షణ అపురూపమైనది, కాదనలేనిది, తనలో లేనిదని కూడా తెలుసు.

అసలు రేణూనే అడిగేస్తేనో? రేణూ సమీర్ అంటే నీకిష్టమేనా? ఆ ఇష్టం ఎటువంటిదని! అనుమానం లేకుండా ఇష్టమే అని చెప్పేస్తే తట్టుకోగలదా? లేక అనవసరంగా లేనిపోనివి వూహిస్తున్నావ్. నువ్వూ మామూలు ఆడదానివేనా? షాలూ! నా గురించి ఏనాడూ ఇలా అనుకుంటావనుకోలేదు. మన స్నేహానికి విలువ లేనేలేదు.





మనం ఇక ఎన్నడూ కలుసుకోవద్దు. నావైపు ఎవరూ లేరనేకదూ ఇంతటి అభాండం వేశావు? నీకు నచ్చినవాడో, నచ్చనివాడో భర్త వున్నాడు, కన్నకూతురుంది. ఎవరూలేని నాకు ఇంతకాలమూ నువ్వున్నావని భావిస్తూ వచ్చాను. ఇప్పుడా భ్రమలన్నీ వదులుకుంటాను. గుడ్‌బై షాలినీ... అంటేనో? ఎలా ఈ సమస్యను సాల్వ్ చేసేది? ఏమీ ఆలోచించకుండా వూరుకోవడమే సొల్యూషనా?' ఇలాంటి ఆలోచనలు షాలిని బుర్రను తింటున్నాయి.

హారతి గుర్తువచ్చింది. అయ్యో! ఇండియా నుంచి వచ్చాక ఆవిడకి కాల్ చెయ్యలేదు అనుకుంటూ వెంటనే పిలిచింది.

"హాయ్ హారతీ! సమీర్ ఇక్కడ న్యూయార్క్‌లోని ఫ్రెండ్‌తో బిజినెస్ స్టార్ట్ చేశాడు. ఇండియాలో పన్లు సెటిల్ చేసుకుని వచ్చేశామండీ! సారీ! ఆలస్యంగా చెబుతున్నాను"

"ఏం పర్వాలేదు షాలినీ! నేనర్థం చేసుకోగలను. అయినా వినీల చెప్పిందిలెండి. నేనే ఫోన్ చెయ్యాలనుకున్నాను కానీ మీరు బిజీగా వుంటారని వూరుకున్నాను" అన్నారావిడ సంతోషంగా!

" హారతీ! నాకో సమస్య వచ్చింది. మీతో వున్న పరిచయంతో మీరే నన్ను అర్థం చేసుకుని తగిన సలహా ఇవ్వగలరని తోచింది, ఇకనుంచీ మనం బెస్ట్ ఫ్రెండ్స్"

"తప్పకుండా! నామీద ఆ నమ్మకం ఏర్పడినందుకు అయామ్ వెరీ హాపీ! నాకు తోచిన సలహా చెబుతాను" అంది హారతి

షాలిని పెళ్లి మొదలు, ఇప్పటివరకూ జరిగిన సంఘటనలూ, పర్యవసానం, రేణు ప్రవేశం, క్రమంగా సమీర్‌తో ఆమె చనువు పెంచుకోవడం, తన మానసిక అలజడీ, సమీర్‌తో వచ్చిన అభిప్రాయభేదాలు, తుషారా, సమీర్ రేణూని లైక్ చేసే విధానం, తనలోపాలు దాచకుండా వివరించింది.

"హారతీ ఒక్క విషయం చెప్పండి. మగవాడి మనసు వేరు! జీవితం వేరూనా? "

"మగవాడికే కాదు షాలినీ, స్త్రీ, పురుషులు ఇద్దరికీ ఈ ఉపమానం వర్తిస్తుంది. ఇందుకు నా జీవితం ఉదాహరణ. సమయం వచ్చింది కనుక చెబుతాను.

మీరు అనడం ఎబ్బెట్టుగా అనిపిస్తోంది. 'నువ్వు' అంటాను. ఏమీ అనుకోవుకదా?

షాలినీ, మీ ముగ్గురి గురించీ నాకు తోచిన అభిప్రాయం మొదట వివరిస్తాను.

సమీర్ చిన్నప్పుడు పెరిగిన వాతావరణం కారణమేమో అతడి ఇష్టాన్ని అనుసరించి కాకుండా పెద్దవాళ్లు తమ అభిరుచులకనుగుణంగా నిన్ను కోడలిగా ఎంచుకుని వుండాలి. సామాన్యంగా ఇంటికోడలు ఒద్దికగా వుండాలని. పెద్దవాళ్లని గౌరవిస్తూ చెప్పినట్టుండే అమ్మాయి రావాలని కోరుకుంటారు. అలాగే నిన్ను ఇష్టపడి కోడలిగా తెచ్చుకున్నారు. చిన్నచిన్న అభిప్రాయ భేదాలు తప్పితే నువ్వు వారికి అనుగుణంగానే నడుస్తూ వచ్చావ్.

ఇక సమీర్‌కి రాబోయే భార్యమీద ఒక అభిప్రాయం అంటూ ఏర్పడలేదు. అమ్మానాన్నలు చెప్పారు కాబట్టి పెళ్లి చేసుకున్నాడు. మీ పెళ్లి నాటికి అతడు ఇంకా చదువు కొనసాగిస్తూనే వున్నాడుకదా! పెళ్లి అంటే సెక్స్‌కి లైసెన్స్ ఇచ్చినట్టు! కాబట్టి అతను ఆ దృష్టితోనే నిన్ను చూశాడు.

నువ్వు పుట్టింట్లో ఏ సమస్యలూ తెలియకుండా పెరిగావ్. ఒకవేళ వున్నా నీ వాళ్లు నీ దాకా రానీయలేదు. ఒక్కదానివే కనుక వాళ్లు కోరుకున్న అజయ్‌తో కాక నువ్వు కోరిన సమీర్‌కే ఇచ్చి చేశారు. నువ్వు కూడా నీక్కావలసిందేమిటో తెలుసుకోగల మెచ్యూరిటీ సాధించని స్థితిలో పెళ్లికి సిద్ధపడ్డావ్. అప్పటిరోజుల్లో చాలా వరకు ఆడపిల్లలు అదే స్థితిలో వుండేవారు తప్ప కోరుకున్న లక్షణాలుగల లైఫ్ పార్టనర్ని ఎంచుకోగల స్థాయిలో లేరు. కొద్ది మందికి ఆ అవకాశం దక్కిందేమో!

అందుకే అత్తవారింటికి వెళ్లగానే చక్రధరంగారి కుటుంబ సమస్యలు, రంగారావ్ గారి ధాష్టీకం, ఆడవాళ్ల అసహాయతా నీకొక సవాల్‌గానూ వారిని బాగు చేయగల అవకాశం ఆశయంగానూ కనిపించి అత్యుత్సాహంతో ముందుకు దూసుకెళ్లావ్. అయితే తాతగారు వున్నంతకాలం ఏం చేయలేకపోయినా పార్వతి, పిల్లల విషయంలో మార్పు తీసుకురావడంలో నీ కృషి మెచ్చుకోవలసిందే!




అయితే షాలినీ ఆ కుటుంబ సంరక్షణలో సమీర్‌ని చిన్నచూపు చూశావ్. అది కావాలని చేయలేదు. కానీ నీ జీవితానికి మూల పురుషుణ్ణి ఆకట్టుకోవడంలో నిస్సహాయురాలివైపోయావు. మంచి ఉద్యోగం, హోదా, మాడ్రన్ సొసైటీ, మారిన పరిస్థితులు, రాగల అవకాశాలు సమీర్‌లో కొత్త ఊహలకు ఊపిరి పోశాయ్. అతడు సునాయాశంగా అందులో ఇమిడిపోయాడు. నిన్ను తన ఊహలకు అనుగుణంగా మార్చుకోవాలని ప్రయత్నం చేశాడో లేదో నాకు తెలియదు. నువ్వు తుషార పుట్టి పెరిగేవరకూ అతి మామూలు ఆడపిల్లగా మసలుకున్నావేకానీ సమీర్‌లోని మార్పు గుర్తించలేదు. భర్త స్థితిగతులు, హోదా, ప్రొఫెషన్‌ని బట్టి నువ్వు మారాలి. నువ్వది గుర్తించలేదు. తుషార మారుతున్న కాలానికి ప్రతినిధి. అందుకే తనకు ఏదికావాలో దాన్ని నిస్సంకోచంగా పొందగలిగింది. తుషార ఎప్పుడైతే తనుకోరిన లైఫ్‌కి వెళ్లిపోయిందో అప్పుడు నువ్వు ఒంటరితనం ఫీలయ్యి సమీర్‌మీద దృష్టి సారించావ్. అప్పటికే ఆలస్యమైపోయింది.

సమీర్ సామీప్యం కోరుకున్నకొద్దీ అతడు దూరం అవసాగాడు. సరిగ్గా అదే టైంలో రేణూ ప్రవేశించింది. ఆ అమ్మాయి. నీ ఫ్రెండేకాని బహుశా పెరిగిన స్థితిగతులో, నేచరో కానీ ఫ్రీబర్డ్‌లాంటిది కావడంతో సమీర్ ఆమెవైపు సహజంగానే మొగ్గు చూపించాడు. నువ్వు అనుకునే మిత్రద్రోహం, మోసం అనే ఆలోచన రేణూకిలేదు. షాలినీ! కోరుకున్నది అందుబాటు అయినప్పుడు అనుభవించడమే మనిషి తత్వం. అక్కడ తప్పొప్పుల ప్రసక్తి కాని ద్రోహం, అన్యాయం అనే ఆలోచన కానీ రాదు.

షాలినీ! ఈ కల్లోల పరిస్థితిలో అజయ్ కనిపించి నీ మనసుకి కాస్తంత సాంత్వన చేకూర్చాడనుకో నువ్వు తప్పకుండా అతడివైపు, తిరిగి పోయేదానివి. అన్నివిధాల ఒంటరివైపోయిన నువ్వు శరణాలయం ఆశ్రయించావ్. అది మంచిదే! కానీ దాంపత్య జీవితంలో నువ్వు ఓడిపోయావ్ షాలినీ! వేరేదారిలేక టైంపాస్, మనశ్శాంతి కోసం బలవంతంగా మనసు మళ్లిందేకానీ నీ జీవితానికి పరిపూర్ణత సిద్ధించలేదు షాలినీ.

భార్యాభర్తల మధ్య అన్యోన్యత, అనురాగం జీవితకాలం నిలబడటం ఒక వరం షాలినీ. అది నీకు దక్కలేదు. స్వయంకృతమా అంటావేమో! ఒకరకంగా అంతే! నీ భర్త కంటే నీకెవరూ ఎక్కువకాదు. నీ జీవితం సుఖంగా వుండాలంటే మరికొన్నింటిని వదులుకోవాల్సిందే. ఇప్పుడు రేణూని నిలదీసి, 'నా కాపురంలో చిచ్చుపెట్టావే రాక్షసీ అంటే ప్రయోజనం వుండదు షాలినీ. జరిగిందేదో జరిగిపోయింది. నిన్నెవరూ విడిచిపోలేదు. నిన్ను వద్దని నిర్లక్ష్యం చేయడంలేదు. మంచో, చెడో నీకిక మరో అవకాశం లేదు. ఇలాగే కొనసాగనివ్వు షాలినీ. నీక్కూడా రేణూ కావాలి. సమీర్ కావాలి. వాళ్లిద్దరూ లేని జీవితం నీకులేదు. విచిత్రంగా మీ ముగ్గురూ ఒకరికొకరు ఆలంబన అయ్యారు" అంటూ స్పష్టంగా షాలిని పరిస్థితిని కళ్ళముందు నిలబెట్టింది.

తర్వాత తన లైఫ్ గురించి ఇలా చెబుతూ "నేనీ దేశం వచ్చేసరికి మా అమ్మాయి చందనకి పదేళ్ళ వయసు. చందనకు ఎటువంటి ఆంక్షలూ పెట్టలేదు. చాలామంది భయపడుతూంటారు. ఈ దేశం కల్చర్ వంటబట్టి, విచ్చలవిడిగా వుండడానికి అలవాటు పడతారేమో, ఇండియన్ కల్చర్ నేర్పాలి అనుకుంటారు. అయితే చందనలో వాళ్ళ నాన్నగారి జీన్స్ వున్నాయేమో! మా వారు శ్రీరామ్ ఈ దేశంలో ఉద్యోగానికి వచ్చి ఇరవై సంవత్సరాలు గడిచినా, పాత పద్ధతిలో హిందూ ట్రెడిషన్ పాటిస్తారు.

వింత ఏమిటంటే నేను కూడా పెరిగింది నిష్ఠాచార కుటుంబంలోనే. అయినా. దేశ, కాల పరిస్థితులకు అనుగుణంగా ఇక్కడ చదువుకున్నాను. ఉద్యోగం చేశాను. నాకంటూ స్వేచ్ఛ కావాలని కోరుకున్నాను. శ్రీరామ్ సహకరించనందున బాధగా అన్పించేది. కానీ తనెప్పుడూ నా దారికి అడ్డురాలేదు. ఇలా వుండాలని శాసించలేదు. 'నీ భావాలు నీవి. బలవంతంగా నా భావాలను తప్పనిసరిగా అనుకరించమని చెప్పలేను హారతీ. నా భార్యవి అయినంతమాత్రాన నాకు అనుగుణంగానే వుండాలని చెప్పను' అనేవారు.

అందుకే శ్రీరామ్‌పట్ల ప్రత్యేకమైన గౌరవం వుంది. అలా అని నన్ను నేను వంచించుకోలేను. ఇక్కడి అమెరికన్స్‌లాగే వుంటాను. మాడ్రన్‌గా వుంటాను. అమెరికన్స్ కూడా ఏజ్‌నుబట్టి హుందాగా వుంటారు. వారిని నేను ఫాలో అవుతాను. బాహ్యసౌందర్యానికి మేకప్ ఎంత అవసరమో, ఫిజికల్ ఫిట్‌నెస్‌కి విటమిన్స్ వాడడం, హార్మోన్స్ ట్రీట్‌మెంట్ ఈ దేశంలో కామన్. నాకో డాక్టర్ ఫ్రెండ్ వున్నారు. ఆవిడ సలహాలను పాటిస్తుంటాను.

నేను చెప్పేది మీకు విపరీతంగాలేదు కదా? " అంది.

"లేదు హారతీ. నాకు తెలియనివి నీనుంచి నేర్చుకుంటాను. చెప్పు. నేను కూడా పాటిస్తాను"

"అసలు విషయం వింటే నా మీదున్న సదభిప్రాయం మాయమవచ్చు"

"లేదు... చెప్పు హారతీ..." శ్రద్ధగా వింటూ అంది షాలిని.

"శ్రీరామ్ ఈ దేశంలో వుండి కూడా కొన్ని నియమనిష్టలు పాటిస్తాడు. అందులో ముఖ్యమైంది సెక్స్‌కి దూరం కావడం, ఇదే నాకు నచ్చనిది. ఆశ్చర్యపోకు షాలినీ! అందం, ఆరోగ్యం వున్న నేను నా భర్త మూర్ఖత్వంవలన ఫ్యామిలీ లైఫ్ కోల్పోయాను. దాంతో నేను చాలా నిరాశపడిపోయాను. నేనేం చేయాలి షాలినీ? అన్నట్టు మా ఇద్దరికీ మధ్య డిఫరెన్స్ ఎంతో తెలుసా? పదేళ్ళు. శ్రీరామ్ దారిలో నడవడం నాకు నచ్చనిది. అతడు నాకు అనుకూలంగా మారలేదు. చాలాకాలం ఘర్షణతో నలిగిపోయాను. నీకు కోపం వస్తుందేమో. ఈ పరిస్థితిలో రవివర్మ పరిచయం అయ్యాడు. చాలా తేలిగ్గా నేనతని ఆకర్షణలో పడిపోయాను. కేవలం కబుర్లు చెప్పుకోవడం, సాహితీచర్చలు, కష్టం, సుఖం, ఆలోచనలను పంచుకోవడం నాకెంతో మనశ్శాంతినిచ్చింది. నా అదృష్టం కొద్దీ అతను చాలా మంచివాడు. నాలో చెలరేగే వికృతపుటాలోచనలదారి మళ్ళించాడు. మెడిటేషన్, సైట్‌సీయింగ్, ట్రావెల్ చేయడం వీటితో మార్పు తీసుకువచ్చాడు. చూశావా... ఆకర్షణలో పడడానికి, మగవాళ్ళది చంచలమైన మనసు అనుకోవలసిన పన్లేదు. ఆడవాళ్ళమూ అతీతులంకాదు. ఈ సంగతి నీకు తెలియాలనే, నా గురించి చెప్పాను. అర్థం అయింది కదూ? "

"అయితే హారతీ, నీ మనసు తెల్సుకుని బాధను పంచుకుని మీరు వేయబోయే తప్పటడుగునుంచి కాపాడిన వ్యక్తిలా, సమీర్ మోహంలో కొట్టుకుపోతున్నప్పుడు రేణూ వివేకమేమిటో చెప్పాలికదా? అలా ఎందుకు జరగలేదు? పైగా సమీర్ బలహీనత తనకు అనుగుణంగా మార్చుకుంది కదా? రేణును తప్పుపట్టవా? "

"రేణుపై అంత నింద వేయడానికి సాహసించను... షాలినీ. కావాలని ఎవరూ అలా ప్రవర్తించరు. మగవాణ్ణి ఆకర్షించుకోలేరు. అలా అని తప్పించుకోలేరు.

శ్రీరామ్‌మీద కలిగిన అసంతృప్తితో నాకు నచ్చిన వ్యక్తితో సుఖాన్ని పంచుకోవాలనీ అనుకోలేదు. శ్రీరాం నాపట్ల చూపించలేని ఇంట్రస్ట్ తాత్కాలికంగా రవివర్మను ఆశ్ర





యించడంతో సాధ్యపడింది. అలా అని శ్రీరాంని ద్వేషించలేదు. మన జనరేషన్‌లో పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్ళే ఎక్కువ కావడంతో, ఒక కట్టుబాటుండేది. రానురాను ఆలోచనా ధోరణి మారుతూ వచ్చింది. పిల్లలకు ప్రాధాన్యత ఇవ్వసాగారు. చదువు, ఆర్థిక స్వాతంత్రంతోపాటు విచక్షణాజ్ఞానం పిల్లల్లో పెరుగుతూ వచ్చింది. అమ్మాయిలు లైఫ్‌పార్టనర్‌ను ఎంచుకోవడంలోనూ, లేదా ఒక ధ్యేయంతో తమ కెరియర్‌కి పునాదులు వేసుకోవడంలోనూ చొరవ చూపించడం జరుగుతోంది.

అలాగే ఆలోచనలు, దశలవారీగా పరిపక్వతను సంతరించుకుంటున్నాయి. బాల్యం, యవ్వనం, నడివయసు వృద్ధాప్యంలో భేదాలు స్పష్టమవుతుంటాయి.

తెలియని వయసులో ఒకరు ఆలంబనగా మసలడం అనేది బాల్యానికి ప్రతీక. కావాలనుకున్నది సాధించగల ధైర్యం, సాహసం ఇచ్చేది యవ్వనం. తరువాత దశ భవిష్యత్ ప్రణాళికలు, స్థిరమైన అభిప్రాయాలు ఏర్పడేది. ఈ దశ ప్రతీవారి జీవితంలోనూ ముఖ్యమైన మలుపుగా సంతరించుకుంటుంది. నడివయసుగా మారే మూడోదశ. చివరిదశలో రాజీతత్వం, నిస్సహాయత ఎదుటివారికి అనుకూలంగా మారడం ఎవరో ఒకరిపై ఆధారపడాల్సిరావడం, ఇవన్నీ వృద్ధాప్యంలో జరిగేవి. ఖచ్చితంగా అందరిదీ ఒకేలాంటి తత్వం కాకపోయినా, అటూ ఇటూ సాగిపోయే జీవనవిధానం ఇది."

"హారతీ... జీవితాన్ని ఇంత చక్కగా నిర్వచించడం నీకే సాధ్యమైంది. కాబట్టి నువ్వే నాకు ఒక మార్గాన్ని చూపించగలవు. నేను ఈ స్థితిలో ఏం చేయగలనో చెప్పు"

"షాలినీ! రేణుని దూరం చేసుకోవద్దు. సమీర్‌పట్ల అసహనం, నిర్లక్ష్యమూ ప్రదర్శించవద్దు. నిజానికి ఇక పరిష్కారమంటూ ఏదీ లేదు. ఇలా గడిచిపోవడానికి నీకేమీ ఆటంకం ఏర్పడదు. ఈజీగా తీసుకో. తీరిక లేనీ, ఆలోచించే టైమ్‌లేని వ్యాపకం కల్పించుకో"

"అదేమిటో నువ్వే చెప్పు"

"మీ ఏరియాలో ఇండియన్ బాచిలర్స్ వున్నారేమో తెల్సుకో. వారికోసం ఇండియన్ స్టైల్లో మెస్‌లాంటిది స్టార్ట్ చెయ్. సక్సెస్ అయిందో ఎస్టాబ్లిష్ చేయవచ్చు" అంది హారతి.

"గుడ్ అయిడియా హారతీ. అమూల్యమైన నీ సలహాకి చాలా థాంక్స్" అంటూ వెంటనే ఆమె సలహాను ఆచరణలోకి తెచ్చింది.

ఇండియానుంచి కంపెనీ వర్క్‌మీద వచ్చినవారు ఆరునెల్లూ, సంవత్సరం అమెరికాలో వుంటూంటారు. ఈ పది సంవత్సరాలుగా ఇండియానుంచి అమెరికా వచ్చేవారు చాలా మందే వున్నారు. కొందరు కంపెనీ మారి ఉద్యోగాల్లో స్థిరపడినవాళ్ళున్నారు. జీవితంలో ఒక్కసారైనా అమెరికా వెళ్లాలనే యాంబిషన్ దాదాపు ప్రతీ ఒక్కరికీ వుంటుంది వారివారి ప్రొఫెషన్స్ ఆధారంగా. అలా ఓసారి ఇండియన్ రెస్టారెంట్‌లో ఆరుగురు యువకులు పరిచయం అయ్యారు. వారితో సంప్రదించి, ఆంధ్రా భోజనం మీరు కోరినట్టు తయారుచేయగలననీ, మీ కోపరేషన్ కావాలనీ చెప్పగానే... వాళ్ళు చాలా ఆనందంగా ఒప్పుకున్నారు. అలా ప్రారంభించి అతి త్వరలోనే ఇరవై మంది వరకూ పెంచుకోగల స్థాయికి చేరుకుంది షాలిని.

మొదట్లో యథాప్రకారం సమీర్ అంగీకరించలేదు. తర్వాత వచ్చేవారంతా మంచి కస్టమర్స్ ఎడ్యుకేటెడ్ అవడంతో సరిపెట్టుకున్నాడు. ప్రెసిడెంట్ వైఫ్ వర్క్ చేస్తున్నా, సూపర్‌స్టార్ సరదాగా ఇటువంటి పనిచేసినా అతి సామాన్య విషయంగా తీసుకునే దేశం ఇది అనుకున్నాడు.

చేతినిండా పని. మనసంతా సంతృప్తి. పనికిమాలిన ఆలోచనలకు దూరంగా



షాలిని హాపీగా వుండసాగింది. చాలామం దికి సోషల్‌సర్వీస్ చేయాలని ఇండివిడ్యు వాలిటీ కోరుకునేవారున్నా భర్త అంగీకరిం చడు. 'భార్య తనకంటే ఏ విషయంలో అయినా ఒక్కమెట్టు పైన వున్నా భర్త సహించలేడు. ఎందుకంటే అతను మగ వాడు. తరువాతే భర్త అవుతాడు కనుక' అని ఒక ప్రముఖ రచయిత్రి చెప్పారు. ఇది చాలావరకూ నిజం.

పాపం కొందరు ఆడవాళ్ళు భర్తచాటున ఏమీ చేయలేక నిస్సహాయులుగా మిగిలిపో తున్నారు. వారికెన్నో ఆశలు, కోరికలూ ఆశయాలూ వుంటాయి.

తల్లినో, తండ్రినో ఒంటరిగా ఇండియాలో వదిలి, విదేశాల్లో స్థిరపడిన కొడుకులు, కూతుళ్ళూ వారిని తమతోపాటు వుండాలని కోరినా, నిస్సంకోచంగా ఆత్మవిశ్వాసంతో మా జీవితం మాదంటూ ఒంటరిగా వుండ డానికే ఇష్టపడుతున్నారు నేటి మహిళలు.

మరో ప్రముఖ రచయిత్రి 'ఆడవాళ్లు పెళ్లి చేసుకోకుండా కొంతకాలం (ఒకతరం) వుండిపోతే, స్త్రీ జనాభా తగ్గి, స్త్రీ విలువ తెలుస్తుందనీ, మగవాడి అహం తగ్గుతుం దనీ' అంటారు. ఈ మాటలు ఆలోచించా ల్సినవే అనిపిస్తూంటుంది.

కారణాలు ఏవైనా ఇప్పటికే స్త్రీలలో మార్పు వస్తోంది. తమ కాళ్లమీద నిలబడి స్వతంత్రజీవనం చేయగలుగుతున్నారు. మగవాడి ఆసరా అవసరం లేదంటున్నారు. పెళ్లి కాకుంటే నష్టపోయేది ఏమీలేదనీ, పెళ్లే పరమావధి కాదనీ అంటున్నారు. ఆడవాళ్లు తల్లి కావాలని పరితపించిపోతారనీ, ఆ వీక్నెస్‌కి లోబడే, మగవారి ఆగడాలు భరి స్తారని అంటున్నవారి మాటలు నిజాలు కావు. శారీరక లోపంతో సంతానం కలగక పోతే పెంచిన పిల్లలపట్ల కన్నప్రేమని మించి అనుబంధం పెంచుకోవడంలేదా? మాతృత్వసిద్ధికి అర్థం 'కంటేనే' అని కాదనీ, 'పెంచినా' ప్రేమలో మార్పు వుండదనీ నిరూపిస్తున్నారు.

జన్మనిచ్చిన మమకారం వేరు. మాతృత్వ సిద్ధిలేని స్త్రీ న్యూనతాభావంతో కృంగిపో తుందనీ, అవమానకరంగా భావిస్తుందనీ, అమ్మ అని పిలిపించుకోవడానికి అనైతి కంగా కూడా సిద్ధపడుతుందనీ, తహతహ లాడిపోతుందనీ లేని కోరికలని ఆపాదిస్తు న్నారు. ఇదంతా వట్టి అపోహ మాత్రమే. ఒకప్పుడు చదువులేని స్త్రీలు ఇంటికే పరిమి తమై అలా అనుకుని వుండచ్చునేమో. ఈరోజు చదువు, ఇంగితజ్ఞానం, వ్యక్తిత్వం, ఆలోచనాగల మహిళ అదొక గొప్పతనమని భావించదు. అనాథలని చేరదీసి, చదివించి, తీర్చిదిద్దటంలో మానవత్వం, సంతృప్తి, మమకారం వుంటాయని నిరూపిస్తోంది.

షాలిని ఆలోచనలు కొత్త భావాలకి ఊపి రిపోసి, ఏ దేశమైనా, ఏ వ్యక్తికైనా సహాయ పడటం జీవితలక్ష్యమని అనుకుంటోంది. సమీర్, రేణూల గురించి వికృతంగా ఆలో చించడం మానుకుంది. 'ఈ దేశం రేణూకో సమే వచ్చాడా సమీర్' అనే పనికిమాలిన ఆలోచనతో టైమ్ వేస్ట్ చేయడంలేదు. 'ఎందుకు వచ్చినా ఓ కొత్త ప్రపంచం చూడ గల అవకాశం లభించింది. తుషార కూడా దగ్గరగా వుంది. మనం ఎన్నుకున్న మార్గం నలుగురికీ ఉపకరిస్తే ఏ దేశమైనా ఒకటే' అనుకుంది ఆమె. ఇండియానీ, శరణాల యాన్నీ విడిచి పరాయిదేశం వెళ్లడానికి అంగీకరించలేని షాలిని ఇప్పుడు ఆ తలపే రానీయదు. పరాయి దేశాలవారు ఇండియా వస్తారు. అటువంటప్పుడు మనమూ వెడితే తప్పేముంది? విజ్ఞానానికి, దేశాభివృద్ధి పథకాలు తెలుసుకోడానికి ఎల్లలు అంటూ లేవు కదా అనుకోవడం ప్రారంభించింది.

హారతి వంటి మరో మంచి ఫ్రెండ్ లభించింది. ఇప్పుడు ఆమెకి అలజడి, ఒత్తిడి, ఆందోళనా అనేవి లేనేలేవు. రేణూ షాలినితోనే వుంటోందిప్పుడు. ఎప్పటిలా సరదాగా వుంటున్నారు. తుషార తనకి

నచ్చిన జీవితంలో ఇమిడిపోయింది. అమెరి కావచ్చి అప్పుడే అయిదు సంవత్సరాలు గడి చింది. ఎప్పుడైనా చాలా అరుదుగా గత మంతా గుర్తువస్తే, 'ఎక్కణ్ణించి ఎక్కడికి చేరుకున్నాం? మధ్యలో ఎన్ని మజిలీలు? ఇలా జరుగుతుందనీ, జరగాలనీ అనుకో లేదు. కాలానుగుణంగా దేశ, కాల పరిస్థితు లకనుగుణంగా సాగిపోవడమే జీవితం' అనుకుంది షాలిని.

అమెరికన్ సొసైటీలో వ్యక్తిగత పరిచ యాలకి అంతగా ప్రాధాన్యత వుండదు. ఇద్దరు వ్యక్తులకి బాగా స్నేహం కలిస్తే తప్ప నీ వాళ్లెవరు? మీరిక్కడ ఎంతకాలం వుంటారు? మీ ఫామిలీ వివరాలు ఏమిటి అనే సంగతులు అడగరు, వాళ్లు చెప్పరు.

మొదట్లో ఇండియన్స్ మాత్రమే వచ్చే మెస్‌కి రానురాను డిఫరెంట్ కంట్రీస్‌వాళ్లు రావడంతో వారికి అనుగుణంగా డిషెస్‌లో మార్పు తీసుకువద్దామా అనుకుంది షాలిని. కానీ ఇండియన్ ఫుడ్ టేస్ట్ అన్ని రకాల వారికీ తెలియజెప్పాలని యథాతథంగా కొన సాగించింది. రానురాను ఇండియన్స్ జరు పుకునే ఫంక్షన్స్‌కి, పార్టీలకి, ఫెస్టివల్స్‌కి స్పెషల్స్ చేయండని ఒకరు సలహా ఇవ్వ డంతో ఆ పనీ మొదలుపెట్టింది. మరో ఇద్దరు ఆడవాళ్ల సహాయం తీసుకుంది. వారిద్దరి అంకితభావం, నమ్మకం చూశాక వారికి పని అప్పగించి, చాలా కాలమైంది కదా ఓసారి ఇండియా వెళ్లివద్దామని అను కుంది. సమీర్‌ని అడిగితే తను రానన్నాడు.

★ ★ ★

మొట్టమొదట శరణాలయం చూడా లనిపించిందామెకి. ఆమె పంపించే డాల ర్స్‌తో ఓల్డేజ్‌హోమ్ స్టార్ట్ చేయాలనే నిర్వా హకుల సలహా షాలినికి నచ్చింది. తన అంగీకారం తెలియచేసి అప్పటికప్పుడే శర ణాలయానికి దగ్గర్లో బిల్డింగ్ ఒకటి అమ్మ కానికి వుంటే కొనేసింది. రెస్పాన్స్ బాగానే వుంది. అప్లికేషన్స్ వేలమీద వున్నాయి. షాలినికి తల తిరిగింది వాటిని చూస్తే.

విదేశాల్లో వున్నవారు ఇండియాలో పూర్వంలాగే బంధుత్వాలు, అనురాగాలు కొనసాగుతున్నాయనే భ్రమలో వుంటారు. కానీ అదంతా నశించిపోయింది. ఎవరికె వరు బంధువులో తెలీదు. భారతదేశ జనా భాలో సగంమంది విదేశాలకి వలసపోవ డంతో వృద్ధులు మాత్రమే మిగిలిపోయారా అనే సందేహం కలిగింది. విదేశాల్లో చెప్పు కునే భారత సంస్కృతి, ఉమ్మడి కుటుంబ వ్యవస్థ సమూలంగా నాశనమైపోయినట్టు తోచింది.

పరిమిత కుటుంబంలో ప్రేమానుబంధాలు అడుగంటిపోయాయి. పదిమంది బంధువుల రాకపోకలూ, అభిమానాలూ, రక్తసంబం ధాలూ అంటూ లింక్ వుండేది ఒకప్పుడు. ఇప్పుడవి మచ్చుకి కానరావడంలేదు.

అనాథ శిశువుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. అంటే అక్రమ సంతానం, ఆడపి ల్లలూ నడివీధుల పాలవుతూ బతికినవారు బతగ్గా, మరణించినవారు మరణించడం షాలిని మనసును కలచివేసింది.

విదేశీ సంస్కృతి విశృంఖలత్వానికి దారి తీసి పిల్లలని కన్నవెంటనే చెత్తకుప్పలో పడేసే దారుణానికి దిగజారడం కంటినీరు తెప్పించింది. దీన్ని ఆపడం ఎలా? ఏ కార ణంగా దేశం ఇలా తయారవుతోంది?

విదేశాల్లో పధ్నాలుగు సంవత్సరాల అమ్మాయిలు డేటింగ్‌చేసి, బాయ్‌ఫ్రెండ్స్‌తో గల సంబంధాల కారణంగా పిల్లలని కనడం అతి మామూలు విషయం. కొందరు ధైర్యంగా పిల్లలని పెంచుకుంటున్నారు. అందుక్కారణం అక్కడి గవర్నమెంట్ ఫైనా న్షియల్ సపోర్ట్ ఇస్తుంది. సంపన్నదేశం కాబట్టి ఇలా జన్మించిన అక్రమ సంతానా నికి హెల్ప్ చేస్తుంది.

ఇండియాలో అదెంతవరకూ సాధ్యం? అమెరికా ప్రభుత్వం డైవోర్సీలకు కూడా ఉపాధి సౌకర్యాలని కల్పిస్తుంది. ఫ్రీ ఎడ్యు



# ఏరినముత్యాలు

* మూఢాచారాలనుండి ముక్తుడైన వాడికి మృత్యుభయం వుండదు.

– గురునానక్

* సాధ్యమైనదానికంటే ఎక్కువ మంచిగా వుండాలనుకోవడం పెద్ద పొరపాటు.

– వాల్టర్‌లేగేహాట్

* వివాదం ఎంతకూ తెగలేదంటే అర్థం తప్పు రెండువేపులా వుందని.

– ఒల్టేర్

* కలసివచ్చినప్పుడు, సుఖాలలో దేవుడిని స్మరిస్తే ఇక కష్టాలే రావు.

– కబీరు

* ఎప్పుడూ జయమే సాధించే ఎదురులేని అస్త్రం 'ప్రేమ'.

– కన్సోలటా

* వృత్తిని ఆనందంగాను, ఆనందాన్ని వృత్తిగాను మలచుకోవడమే జీవిత ధ్యేయం.

– అరాకబర్

* సమర్థునికి అసమర్థుడు అందజేసే అభినందన 'ఈర్ష్య'.

– మేడమ్ డి. వ్యాషియన్స్

* జాతీయ ప్రవృత్తి మారాలంటే జాతిలో ప్రతివ్యక్తి ప్రవృత్తీ మారాలి.

– జేమ్స్ ట్రస్‌లో ఆడమ్స్

* అధికారం ఎక్కువయిన కొద్దీ దుర్వినియోగం ఉపద్రవకరం.

– ఎడ్మండ్‌బర్క్

* నైపుణ్యాలకి, ఆశయాలకి మధ్య బేధమే 'అసౌఖ్యం'.

– ఎడ్వర్డ్ డి. లోనో

* దేవుడు ఇంకా గొప్ప విషయాలకోసం మనల్ని మలచేందుకు వాడే పరికరాలు కష్టాలు.

– హెచ్.డి. బీచర్

* న్యాయశీలతలేని విజ్ఞానం అపాయకరం, భయోత్పాతకం.

– శామ్యూల్ జాన్సన్

* క్షీణించని ప్రతిఫలాలనిచ్చే ఉత్పత్తి సాధన విజ్ఞానం ఒక్కటే.

– జే.ఎమ్. క్లార్క్

* అవధులు దాటితే ఓర్పే పిరికితనం అనిపించుకుంటుంది.

– జోసఫ్‌రోక్స్

* అపరాధం చేయడం కంటే అపరాధం సహించడం ఉత్తమం.

– థామస్ ఫుల్లర్

సేకరణ: ఎ.ఎల్. సువర్చల

కేషన్ సదుపాయాన్ని కలగచేస్తుంది. ఇవన్నీ అమలుచేయడం ఇండియన్ గవర్న్‌మెంట్‌కి సాధ్యపడదు. అందుక్కారణం అడుగడుగునా కరప్షన్. అబద్ధపు సర్టిఫికెట్స్ సబ్మిట్ చేసేవారే ఎక్కువగా వుండటం మరో కారణం. శరణాలయాలని, వృద్ధాశ్రమాలని పోషించే దాతలే వుండాలి కాని, అనాథలకి, నిరాశ్రయులకి కొరతే లేదు.

ఈ దేశానికి దూరంగా వున్నా కొంతవరకు సహాయపడుతున్నాను అనే సంతృప్తితో మూడునెల్ల తర్వాత తిరిగి అమెరికా వచ్చేసింది షాలిని.



సమీర్ పార్ట్‌నర్‌గా చేరిన అమెరికన్ విలియమ్స్ దగ్గరే రేణూ, సమీర్ కలసి ఆ కంపెనీ కొనేశారు. బిజినెస్ సక్సెస్‌ఫుల్‌గా రన్ అవుతోంది. రేణూ, సమీర్ చాలా కష్టపడి ఎంతో ఉచ్ఛస్థితికి తీసుకొచ్చారు. డాలర్ల వర్షం కురిసింది. 'అదంతా రేణూ ఇచ్చిన సలహా వల్లనే' అంటూ సమీర్ రేణూకి లాభంలో సగం వాటా ఇచ్చాడు. తనకి మాత్రం ఎవరున్నారని? ఇండియాలో చైల్డ్ వెల్‌ఫేర్ ఫండ్స్‌కి, ఓల్డేజ్ హోమ్స్‌కి విరివిగా దానం చేసింది. రేణూ చేసింది మంచి పనే అన్పించినా 'అలా చేస్తూపోతే అక్కడ అనాథలు మరింతగా పెరుగుతారేమో' అనిపించింది షాలినికి.

సమీర్, రేణూ కంపెనీకి మరింతగా అంకితమైపోయారు. షాలిని కూడా ఇప్పుడు కంపెనీ వర్క్ చూస్తోంది. అనుభవం అన్నీ నేర్పుతుందేమో! 'ఒకరకంగా నాలాంటి ఆలోచనాపరులకి అమెరికన్ లైఫ్ బాగుంటుందేమో' అనుకుంది. ఎప్పుడూ ఏదో హేళనగా మాట్లాడే సమీర్ షాలినికి ఓపికగా కంపెనీ వర్క్‌లో ట్రైనింగ్ ఇచ్చాడు. చేసిన పనిని మెచ్చుకునేవాడు. సంవత్సరానికోసారి షాలినితో కలిసి ప్లెజెంట్ ట్రిప్ చేసేవాడు. షాలిని సలహా అడగటం, మంచిదనిపిస్తే ఆచరణలో పెట్టడం, లేదంటే 'అలా కాదోయ్, మరోసారి ఆలోచించు' అనడం. షాలినిపట్ల శ్రద్ధ చూపించడం, తరచుగా 'షాలూ, మనం చాలా పోగొట్టుకున్నాం కదూ. ఇప్పుడు తెలుసుకున్నాను. కానీ ఏం లాభం? గతం తిరిగిరాదుగా' అని పశ్చాత్తాపం వ్యక్తం చేయడం, తుషారను చూసివస్తాను తనకి రావడం వీలుపడటంలేదని అంటున్న షాలినికి, 'వద్దు షాలూ, యంగ్ డైనమిక్' తుషార గురించి భయపడాల్సింది లేదు. 'నన్ను వదిలి వెళ్లొద్దు' అనడం ఇదంతా చూస్తుంటే ఆశ్చర్యంగా వుందామెకి. అతడు కోరినట్టే చేస్తోంది.

సమీర్‌లో ఈ మార్పు దేనికి సూచన? పెరిగే వయసా? లేక ఆలస్యంగా తనని గుర్తించడమా? రేణూపట్ల ద్వేషమా అనేది అర్థంకాలేదు. చివరి రోజుల్లో భార్య సపోర్ట్ అవసరం మరి. ఆరోగ్యం సరిగాలేకపోయినా, మరేదైనా చచ్చినట్టు చాకిరీ చేయాల్సింది కట్టుకున్న భార్యేనని చాలా ఆలస్యంగా తెలిసివచ్చిందేమో' అనుకునేది షాలిని.

రేణూ కేవలం కంపెనీ వర్క్‌వరకే పరి

మితమా? ఆమె అంటే వెగటు పుట్టిందా? ఇప్పుడు రేణూని చూస్తే జాలి అన్పించింది షాలినికి. 'పిచ్చిది! మా ముగ్గురితో జీవితాన్ని ముడివేసుకుంది. తను ఎందుకు ఆమెను వేరు చేయాలి? తెలిసి, కావాలని నాకు ద్రోహం చేయలేదు. రేణుని ద్వేషించాల్సిన అవసరమేమీ లేదు. ఈ దేశం వచ్చాక తన లైఫ్ అంతా కంపెనీకి అంకితం చేసింది. నన్నేమీ నిరాదరణగానీ, నిర్లక్ష్యంగానీ చేయలేదు. సమీర్ తనకి అత్యంత ఆప్తుడనుకుని అతన్నే నమ్ముకుంది. మేం ముగ్గురం ఏనాడూ బహిరంగంగా ఈ విషయం మాట్లాడుకోలేదు. అయితేనేం విడివిడిగా తెలుసుకోగలం. ఇప్పుడు రేణూపట్ల నాకేమీ కోపంలేదు. సమీర్‌కి కోరుకున్న జీవితాన్నిచ్చింది తప్పితే అతణ్ణి నానుంచి బలవంతంగాలాక్కొనిపోలేదు. ఇందులో ఒక్క రేణూ ప్రమేయమే లేదు, సమీర్‌ది కూడా అసలు రేణూతో కాబట్టి సమీర్ సాన్నిహిత్యాన్ని అంగీకరించగలిగాను. మరెవ్వరైనా అయివుంటే డైవోర్స్ ఇచ్చేదాన్ని. రేణూ అంటే నాక్కూడా ఇష్టం, జాలి, ప్రేమా, అభిమానం వున్నాయన్న మాట' అనుకుంది ఆమె.

సమీర్‌కూడా మా ఇద్దరిని ఆదరంగానే చూసాడు. మాకేమీ లోటు చేయలేదు. విచిత్రం రేణుతో అతనికి సంబంధం ఉందని తెలిసికూడా అతన్ని నేనేమీ నిందించలేదు. నాకు తెలియకుండానే రాజీ పడిపోయాను. రహస్యంగా నా కళ్ళుకప్పి అక్రమసంబంధాన్ని కొనసాగిస్తే పర్యవసానం వేరుగా వుండేది. అలా కాక నోటితో చెప్పకుండానే నెమ్మదిగా రేణుకు సన్నిహితుడయ్యాడు. నేను గ్రహించేలా చేశాడు తప్పితే 'నీతో నాకు సుఖంలేదు. నిన్ను భరించలేను. రేణు ఆకర్షణలో పడ్డాను. నీ దారి నీవు చూసుకో' అన్లేదు. నేను అతన్ని కరెక్టుగా అంచనా వేశాను. .హారతి కూడా 'సమీర్ నిన్ను ఒదులుకోడు. రేణుకి దూరంగా ఉండలేడు.' అని చెప్పింది కదా' అనుకుంది షాలిని.

అసలు రేణూ పరిచయం ఇలా తన జీవితంతో పెనవేసుకు పోతుందని కలలో కూడా అనుకోలేదు షాలిని.

ఓరోజు మామూలుగా కంపెనీనుంచి ఇంటికి వచ్చారు రేణూ, సమీర్. షాలిని డాక్టర్ అప్పాయింట్‌మెంట్ వుంటే వెళ్లింది. ఇంకా రాలేదు. ముగ్గురూ కలసి డిన్నర్ చేయడం అలవాటు.

"రేణూ, నాక్కొంచెం టీ ఇస్తావా తలనొప్పిగా వుంది" అన్నాడు. రేణూ ఇద్దరికీ టీ చేసి తెచ్చింది. టీ తాగినా ఆ నొప్పేమీ తగ్గినట్టుగా లేదంటే టాబ్‌లెట్ ఇచ్చి పెయిన్ బామ్‌తో కణతలు రాస్తూండిపోయింది రేణూ.

"రేణూ! నువ్వు నా జీవితంలోకి వింతగా ప్రవేశించావు. అంతటితో ఆగకుండా సన్నిహితురాలివయ్యావు. కంపెనీ బాగుకోసం అహర్నిశలూ నా తోడుగా నిల్చావు. నీకు నేనేమిచ్చాను రేణూ? " ఆర్తిగా, జాలిగా ఆ చేతులని పట్టి, మీదకి లాక్కుంటూ అన్నాడు సమీర్.

"సమీర్! నువ్వు నాకేమివ్వలేదూ? అన్నీ ఇచ్చావు. హక్కులనేవి అగ్నిసాక్షిగా పేపర్ మీద రాసే అక్షరాలుగా రిజిస్టర్ కానవసరం లేదు. నువ్వేమీ దిగులుపడకు. నా స్త్రీత్వానికి పరిపూర్ణతనిచ్చావు. ఒకోసారి ప్రాణ స్నేహితురాలికి ద్రోహం చేశానా అని బాధ కలిగేది. కానీ సమీర్, నీ పరిష్వంగం ఇచ్చే సుఖంలో 'నేనేం చేయలేదు. ఎవరేమనుకున్నా సమీర్‌ని వదులుకోను' అనే నిశ్చయానికి వచ్చాను. కంపెనీ అంటావా, మనిద్దరిదీను. అన్నీ మనం పంచుకున్నాం సమీర్. నా జీవితానికి ఇంతకంటే ఏంవద్దు" అంటూ అలా అతడి కౌగిట్లో ఎంతసేపు వుండిపోయిందో కాలమే తెలియలేదు.

షాలిని ఇంటికి వచ్చి, డోర్ తీస్తున్న శబ్దానికి మెలకువ వచ్చింది. "ఎప్పుడూ ఈ స్థితిలో షాలిని కంటపడలేదు" అనుకుంటూ దిగ్గునలేస్తూ సమీర్‌కేసి చూసింది. అతడు

మామూలుగాలేదు. 'సమీర్, సమీర్' అంటూ కుదిపి చూసింది. అతడిలో చలనంలేదు. 'షాలూ' అని పెట్టిన కేకకి అర్థం గ్రహించింది షాలిని. సమీర్ ఇకలేడు. 'నన్ను వదిలి వెళ్లొద్దు' అనే సమీర్ సరిగ్గా షాలిని లేని టైమ్‌లో రేణూ పరిష్వంగంలో ప్రాణాలు విడిచాడు. ఇది రేణూ అదృష్టం. మితిమీరిన శరీర పరిశ్రమా, అలసటా సమీర్‌ని బలికొంది తప్పితే ప్రాణంతీసే అనారోగ్యం లేదతడికి.

★ ★ ★

సమీర్ లేని రోజులు గడిచిపోతూనే వున్నాయి. మునుపటి ఉత్సాహం పోయింది రేణూలో. సమీర్ మరణం ఇద్దరిలోనూ నిరాశ నింపింది. "షాలూ! తుషారకి కంపెనీ అప్పగించి రెస్ట్ తీసుకుంటాను" అన్నదోరోజు.

"తుషారకి అనుభవంలేదు. ఒక్కతే మానేజ్ చేయగలదా? "

"నిజమే అనుకో. నేనూ, సమీర్ ఎంతో కష్టపడి ఉన్నతస్థితికి తెచ్చాం. సమీర్‌లేని రెండు సంవత్సరాలు బిజినెస్ దెబ్బతింది. అఫ్‌కోర్స్ లాభనష్టాలు సహజమే అనుకో. మనవాళ్లే కంపెనీ చూసుకుంటారు అనే తృప్తి వుంటుంది. పూర్తిగా తుషారమీద వదిలేయననుకో. వెనక వుండి చూసుకుంటాలే" అంది రేణూ.

తుషారని సంప్రతించడానికి న్యూయార్క్ రమ్మని పిలిచింది.

"సారీ ఆంటీ, నాకు న్యూయార్క్ అంటే పడదు. కాలిఫోర్నియాకి కంపెనీ షిఫ్ట్ చేద్దాం, మీరే ఇక్కడికి వచ్చేద్దురుగాని" అంటూ బదులు చెప్పింది తుషార.

"డాడ్ ఇక్కడ ఎస్టాబ్లిష్ చేసిన కంపెనీని కొత్త ప్లేస్‌కి మార్చడం మంచిది కాదేమో. వచ్చి కొద్దికాలం చూడకూడదూ? అప్పుడే నిర్ణయం తీసుకోవచ్చు" అంది రేణూ.

"మామ్! వాటీజ్ యువర్ ఒపీనియన్? నీ ఇంట్రస్ట్ ఏమిటో చెప్పు" అంటూ తల్లిని అడిగింది తుషార.

"నా ఇంట్రస్ట్‌దేముంది? ఎక్కడైనా ఫర్వాలేదు. నీ కంఫర్ట్ ముఖ్యం" అంది షాలిని ఎప్పట్లా.

ఇకమీదట షాలిని కూడా పూర్తిగా కంపెనీకి అంకితమవ్వాలని అనుకుంటోంది. చివరి రోజుల్లో సమీర్‌లో కొద్ది మార్పును చూసినా షాలినికి సమీర్‌లేని లోటు లోటుగా అనిపించలేదు. అతడు మానసికంగా దగ్గరగా వచ్చింది లేదు. ఇద్దరిమధ్యా చాలాకాలం సాగింది యాంత్రిక జీవితమే. మొదట్నించీ ఒకేలా వుండే ప్రేమానుబంధం అయితే పటిష్టంగా వుండేది. అందుకే జ్ఞాపకం తెచ్చుకోగల అనుభూతులంటూ లేనేలేవు. మొదట్లోలాగే ఇప్పుడు కూడా రేణూ, షాలినీల మధ్య అనుబంధం కొనసాగడంతో ఎన్నో విషయాలని చర్చించుకునేవారు.

ఇండియానుంచి తెలిసినవారు వస్తుంటే బుక్స్ తెచ్చిపెట్టమని ఇ-మెయిల్ పంపించింది షాలిని. రేణుకి తీరిక వుండదు. అందువలన బుక్స్ అట్టే చదవదు. మొదట్నించీ పెద్దగా చదివే అలవాటులేదు. హారతి, షాలినికి ఈ విషయంలో మంచి పోటీ.

తుషార వచ్చేసింది. వాళ్ల డాడ్ ప్లేస్‌లో అలవాటుపడడానికి టైమ్ పట్టింది. రేణూ అంటే మంచి గురి. "డాడ్, రేణూ ఆంటీని ఎందుకు లైక్ చేసేవారో అర్థమైంది మామ్. ఆంటీ ఈజ్ వెరీ జీనియస్" అని చెప్పేది.

'తెలివితేటలు ఎవరిలో వున్నా ఇట్టే గుర్తించగల నేర్పు సమీర్‌కి వుంది. అందుకే రేణూని లైక్ చేసేవాడు" అనుకుంది షాలిని.

హారతి సరదాగా షాలినిని చూడాలని వచ్చింది.

అంతా కలిసి మళ్ళీ నయాగరా ఫాల్స్ ట్రిప్ వేశారు.

"కెనడానుంచి వ్యూ చూశారా హారతీ



ఆంటీ?" అడిగింది తుషార.

"చూశాను తుషారా! ఈసారి ఇటు న్యూయార్క్ నుంచి చూడాలని వచ్చాను" అంది.

"మీకు ఏది నచ్చింది?"

"దేని అందం దానిదే! ఆమధ్య మా బంధువులు ఇండియానుంచి విజిట్‌కి వచ్చారు. కొన్ని ప్లేసెస్‌కి తీసికెళ్ళాం. తిరిగి వెనక్కి ఇండియా వెళ్ళిపోతూ వాళ్ళు ఏమన్నారో చూడు... 'ఏమిటో అమెరికా గొప్ప. అన్నీ ఓలాగే వుంటాయి. న్యూయార్క్‌లో ఎత్తైన బిల్డింగ్స్, మిన్నిసోటాలో ఎక్కువ లేక్స్, మరోచోట బీచ్‌లూ. గ్రీనరీ అంతా ఇండియాలోని ఊటీ, కొడైకెనాల్ లాగే వుంది"

"అయితే మీరు ఈ దేశం రెండోసారి రారనుకుంటాను. మీరు ఇంతకీ ఇండియా అంతా చూశారా? అనడిగాను 'అబ్బే! ఇండియా ఎక్కడ చూశాం. ఇకమీదట చూడాలి' అన్నారు.

ఆ తర్వాత ఎప్పుడో ఫోన్‌లో పిలిచినప్పుడు అడిగాను... ఈ సంవత్సరం వెకేషన్‌కి ఏ ట్రిప్ వేశారని! దానికి వాళ్ళు చెప్పింది ఏమంటే, 'ముందు ఇండియా చూసి, తర్వాత అమెరికా చూడాలని తెలిసి వచ్చింది. ఇంకేం చూస్తాం చెప్పండి?' అన్నారు..." అంటూ హారతి ఒకటే నవ్వి...

"కొందరు అంతే! వున్నమాట చెప్పరు. లేనిపోని భేషజాలకు పోతారు. మా చెల్లాయ్ భారతి వుంది. దానికి మా మేనత్త కొడుకే భర్త. వాళ్ళు బాగా ఆస్తిపరులు. కొబ్బరి తోటలూ, మామిడి తోటలూ, ఐశ్వర్యం అంతా ఊరికే పోతుందని, ఒక్కడే కొడుకని పెళ్ళి చేశారు మా నాన్న.

మా చెల్లికి అక్కడి అలవాట్లు బాగా పట్టుబడ్డాయి. సిటీలంటే వెగటు. స్వచ్ఛమైన గాలీ, నీరూ మాకున్నాయ్. మీకైతే క్షణం ఎలక్ట్రిసిటీ లేకుంటే గడవదు' అనేది. అది చెప్పింది నిజమే. కానీ నాకు కంపేరింగ్ నచ్చేది కాదు. నేను చేసిన దానికి పేరు పెట్టి, తను చేసిందే మంచిపని అంటుంది.

దాని కూతురికి పెళ్ళయి, అమెరికా వచ్చిందిలే! ఓసారి కూతురు హారిక డెలివరీకని, ఈ దేశం వచ్చిందిలే! చెబితే నమ్మవు. 'మీ అత్తగార్ని అయినా పిలిపించుకోకపోయావా? అక్కడ నాకు కో అంటే కోటి మంది నౌకర్లూ, చాకర్లూను. ఇక్కడ ఇంటి పనంతా చేసుకోవడం, ముఖ్యంగా ఈ లెట్రిన్ కడగటం నచ్చలేదు స్మా. సిగ్గూ, ఎగ్గూలేని ఆడవాళ్ళు సగం బట్టలతో, అలా రోడ్డంట తిరగడం, నాకేం నచ్చలేదు. చచ్చే సిగ్గేస్తోంది" అంటూ డెలివరీ అవకుండానే వెళ్ళిపోయింది.

చివరికి హారిక అత్తగార్నే పిలిపించుకుంది. ఆవిడ చక్కగా చెప్పినవన్నీ ఇట్టే గ్రహించి, కోడలికీ తల్లికంటే ఎక్కువగా చేసింది. కన్నకూతురికి ఆసరా కంటే మిగిలినవే ముఖ్యం అన్నట్టుండే మా చెల్లికి లోకజ్ఞానం అంటూ లేనేలేదు. హారిక తల్లి ప్రవర్తనకి ఎంత బాధపడిందో. 'ఈ దేశంలో వుంటే ఇక మా అమ్మ రాదేమో పెద్దమ్మా' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"పోనీలే హారికా! మీ అత్తగారు మంచావిడ. అమ్మని చూడాలని వున్నప్పుడు నువ్వే వెడుదువుగాని" అంటూ ఓదార్చేను. అప్పుడప్పుడు నేవెళ్ళి చూసి వస్తుంటాను.

చాలాకాలంగా అడగాలనుకుంటున్నాను. నువ్వు పిట్స్‌బర్గ్ దేవాలయానికి వెళ్ళినట్టు లేదు. దేవుడూ, పూజా అటువంటి అలవాట్లు లేవా?"

"మొదట్నించీ అటువంటి అలవాట్లు లేవు. సమీర్‌కి ఇష్టం వుండదు. మనసు బాగాలేనప్పుడు మెడిటేషన్ చేస్తాను. బాబాలు, సన్యాసులు అంటే మహాచిరాకు! దేవుడి పేరుమీద పబ్లిసిటీ, వృథా ఖర్చూ ఎక్కువయ్యాయి ఈమధ్య. సారీ హారతీ! నీకు నమ్మకాలున్నాయేమో, నేనిలా విమ





ర్శించానని కోపం వస్తుందేమో?" అంది షాలిని.

"నాది కూడా నీలాంటి అభిప్రాయమే! యశోదగారైతే నన్ను శపించేసింది. భక్తీ, పూజా లేని ఆడవాళ్ళు ఎందుకూ పనికిరారట. కుటుంబ క్షేమానికి పూజలు తప్పనిసరిగా చేయాలట. పరలోకంలో యముడు చాలా కష్టాలను కలిగిస్తాడట. ఏవేవో అనేది. కొనితెచ్చుకునేవి కావు. స్వతః మనసులో వుండాలి. మాకు లేదు మా దారిన మమ్మల్ని వదిలేయండి" అంటానేను.

నాకు తెలిసిన రాధగారని ఒకావిడ వున్నారు. ఈ దేశం వచ్చేసరికి టెన్త్ కూడా చదవలేదు. ఇక్కడికి వచ్చాక డిగ్రీచేసి, ఆ తర్వాత సిఏ చదివి, ప్రాక్టీస్ పెట్టారు. అమెరికన్ సొసైటీలో చక్కగా ఇమిడిపోయారు. మాడ్రన్‌గా వుండటం, డ్రింక్ పార్టీలు, అందరితో తేడా లేకుండా ఫ్రీగా మూవ్ అవడం, చక్కగా ఎంజాయ్ చేశారు. వీటికి నేను వ్యతిరేకిని కాను. ఈ రాధ, వాళ్ళమ్మాయికి పదేళ్ళు వచ్చేసరికి పద్ధతులన్నీ మార్చేసింది. ఇంట్లో ఇండియన్ కల్చర్. బైట అమెరికన్ కల్చర్ పాటిస్తారు. వాళ్ళెంత కష్టపడి, వాళ్ళమ్మాయిని ఇండియన్ సాంప్రదాయంలో పెంచాలనుకున్నా ఆ అమ్మాయికి నచ్చలేదు. తనకు నచ్చిన విధంగా వుంటుంది.

ఇక అబ్బాయికి ఇండియా వెళ్ళి, ఏరికోరి, వెదికి వెదికి మారుమూల పల్లెటూరి అమ్మాయిని, మడీ, ఆచారం, మూఢనమ్మకాలూ వున్న అమ్మాయిని, కోడలిగా తెచ్చుకున్నారు. అబ్బాయిని వాళ్ళకు అనుకూలంగా పెంచారు. అతను ఇన్నోసెంట్ కావడంతో పూర్తిగా అమ్మా, నాన్నల ఆసరాతోనే పెరిగాడు.

కోడలు వచ్చాక రాధగారి ట్రీట్‌మెంట్ మొదలైంది. నోములూ, వ్రతాలూ, శనివారం, గురువారం పర్వదినాలు అంటూ ప్రాణంతీసి కొడుకూ, కోడళ్లను సుఖపడనీయలేదు. ఆ అమ్మాయి విసిగిపోయి, ఎదురుతిరిగి వేరే కాపురం పెట్టింది. ఊళ్ళోనే కదా అని, సరిపెట్టుకుని ప్రతిరోజూ ఇంటికెళ్ళి, వాళ్ళెలా మసలుకోవాలో సలహాలు చెప్పడం మొదలెట్టింది.

ఓ వయసు వచ్చిన తర్వాత పిల్లలకూ స్వంత ఆలోచన్లూ ఊహలూ వుంటాయని, చదువుకున్న రాధకి తెలియలేదు".

"తెలియక పోవడం కాదు హారతీ! వాళ్ళు తన చెప్పుచేతల్లో వుండాలనే అహంభావం" అంది రేణూ.

"అవును. సరిగ్గా చెప్పావ్. క్రమంగా రాధగారి కొడుకు భార్యవైపు తిరిగిపోయి, నీకెందుకమ్మా మా గొడవ? అన్నీ పూజ చూసుకుంటుందిలే అనడం మొదలుపెట్టాడు. అయినా ఆవిడ మారలేదు. భర్తకు బాగా ఎక్కించి, మీ పెద్దరికాన్ని మంట కలుపుతున్నారు. అంటూ లేనిపోనివి చెప్పేది. పల్లెటూరి అమాయకపు అమ్మాయి చెప్పినట్టు వింటుందిలే అనుకున్నందుకు పూజ అత్తగారికంటే నాలుగాకులు ఎక్కువే చదివిందనీ, తననుబట్టే ఆ అమ్మాయి ఎదురుతిరుగుతోందని రాధగారికి ఆలస్యంగా తెలిసొచ్చింది పాపం! అప్పటికే కొడుకూ, కోడలూ దూరంగా మరో ఊళ్ళో ఉద్యోగ ప్రయత్నాలు చేసుకుని వెళ్ళే ప్రయత్నంలో వున్నారు. ఇది తెలిసి మరో రకంగా సాధించింది, బెదిరించింది, భయపెట్టింది. ఇదికాదని నగలూ, బహుమతులంటూ ఎరవేయసాగింధి. పూర్తిగా అన్నిట్లో విఫలమైంది. కోడలి గురించి తనే చెడు ప్రచారం చేసింది. హేళన చేసింది. ఎవరో ఏదో అంటున్నారు జాగ్రత్త అని హెచ్చరించింది. అయినా రాధ చిత్తుగా ఓడిపోయింది. ఇప్పుడు ఆవిడ అహంకారం అణిగిపోయింది. వాళ్ళెలా చెబితే అలా వింటుంది.

మంచిగా వుండి, కోడల్ని ఆదరించాలి. వాళ్ళ అభిప్రాయాలకు విలువ ఇవ్వాలి.

అత్తగారి హోదా వచ్చేసరికి పిల్లలను కంట్రోల్ చేయాలనుకోవడం, చదువుకున్న దైనా ఈనాటి కాలానికి తగినట్టు నడుచుకో కపోవడం, ఆవిడ చేసిన పెద్ద పొర పాటు..." అంటూ హారతి ఎన్నో విష యాలు చెప్పింది.

"ఆంటీ! మీరు ఒక్కొక్కరి గురించీ చెబు తుంటే చాలా ఇంట్రస్టింగ్‌గా వుంది. ఎన్నో విషయాలు, మనుషుల స్వభావాలు తెలు స్తున్నాయి. ఇంకేదైనా చెప్పండి" హుషా రుగా అడిగింది తుషార.

"ఇప్పుడు టైమెంతో తెలుసా? పన్నెండు దాటింది. ఆంటీని నిద్రపోనీయవా? చిన్న పాపాయిలా ఏమిటీ అల్లరి తుషారా?" కూతుర్ని మందలించింది షాలిని.

హారతీ, షాలినీ ఎన్నో కబుర్లు చెప్పుకు న్నారు. శ్రీరాం లాస్టియర్ మరణించాడు. చందన వాళ్ళ ఫాదర్ వున్నంతకాలమూ ఆయనకు నచ్చినట్టు ఆచార వ్యవహారాలు పాటిస్తూ, సడన్‌గా ఛేంజ్ అయిపోయింది. తండ్రి ప్రభావం ఆయన వున్నంతకాలమే! రెణ్ణెళ్ల క్రితం ఇజ్రాయిల్ అబ్బాయిని పెళ్ళి చేసుకుంది. వాళ్ళిప్పుడు అట్లాంటాలో వున్నారు. హారతి ఒక్కతే వుంటోంది. మినియపొలీస్‌లో.

"నా ఒక్కదానికే అంత ఇల్లు దేనికని సేల్‌కి పెట్టేసి, టు బెడ్‌రూం అపార్ట్‌మెం ట్‌కి మారాను. చందన ఎప్పుడో వస్తుంది నేనే తరచుగా వెడుతుంటాను" అందామె.

"హారతీ మనం క్లోజ్‌గా వుంటాం కనుక, ఒక విషయం అడుగుతాను. మరోలా అను కోవుకదూ?" షాలిని ప్రశ్నించింది.

"అనుకోడానికి ఏముంది? అడుగు చెబు తాను"

"నువ్వు ఒంటరిగా వుంటున్నావు. ఆరో గ్యమూ మంచిదే! చాలా ఏక్టివ్‌గా వుంటావు. అందంగా వుంటావు. మరి రవి వర్మను నీ జీవితంలోకి ఆహ్వానించవచ్చు ఒకరికొకరు తోడుగా వుండచ్చు. నీకిక అడ్డే ముంది?" అంది షాలిని.

"ఎవరో అడ్డువస్తారనీ, ఏదో అనుకుంటా రనీ కాదు షాలినీ! ఈమధ్యనే చందన వెళ్ళి పోయాక నాక్కూడా ఈ ఆలోచన రాకపో లేదు. రవివర్మ కూడా తొందర చేస్తున్నాడు"

"మరి దేనికీ ఆలోచన? ఆయన భార్య గురించి ఏమైనా..."

"లేదు షాలినీ! రవివర్మ అన్‌మారిడ్! ఆర్మీలో రిటైర్డ్ మేజర్ జనరల్. పెళ్ళి, సంసారం, తన కర్తవ్యదీక్షకు ఆటంకం అనే అభిప్రాయంతో అలాగే వుండిపోయారట. నా పరిచయం తనకో తోడు కావాలని తొందర చేస్తోందట. ఇద్దరం మనస్ఫూర్తిగా ఒకరికొకరం కావాలని కోరుకుంటున్నాం కనుక ఇకనుంచి ఒకేచోట వుండాలని నిశ్చ యించుకున్నాం. నువ్వు అడగకుండానే చెప్పాలనుకున్నాను.

చందన నేను హెల్తీగా వున్నాననే కారణం కావచ్చు నా గురించి ఏమీ కలగ చేసుకోదు. అదీకాక తనకో తోడు లభ్యమైం దిగా!"

"ఓ.కె. హారతీ! నెక్స్ట్‌టైమ్ మీరిద్దరూ కలిసి మా ఇంటికి రావాలి మరి" అన్నది షాలిని హారతికి వీడ్కోలు చెబుతూ!

హారతీ, రవివర్మా రిజిస్టర్ మ్యారేజ్ చేసుకున్నారు. ఈ విషయం వెంటనే తుషా ర్‌తో చెప్పింది షాలిని.

"నువ్వు ఇండియాలో ప్రారంభించిన కౌన్సిలింగ్, ఇక్కడా కొనసాగిస్తున్నావా? వెరీనైస్, హారతీ ఆంటీకి నువ్విచ్చిన సలహా యేనా ఇది?" అడిగింది తుషార.

"హారతీ ఆంటీకి, నా దగ్గరకు కౌన్సిలిం గ్‌కి వచ్చే వయసా? లేదు. అది తన నిర్ణ యమే" అంది నవ్వుతూ షాలిని.

చాలాకాలానికి షాలినికి మళ్ళీ గతం గుర్తొచ్చింది.

సమీర్‌కి నచ్చనిది ఈ కౌన్సిలింగ్ ప్రోగ్రాం ఒకటి. 'ఒకరి జీవితాన్ని సరిచే యాలని, నా జీవితాన్నే బలిపెట్టనా? అలా




ఎందుకు అనుకోవాలి? నా ప్రోత్సాహం కొందరి జీవితాలకు మార్గదర్శకం అయిందనుకుంటే తృప్తి. ఆ రోజుల్లో ఉత్సాహం అటువంటిది. సమీర్ ఉద్యోగ నిర్వహణలో తరచూ ఇంటికి దూరంగా వుండేవాడు. ఆ పరిస్థితిలో అత్తవారింట్లోనే వుంటే బాగుండేదని అనిపించకపోలేదు. సమీర్ రేణూ ఆకర్షణలోనూ, హారతి రవివర్మ ఆకర్షణలోనూ చిక్కుకున్నా చక్కగా, తమకు అనుకూలంగా మార్చుకున్నారు. అదృష్టం అంటే వాళ్ళదే!' అనుకుంది షాలిని.

ఇప్పుడు షాలినీ, రేణూ, తుషారా ప్రమీలా రాజ్యం స్థాపించుకున్నట్టుంది. 'ప్రమీలా రాజ్యం'లో మగ పురుక్కి ప్రవేశం నిషిద్ధం' అనేది హాస్యంగా షాలిని.

అప్పుడప్పుడు కంపెనీ ఎంప్లాయిస్‌కి ఇంట్లో పార్టీ డిన్నర్ ఇచ్చేది షాలిని.

ఇండియాలో శరణాలయం, ఓల్డేజ్ హోమ్ చక్కగా కొనసాగుతున్నట్టు కబుర్లు తెలిసేవి. సమీర్ ఆస్తిలో సగానికి సగం తుషార కోరికమీద శరణాలయానికి డిపాజిట్ చేసింది. 'సమీర్ సదన్'గా అతడి పేరు పెట్టింది.

ప్రతీ సంవత్సరం ఇండియాకి వెళ్ళి వస్తోంది. అక్కడివారు నమ్మకంగానే బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

హారతీ, రవివర్మా వచ్చారు. రవివర్మను మొదటిసారి చూశారు షాలినీ, రేణూ, తుషారా!

అతనో అద్భుతమైన వ్యక్తి. చూడగానే తెల్సిపోయింది. హారతి ఎంతటి లక్కీఫెలో అని అనుకోకుండా వుండలేకపోయారు ముగ్గురూ! వాళ్ళున్న పదిరోజులు అంతా హాపీగా గడిచిపోయింది.

"హారతీ ఎలా వుంది కొత్త జీవితం?"

"చాలా స్వీట్‌గా వుంది షాలినీ! వర్మ అంటాడు. 'మనం చాలారోజులు వేస్ట్ చేశాం హారతీ' అని! అంతేకాదు 'నేను చాలా పిరికివాణ్ణి! నా చిన్నప్పుడు అంటే డిగ్రీ చదివేరోజుల్లో మా ఇంటి పక్కనున్న అమ్మాయీ నేనూ చాలా ఫ్రెండ్లీగా వుండేవాళ్ళం. పెళ్ళి గురించి ఆలోచన అప్పుడు లేదు కానీ, ఆ అమ్మాయితో అనుభవం కావాలనిపించేది. అయినా భయమే! ఆ అమ్మాయిని ఒక్కసారి కూడా టచ్ చేయలేదు. నమ్ముతావా?

విచిత్రం, ఆ అమ్మాయే ఎంకరేజ్ చేసేదని కూడా అర్థం చేసుకోలేని 'చచ్చుఘటాన్ని. ఓరోజు సుడిగాలిలా వచ్చేసి, నన్ను చుట్టుకుని ఒకటే ఏడుపు. తనకి బావతో పెళ్ళి నిశ్చయించారనీ, నువ్వు పెళ్ళి చేసుకుంటానంటే, ఇంట్లో వాళ్ళని ఎదిరించి వచ్చేస్తాననీ, నీ చదువు పూర్తయి ఉద్యోగంలో చేరేదాకా, వెయిట్ చేస్తాననీ నీ వాళ్ళతో మీ ఇంట్లో ఆశ్రయం ఇవ్వాలనీ.. ఎంతో బతిమాలింది.

చెప్పేనుకదా! పెళ్ళనే ఆలోచనే లేదని. ఆకర్షణ ఒక్కటే వుందని! ఆ క్షణంలో నా కోరిక చాలా సులువుగా తీర్చుకోవచ్చు కానీ అటువంటి నమ్మకద్రోహం చేయలేకపోయాను. అందుకే ఏమీ జవాబు చెప్పకుండా వుండిపోయాను.

అంతే... ఆ అమ్మాయి పగబట్టిన తాచులా రోషంగా చూసింది. 'ఛీ... నీకంటే మా బావే నయం... బుద్ధిగా అతగాణ్ణే పెళ్ళి చేసుకుంటాను. ఆడపిల్లని అర్థం చేసుకోలేని చచ్చుఘటానివి. నిన్ను ఈ జన్మకి ఏ అమ్మాయి ప్రేమించదు' అంటూ శాపం పెట్టింది. ఆ శాపఫలితమే నన్ను ఏ అమ్మాయి ప్రేమించలేదు కాబోలు. నిన్ను చూశాక కూడా నాకా చొరవ లేకపోయింది. అంటే ఇన్ని సంవత్సరాలూ నాలో స్పందన లేకుండా పోయిందా? నా ఓటమిని అంగీకరించి ఈ దేశం వచ్చేశాను. ఒక్కసారి కూడా ఇండియా వెళ్ళనేలేదు. నువ్వు కనిపించావ్. మన మధ్య స్నేహం ప్రారంభమైంది. జీవితంపట్ల అసంతృప్తి. నీ భర్తతో సరిపెట్టుకోలేని లోపాలు, నీకు నచ్చని

భావాలు, మనిద్దర్నీ దగ్గర చేశాయ్. కానీ నీకు పెళ్ళయింది. ఓ కూతురుంది. భర్తవ లన నీకు సంతోషంలేదు. అది నువ్వు చెప్పిన తర్వాత నన్ను పెళ్ళి చేసుకోగలవా? అని అడగాలని చాలా అనిపించేది. అయినా ఏదో జంకు, అన్నారు" అని చెప్పింది హారతి.

"నేను కోరుకున్న పరిపూర్ణ పురుషుడు రవివర్మ. నేను ఇంత లేట్‌గా కలవడం దురదృష్టం అనుకోలేదు. చక్కని తోడు దొరికినందుకు చాలా చాలా ఆనందిం చాను. వయసుమళ్ళిన రోజులు సంతో షంగా గడవటం ఒక వరం. ఆ వరం లభించడం లేట్ అయినా, శాశ్వతానందా నికి సోపానం అయింది..." అంటూ ముగించింది హారతి.

★ ★ ★

వింటర్ వచ్చేసింది. ఎక్కడ చూసినా స్నో. కంపెనీకి తప్పితే బైటకి వెళ్ళడం లేదు షాలిని. బుక్ చదవాలని తీసింది. అదెవరో కొత్త రచయితది. పెద్దగా చదవా లనిపించలేదు. అలవాటైన రైటర్స్ నవల్స్ తప్ప కొత్తవి ఎలా వుంటాయో తెలియదు. పాత రైటర్స్ ఎంత కాలం రాయగలరు? రాసినా దృక్పథం, ఆలోచనా ధోరణే మారు తుంది. చదివినవే అయినా, నచ్చినవి మళ్ళీ మళ్ళీ చదవడమే బాగుంటుంది.

అప్పట్లో వచ్చిన మూవీస్, నవల్స్ ఇప్పుడు తల్చుకుంటే జనరేషన్ ఛేంజ్ స్పష్టంగా కనబడుతోంది. రేణూ ఎప్పుడో గాని సినిమా చూడదు. షాలినికైతే చాలా ఇష్టం. ఇంటినిండా సీడీలే! సాంగ్స్ అంటే చెప్పక్కర్లేదు. వింటూ మైమరచిపోతుంది.

ఈమధ్య ఇండియా వెళ్ళి నాలుగేళ్ళు అయిపోయింది. సమీర్ పోవడం, కంపెనీ వ్యవహారాలు, అలా ఏదో సరిపోయింది. ట్రావెల్ ఏజంట్‌కి ఫోన్ చేస్తే మరో వారా నికి టికెట్ దొరికింది.





షాలిని యథాప్రకారం నేరుగా హైదరా బాద్ వెళ్ళి, శరణాలయం చూసింది. ఈసారి హైదరాబాద్ కొత్త అందాలు సంత రించుకున్నట్టుంది. మార్పు ఆహ్లాదకరంగా వుంది. షాలినికి రాజకీయాలంటే అంతగా ఇంట్రస్ట్ లేదుకానీ, ఇండియా న్యూస్ ఇంట ర్‌నెట్‌లో చూస్తుంటుంది. ఆంధ్రా సి.ఎం. ఎన్నోరకాల మార్పులు తెచ్చారు. ప్రజలలో చైతన్యం తీసుకువచ్చారు. సిటీ సరేసరి! మారుమూల గ్రామాలకు కూడా, ఇన్‌ఫర్మే షన్ టెక్నాలజీని విస్తరించే ప్రయత్నానికి, ఆయనను మనసులో మెచ్చుకోకుండా వుండలేకపోయింది.

"మేడమ్! ఎన్.ఆర్.ఐ.లకు సి.ఎం. గెట్ టు గెదర్ అరేంజ్ చేశారు. మీక్కూడా ఇన్విటేషన్ పంపించారు" అంటూ ఇచ్చాడు శరణాలయం ఇన్‌ఛార్జ్ కృష్ణమూర్తి.

"ఎప్పుడూ లేదు. ఇదేమిటి కొత్తగా?" అంది షాలిని.

"శరణాలయం వారి వార్షికోత్సవానికి ఈ సంవత్సరం ఆయనను ఆహ్వానించాను. అప్పుడు వివరాలు అడిగారు. మీ గురించి చెప్పాను. ఇంతకాలంగా నిర్వహింపబ డుతూ, నా దృష్టికి రాకపోవడం బాడ్. అంటూ వెంటనే చూడడానికి వచ్చారు. మీరు తీసుకున్న జాగ్రత్తకీ, కల్పించిన సదు పాయాలకు ముగ్ధులై ఈసారి మీరు వచ్చిన పుడు తెలియచేయమని చెప్పడంతో మీరు వస్తున్నట్టు చెప్పాను" అన్నారు.

"నన్ను ఇరకాటంలో పడేశారు కదండీ. మనకి పబ్లిసిటీ అంటే ఇష్టం వుండదు కదా?" అంది షాలిని అసహనంతో.

"సారీ మేడమ్! మీ అనుమతి తీసుకోక పోవడం నా పొరబాటే. కానీ మీ గురించి ఎప్పటికైనా తెలియకపోదు" అన్నాడు.

షాలిని ఇక మాట్లాడలేకపోయింది. ముఖ్యమంత్రిగారే ఇన్విటేషన్ పంపించా రంటే, ఇష్టం లేకపోయినా నిరాకరించడం సభ్యత కాదు కనుక వెళ్ళక తప్పలేదు.

కృష్ణమూర్తి పరిచయం చేయగానే,

# ఏరినముత్యాలు

* ఇతరులకి బాధ కలిగించే బదులు మనం బాధపడడం మంచిది.

– శామ్యూల్ జాన్సన్

* ఇతరులకి మేలు చేయడం అంటే తనకి తాను ఉపకారం చేసుకోవడమే.

– కన్‌ఫ్యూషియస్

* కొందరు గొప్పవారుగా జన్మిస్తారు. మరికొందరు గొప్పవారుగా జీవిస్తారు. ఇంకొందరు గొప్పవారుగా తయారవుతారు.

– విలియం షేక్స్‌పియర్

* మనకి ఇష్టంలేని వ్యక్తుల గురించి ఆలోచించేందుకు నిమిషం కూడా వృథా చేయొద్దు.

– ప్రాచీన సూక్తి

* ఏ పనినైనా మూడుగంటల ముందు చేయడంలో తప్పులేదు. కానీ ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకూడదు.

– చైనా సూక్తి

* మనిషి విజయం ఆర్జించిన డబ్బునుబట్టికాక సాధించిన మనశ్శాంతినిబట్టి వుంటుంది.

– అరిస్టాటిల్

* అన్ని ఋతువుల్లోనూ కోయిల కూయదు. అలాగే వైవాహిక జీవితంలో అన్నివేళలా ఆనందం లభించదు.

– థామస్ ఫుల్లర్

* పశువును మానవుడిగా, మానవుణ్ణి మాధవుడిగా మార్చేదే నిజమైన మతం.

– స్వామి వివేకానంద

* విధి నిర్వహణని మించిన దేశసేవ లేదు.

– గాంధీజీ

* పలుకుబడి సేవింగ్స్ ఖాతాలాంటిది. మనం దాన్ని ఎంత తక్కువగా వాడుకుంటే అంత ఎక్కువగా దానిని పొందుతాము.

– ఆండ్రూయంగ్

* మనిషికి విజ్ఞతకన్నా మంచి మిత్రుడు లేడు. అజ్ఞానంకన్నా పరమ శత్రువు లేడు.

– డబ్ల్యు. టెంపుల్

* పేదరికం అగౌరవమేమీ కాదు. అయితే సోమరితనం, దుబారా, అవివేకం, విచ్చలవిడితనం వల్ల కలిగే పేదరికం మాత్రం అలాంటిదే.

– ప్లూటర్చ్

సేకరణ: భూక్యా గోపీనాయక్

సి.ఎం.గారు , షాలినితో చేయికలిపారు. సమీర్ గురించి అడిగి తెలుసుకున్నారు. రేణూ, తుషారలను ఈసారి తను అమెరికా వచ్చినప్పుడు కలుస్తానన్నారు. కంపెనీ చూడాలని వుందన్నారు. కంపెనీ గురించి విన్నానని చెప్పారు. తిరిగి వచ్చేముందు ఎన్.ఆర్.ఐ.గా మీవంతు మాతృదేశానికి సహకారం అందించాలని చెప్పారు. పర్స నల్ ఇంటర్వ్యూ ఇచ్చారు!

కృష్ణమూర్తి ఫ్యామిలీతో కలిసి మైసూర్, బెంగుళూర్ వెళ్ళింది. ఇదివరకు చూసినా, మరోసారి మైసూర్ చూడాలనిపించింది. కేరళా వెళ్ళింది. ఇండియా అంతా సమీ ర్‌తో ట్రావెల్ చేసిందే అయినా ఏ స్టేట్ ఎలా డెవలప్ అయిందోననే కుతూహ లంతో మరో ట్రిప్ వేసింది.

అయితే ఊహించినంతగా టూరిజమ్ డెవలప్ కాలేదు. ఫారిన్ కంట్రీస్‌లో ప్రతి చిన్న లొకేషన్‌నీ చాలా అందంగా టూరిస్ట్ సెంటర్‌గా తీర్చిదిద్దుతారు అడుగడుక్కీ, అరణ్యాలైనా సరే! నీట్‌గా వుండే రెస్ట్ రూమ్స్ (బాత్‌రూమ్స్) వుంటాయి. ఫుడ్ కావల్సింది దొరక్కపోవచ్చునేమో కానీ రెస్ట్ రూమ్స్ కంపల్సరీ.

ప్రయాణంలో కృష్ణమూర్తి, భార్య అమె రికా విశేషాలు చెప్పమంటూ కుతూహ లంగా అడిగారు షాలినిని. ఇండియాలో సమాజసేవను తన పరిధిలో తాను చేయా లని సంకల్పించుకొని అనాథ శరణాల యాన్ని ప్రారంభించిన షాలిని అమెరికాతో ఇండియాను పోలుస్తూ ఎన్నో విషయాలను ఆకళింపు చేసుకుంది. అమెరికాలో కొన్ని పద్ధతులు ఆమెకెంతో నచ్చాయి. అవే కృష్ణ మూర్తికి, భార్యకి చెప్పడం ప్రారంభించింది.

"మన దేశాన్ని తక్కువచేసి, విదేశాలను పొగడడంకాదుకానీ అణువణువునా తేడా కనిపిస్తుంది కృష్ణమూర్తిగారూ! మనదే శంలో నిధులు లేవనే కారణంతో అలాగే వుంచేస్తున్నారు. కానీ మొదట పెట్టుబడి పెట్టి సదుపాయాలు కల్పించి, పబ్లిక్‌నుంచే వసూలుచేస్తే నిధుల కొరత సమస్యకాదు.

ఒక పని చేయాలని ప్రభుత్వం సంకల్పిం చినా, ఆ పని పూర్తయ్యేసరికి మధ్యలో తిని వేతగాళ్ళు పంచుకోగా, మిగిలినదానితో అస్త వ్యస్తంగా నాణ్యతలేని నిర్మాణాలతో వర్క్ అయిందనిపించడం మామూలే.

ఉదాహరణకు రోడ్స్. వేసిన ఆరునెల్లకే యధాప్రకారం గోతులతో, కంకర్రాళ్ళు తేలి దర్శనమిస్తాయి. శాంక్షనైన డబ్బు అంచెలం చెలుగా చిన్నాపెద్దా పంచుకుని, నాసిరకం మెటీరియల్‌తో వేసేరోడ్లు ఇంతకంటే అందంగా, నాణ్యంగా ఎలా వుంటాయి? ఇలా ఒక్క రోడ్ల విషయంలోనేకాదు, ప్రతీ రంగంలో ప్రజలు నష్టపోతూనే వున్నారు. ప్రజలు చెల్లించే పన్నులకు ఫలితం దక్క డంలేదు. ఎన్ని ప్రభుత్వాలు మారినా ఇదే చరిత్ర.

అందుకే ఏదోరకంగా విదేశాలకు చేరు కుని అక్కడే స్థిరపడిపోయేవారే ఎక్కువ య్యారు. స్వదేశాల్లో చూసేవారు ఎవరూలే రని విదేశాలకు తల్లితండ్రులను తీసుకువె ళ్ళినా అక్కడి వాతావరణం, అలవాట్లు భిన్నంకావడంతో ఇమడలేక, ఎక్కడైనా ఓల్డేజ్ హోమ్స్ తప్పవు, ఇండియాలోనే నయం అనుకుని ఇక్కడే వుంటున్నారు ఓల్డ్ జనరేషన్.

అలా అని అమెరికాలో వున్న ప్రతీవారూ దర్జాగా బతకడం సాధ్యంకాదు. ధనిక, పేద, మధ్యరకం తేడాలు అక్కడా వున్నాయి మనదేశంలో వలెనే. కొన్నికొన్ని నగరాల్లో ధరలు ఎక్కువ. కొన్నిచోట్ల తక్కు వాను. అంటే కాస్టాఫ్ లివింగ్‌తో పోలిస్తే కొన్ని ఊళ్ళలో ఉద్యోగస్థులు తక్కువ ఆదా యంతోనే జీవించాల్సివుంటుంది. ఏ దేశంలో అయినా తప్పనిస్థితి.

అయితే తేడా వుండనిది పరిశుభ్రతా, సదుపాయాలు. రిటైర్డ్ పీపుల్‌కి తగినట్టు సదుపాయాలతో ఇళ్ళు నిర్మించి ఇస్తారు.





సిటీ బస్ సౌకర్యం అద్భుతం. మనకులా కిక్కిరిసి వుండవు. ఎక్కేటప్పుడు దిగేటప్పుడూ శ్రద్ధ తీసుకుంటారు. పరుగులు పెట్టి, అందుకోవల్సిన పనిలేదు.

వాకింగ్ చేస్తుంటే, అంతదూరాన చూసి, బస్ ఎక్కుతానేమోనని ఆపివుంచి, ఆ బస్‌ను దాటి వెళ్ళినతర్వాతే డ్రైవర్ బస్‌ను స్టార్ట్ చేయడం మొట్టమొదటి అనుభవం. ఇలా రోజూ అదే దార్లో వెళ్ళినా, అలాగే జరిగేది. మరి ఇండియాలో సిటీ బస్ ప్రయాణం అంటే, ఇంటికి చేరుకునేదాకా నమ్మకం వుండదు.

అమెరికాలో పొరబాటున దారి తప్పితే, ట్రాఫిక్ పోలీస్, తన కార్లో తీసుకొచ్చి జాగ్రత్తగా ఇంటిదగ్గర దింపుతారు. అందుకే కొత్తవాళ్ళు తమదగ్గిర ఎప్పుడూ ఇంటి అడ్రస్, ఫోన్ నం. వుంచుకోవడం మంచిది. ఓసారి నేను ఇలా ఇంటిదారి మరిచిపోతే ఒక ఆయన తన ఇంట్లోనుంచి పోలీస్ కంట్రోల్ రూమ్‌కి ఫోన్ చేయమని చెప్పారు. అలా చేయగానే లేడీ పోలీస్ వచ్చి ఏరియా మాప్ చూపించి అడిగింది. దాన్నిబట్టి కరక్ట్‌గా ఇంటికి తీసుకొచ్చి దింపింది.

సూపర్‌మార్కెట్, మాల్‌లలో ఎవరూ లేరు కదాని దొంగతనం చేస్తే మరుక్షణం పట్టుబడక తప్పదు. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలని కొందరు కక్కుర్తి మనుషులు అక్కడే కుకీస్ తినేసి మిల్క్ జ్యూస్‌లాంటివి తాగేసి తాగిన ఖాళీ కేన్స్, ప్యాకెట్స్ అదే ప్లేస్‌లో వెనకాల పెట్టేసి గప్‌చుప్‌గా వచ్చేస్తారు. ఇది చాలా దరిద్రపు అలవాటు. కొనుక్కున్నా డాలర్ ఖరీదు కూడా వుండదు. ఇలా చేసినవార్ని చూసి చాలా సిగ్గుపడాల్సి వచ్చింది. దీన్నిబట్టి అమెరికాలో ఇటీవల ఉద్యోగాలు లేనివాళ్ళు ఎలా జీవిస్తున్నారో అర్థం అవుతుంది. అందరూ అలా వుంటారని కాదు. నా ప్రత్యక్ష అనుభవాన్ని చెప్పాను.

ఒక వస్తువు కొని ఇంటికెళ్ళాక నచ్చకనో, ప్యాకింగ్ సరిగాలేకనో మనం తిరిగి ఇచ్చేయాలనుకుంటే మరో ఊళ్ళో అయినా అదే పేరుగల షాప్‌లో బిల్ చూపించి ఎక్స్ఛేంజ్ తీసుకోవచ్చు లేదా మనీ వాపస్ తీసుకోవచ్చు అయితే 3 నెలల లోపులో మాత్రమే ఈ సదుపాయం వుంటుంది. దీన్ని ఆధారంగా తీసుకుని కెమేరాలు, ఎలక్ట్రానిక్ గూడ్స్, గడువులోగా వాడుకుని రిటర్న్‌చేసి మనీ వెనక్కి తీసుకునే ప్రబుద్ధులకు లోటు లేదు. షాప్‌వారు కస్టమర్‌కి రెస్పెక్ట్‌ఇచ్చి, ప్రొడక్ట్ పేరు నిలబెట్టడానికి, సేల్స్ పెంచడానికి ఈ సదుపాయాలు కల్పిస్తే అల్పబుద్ధిగల కొందరు దుర్వినియోగం చేయడం సిగ్గుచేటు, బాధాకరమైన ప్రవర్తనా!

ఊరినిబట్టి, స్తోమతను బట్టి ఇళ్ళు, అపార్ట్‌మెంట్స్ నివాసయోగ్యంగా వుంటాయి. టు బెడ్, ఒన్‌బెడ్, విత్ లాండ్రీ, వితౌట్ లాండ్రీ (లాండ్రీ అంటే వాషింగ్, డ్రయర్ మిషిన్స్‌తో) అపార్ట్‌మెంట్స్ రెంట్‌కి లభిస్తాయి. కొత్తగా కట్టే అపార్ట్‌మెంట్స్‌లో లాండ్రీ సదుపాయం వుంటుంది. సదుపాయాలను బట్టి రెంట్ వుంటుంది. ఒకో ఏరియాలో సెపరేట్‌గా వేరేచోట పదిపది హేను మిషన్స్ వుంటాయి. అక్కడికి బట్టలు తీసుకెళ్ళాల్సి వుంటుంది. కాయిన్స్ వేసి, లాండ్రీ చేసుకోవాలి. ఇప్పుడు చాలా చోట్ల కార్డ్‌సిస్టమ్ వచ్చింది.

కిచెన్‌లో డిష్‌వాషర్ (గిన్నెలు, ప్లేట్స్ కడిగే మిషిన్) మైక్రోవేవ్ ఓవెన్, కుకింగ్ రేంజ్, రిఫ్రిజిరేటర్, రూమ్‌హీటర్ తప్పనిసరిగ్గా వుంటాయి. ఇంట్లో పోగైన చెత్త అంతా వారానికి ఒకసారి బైటవున్న గార్బేజ్ బాక్స్‌లో వేయాలి. పాలిథిన్ కవర్స్ అమ్మకానికి దొరుకుతాయి. కిచెన్ లోని పెద్ద బాక్స్‌లో వేస్తారు. నిండిన తర్వాత క్లోజ్‌చేసి, టేప్‌కట్టేసి బైట వేయాలి. రూమ్స్‌దగ్గర పెట్టుకునే గార్బేజ్ బాస్కెట్‌లో సూపర్‌మార్కెట్‌లో తెచ్చుకున్న

సామాన్లతో వచ్చే కవర్స్‌వేసి నీట్‌గా కట్టేసి బైటపడేయడంవలన చెత్త బైటపడదు. అక్కడ కేన్స్, బాటిల్స్ వాడకం ఎక్కువ. దేనికది విడిగా కవర్స్‌లో పెట్టి వాటికోసం వుద్దేశించిన డబ్బాల్లో వేస్తారు.

పనిమనుషులను కుదర్చుకోవడం చాలా ఖర్చుతో కూడినది. వారివారి రాబడిని బట్టి, అవసరాన్ని బట్టి వాళ్ళకి రోజుకి, గంటకింత అని చెల్లించాల్సి వుంటుంది. ప్రాంతాలవారీగా మనలాగే పే చేయాల్సి వుంటుంది.

ట్రాఫిక్ రూల్స్ పాటించడం తప్పనిసరి. రెసిడెన్షియల్ ఏరియాలో నడిచేటప్పుడు మనం క్రాస్ చేయాలంటే ఏదైనా కారు వస్తే మనం వెళ్ళిన తర్వాతనే ఆ కారు వాళ్ళు వెడతారు. అంతేతప్ప నిర్లక్ష్యంగా దూసుకు పోవడమనేది వుండదు. హైవేల మీదా, సిటీల్లోనూ, డవున్‌టవున్‌లలో స్పీడ్ లిమిట్ బోర్డ్స్ వుంటాయి. ఆ విధంగానే కార్లు నడపాల్సి వుంటుంది. రూల్స్ అధిగమిస్తే పనిష్మెంట్ తప్పదు. ట్రాఫిక్‌పోలీస్ మనకి కనబడడు. కానీ వాళ్ళకి మనం కనబడతాం. అనుక్షణం వెన్నంటి వుంటారు. క్రమశిక్షణ అలవాటేలేని కొంతమంది ఇండియన్స్ కాప్స్‌ని వెధవ, దరిద్రుడు, రాక్షసుడు అని తిట్లు తిట్టడమేకానీ సభ్యత, సంస్కారంగా మాట్లాడరు. అక్కడ ఆచరణీయాంశాలూ చాలా వున్నాయి. అక్కడ భయంతో ఫాలో అయినవారే, ఇండియా వచ్చేసరికి నిజరూపాలు బైటపెట్టుకుంటారు.

మనం ఏదైనా పార్టీకి వెళ్ళి, గిఫ్ట్ ఇస్తే వెంటనే ఓపెన్‌చేసి మెచ్చుకుని థాంక్స్ చెబుతారు. ఫ్రెండ్‌ని పార్టీకి పిలవాల్సివస్తే పక్కనున్న వ్యక్తిని కూడా పిలుస్తాం గతిలేక, తిట్టుకుంటూ. కానీ అమెరికన్స్‌కి అలాంటి మొహమాటం వుండదు. సంబంధిత వ్యక్తికే రమ్మని చెబుతారు. అది తప్పుకాదు.

ఇక డ్రస్ చేసుకునే విషయానికి వస్తే పెద్ద తేడాలుండవు. నీట్‌గా డ్రస్ చేసుకోవడం, హుందాగా ప్రవర్తించడం మెచ్చుకోవాల్సిందే. తక్కువ స్థాయివారిని హేళన చేయడం రిచ్‌వారిని గౌరవించడం వంటివి అంతగా చూడలేదు. నేను" ఇలా ఎన్నో విషయాలు చెప్పూపోయింది షాలిని. ఆమెకు మరో సంఘటన మదిలో మెదిలింది.

ఒకసారి సమీర్, షాలినీ ఇండియా వస్తున్నారు. ఇద్దరికీ ఒకచోట సీటు దొరకలేదు. వేరువేరుగా లభించింది. ప్లేస్ చాలా క్రౌడీగా వుంది. షాలిని అటూఇటూ అమెరికన్ జపాన్ అతనూ వున్నారు. మధ్య సీటు షాలినిది. ఇద్దరూ భారీమనుషులే. అందులో అమెరికన్ అతను డ్రింక్ చేస్తున్నాడు. షాలినికి చాలా ఇబ్బందిగా వుంది. ఒకటిరెండు గంటలైతే ఫర్వాలేదు. పద్దెనిమిది గంటల ప్రయాణం. చేసేదిలేదు. సిగరెట్ అయితే కాల్చొద్దు అనచ్చు. డ్రింక్ చేయడం అంటే వాళ్ళిష్టం. వద్దనడం సభ్యత కాదు. దానివలన ఇబ్బందీ లేదు. ఎటొచ్చీ లేచి బాత్‌రూమ్‌కి వెళ్ళాల్సినప్పుడు ఇబ్బందిగా వుంటోంది ఆమెకు.

సమీర్ తన పక్కనున్న వ్యక్తిని రిక్వెస్ట్ చేశాడు. అతను షాలిని సీట్‌కి మారితే షాలిని సమీర్ పక్కకి రావచ్చని. ఎంతగా నచ్చచెప్పినా, అతడు ససేమిరా అంగీకరించలేదు. అప్పటిదాకా సమీర్, షాలినీకి భర్త అని ఆమె పక్క సీటులో అమెరికన్‌కి తెలియదు. ఈ సిట్యుయేషన్ చూసి, తన సీటు సమీర్‌కి ఆఫర్ చేశాడు. ఇండియన్ తోటి ఇండియన్‌కి హెల్ప్ చేయలేకపోయాడు. పరాయి దేశవాసి అమెరికన్‌కున్న కర్టెసీ ఇండియన్‌కి లేకపోవడం బాధాకరం. ఈ విషయాన్ని కృష్ణమూర్తికి చెప్పి,

"ఆంధ్రప్రదేశ్ ఛీఫ్ మినిస్టర్ అమెరికా వచ్చినప్పుడల్లా ప్రతి ఆచరణీయాంశాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, తన ప్రభుత్వంలో మార్పు తీసుకురావాలనుకోవడం మెచ్చుకోతగ్గ విషయం. మనదేం పోయిందనో, అసాధ్యమనో, మార్చలేమనో ఊరుకోకుండా

ప్రయత్నం చేయడమే గొప్పవిషయం. అంతేకాదు. ప్రయత్నాలు సత్ఫలితాలను ఇస్తున్నాయి. యంగ్, డైనమిక్ పర్సన్స్ అధికారంలో వుంటే కొంతవరకూ ప్రయోజనం వుంటుంది అనడానికి సి.ఎం.గారే ఉదాహరణ అని ఆయనను మెచ్చుకోకుండా వుండలేకపోయింది షాలిని.

"వెస్టర్న్ కంట్రీస్ పర్యటించినవారికి ఒక సిస్టమ్, సిన్సియారిటీ, స్ట్రిక్ట్ డిసిప్లిన్ ముగ్ధులను చేసి, కొంతవరకైనా సంస్కారాన్ని నేర్పుతుంది. విదేశీ సంస్కృతిని మెచ్చుకోవడం, స్వదేశాన్ని విమర్శించడం, భారతీయులకున్న జబ్బే అని అనుకోవద్దు. మన కన్నతల్లి కంటే మరొకరి తల్లి అందమైనదీ, చదువుకున్నదీ, మరో విషయంలో గొప్పదీ కావచ్చు అంతమాత్రాన అమ్మ ప్రేమ అమ్మదే. తల్లిని మరిచి మరొకరిని మెచ్చుకోవడంకాదుకానీ మరొకరిని చూసి నేర్చుకోగల మంచిని, ఎప్పుడూ గౌరవించాల్సిందే" అని ముగించింది షాలిని. ఆమె చెప్పినవన్నీ ఎంతో లాజికల్‌గా అనిపించాయి కృష్ణమూర్తికి.

రెండునెల్లపాటు ఇండియాలో గడిపి అమెరికా వెళ్ళాక రేణూ ఎప్పటిలా అడిగింది "మనదేశంలో ఏమైనా మార్పు వచ్చిందా?" అని.

"వస్తోంది రేణూ... ఈసారి ఆ మార్పు స్పష్టంగా కనిపించింది. అందులోనూ మన స్టేట్‌లో. అదంతా సి.ఎం.గారి కృషివల్లనే. ఈసారి ఇద్దరమూ కలిసివెడదాం... అన్నట్టు సి.ఎం.గారి పరిచయం కూడా అయింది. ఆయన మన శరణాలయాన్ని ప్రత్యేక శ్రద్ధతో దర్శించారు. గెట్ టుగెదర్ అరేంజ్‌చేసి, నాకూ ఇన్విటేషన్ పంపించారు. ఇకనుంచీ అమెరికా వచ్చినప్పుడు మనలను కలుస్తారట. మన కంపెనీ గురించి విన్నాననీ, చూడాలనుకుంటున్నాననీ చెప్పారు. పర్సనల్ ఇంటర్వ్యూ ఇచ్చారు. సి.ఎం. ఫండ్‌గా అయిదు లక్షలు ఇచ్చాను. మన శరణాలయం చక్కగా నడుస్తోంది. మూడు పూలూ ఆరుకాయలుగా మొదలై రెట్టింపు అయింది" అని చెప్పింది షాలిని.

"అంటే మెంబర్స్ పెరిగారన్నమాట. ఒక రకంగా మనం ఇలాంటి హోమ్స్ రన్ చేయడంవలన పిల్లలకూ, పేరెంట్స్‌కీ మధ్య దూరాన్ని పెంచడం లేదు కదా?" అంది రేణూ.

"ప్రతీ పనిలో మంచీచెడూ వుంటాయి రేణూ. కొందరు నిశ్చింతగా వుండగలుగుతున్నారు కదా. అది చాలు మనకి. 'అది సరే, నువ్వు చాలా వీక్‌గా కనిపిస్తున్నావేమిటి? ఆర్యూ ఓకే?" ఆందోళనగా అడిగింది షాలిని.

"నీకో బ్యాడ్ న్యూస్ మామ్. రేణూ ఆంటీకి బ్లడ్ కేన్సర్" చెప్పింది తుషార.

షాలిని అదిరిపడింది. నిలువెల్లా వణికిపోయింది. అమాంతం రేణూని దగ్గరకి లాక్కుని ఎవరో దూరంగా లాక్కుపోతున్నారా అన్నట్టు గట్టిగా హత్తుకుంది.

"రేణూ, ఏమిటే ఇది? నీ గురించి నువ్వు పట్టించుకోలేదు. ఇంతదాకా ఎలా వచ్చిందసలు? డాక్టర్ ఏమన్నారు?" వణుకుతున్న స్వరంతో, తడబాటుతో అడిగింది.

"రెగ్యులర్ చెకప్‌కి వెడుతూనే వున్నాను మరి. పోనిద్దూ... ఏదో ఒకరోజు పోయే ప్రాణమేకదా, కాకపోతే కంపెనీలో తుషార ఒంటరిదైపోతుందని బాధగా వుంది. ఎన్ని నష్టాలు వచ్చినా ఈ కంపెనీని, సమీర్‌తో పంచుకున్నాను అనే ధ్యాసలో కాపాడుకుంటూ వచ్చాను. దీన్ని వదిలిపోవాలన్నా, మీ ఇద్దరికీ దూరమవాలన్నా దిగులుగా వుంది. షాలూ" అప్రయత్నంగా రేణూ కళ్ళనుంచి కన్నీరు పొంగిపొర్లింది.

"ఏమిటిది ఇద్దరూ? నాకు ధైర్యం చెప్పాల్సినవాళ్ళు మీరే ఇలా అయిపోతుంటే ఎలా?" సగం మందలింపుగా, సగం తెచ్చిపెట్టుకున్న ధైర్యంతో అంది తుషార.



రేణూని కంటికి రెప్పలా చూడసాగింది. సమీర్ గురించి బాధపడని మనసు, రేణూ పట్ల ఆర్ద్రత నింపుకుంది. దూరమైపోతుం దనే నిజం భరించడం చాలా కష్టంగా వుంది.

ఆ రాత్రి రేణూని వదలకుండా వుండిపో యింది. ఇద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకు న్నారు.

"షాలూ నీతో ఎన్నో చెప్పాలని వుంది. వింటావుగా... నా జీవితం అంతా కేర్‌లె స్‌గా గడిపేశాను. అమ్మానాన్నా దారిలోకి తేవాలని మంచిగా చెప్పిచూశారు. వాళ్ళకి సాధ్యంకాలేదు. నీ స్నేహమే కొంతవరకూ నన్ను అదుపుచేసింది. సమీర్ సాన్నిధ్యం నాలో మార్పు తెచ్చింది. షాలూ! నీకు ద్రోహం చేశానుకదూ? నా స్వార్థంకోసం అన్యాయం చేశాను. అయితే ఒక్కటి నిజం. నమ్ము... కావాలనికాదు.

"సమీర్‌కి ఆడవాళ్ళతో పరిచయాలుం డడం నిజం. అతను తరచుగా టూర్స్ అంటూ తన పిఏని వెంటబెట్టుకుని తిరిగే వాడు. నీతో చెప్పాను. నువ్వు సమీర్‌ని అడిగావో లేదో నాకు తెలియదు. అతణ్ణి దారిలోకి తీసుకురావాలని అనుకున్నావో లేదో, అసలు నా మాటలు నమ్మావో లేదో నాకేమీ తెలియదు. మనమధ్య ఎంత స్నేహం వున్నా నీ కాపురం గురించి నేను మాట్లాడలేదు. కానీ నాకో ఆలోచన వచ్చింది. సమీర్ ఎటూ, నీ ఒక్కదానికే స్వంతంకాదు. అతడికి నీపట్ల విముఖతకు కారణం తెలియదు. అయితే అతను కోరు కున్న స్త్రీ ఎలా వుండాలనుకున్నాడో తెలుసు కున్నాను. ఇతరులపట్ల అతడి వ్యామో హాన్ని నావైపు మళ్లించుకున్నాను. అతను సులువుగానే తిరిగిపోయాడు. బైట ఆడవా ళ్ళతో స్నేహాలు వదిలిపెట్టాడు. పూర్తిగా నాకు స్వాధీనం అయిపోయాడు. ఇది నీకు నేను చేసిన ఉపకారం. ఔను కదూ" నవ్వింది రేణూ.

పశ్చాత్తాపం అన్నట్టు ఆమె కళ్ళనుండి ఏకధారగా కన్నీరు ప్రవహిస్తోంది.

"రేణూ! కన్నీళ్ళు వద్దు. ఊర్కో. రిలాక్స్ ప్లీజ్. నేనా విషయాలన్నీ ఎప్పుడో గ్రహిం చాను. అప్పట్లో నా మనసు తీవ్రంగా ఆందోళన చెందింది. విచిత్రం, మీ ఇద్దరి మీదా కోపంమాత్రం రాలేదు. నేను ఏనాడూ సమీర్‌ని వివాహేతర సంబంధాల గురించి నిలేయలేదు. తెలిసినా ఎందుకిలా చేశావని అడగలేదు. బహుశా నాకు అతని పట్ల అనురాగం లేకనేమో. హారతితో నా మానసికస్థితి గురించి చెప్పాను. ఆమె అనునయించి నాకోదారి చూపించింది" అంది షాలిని.

"షాలూ! నేనంటే నీకు అసహ్యంగా లేదూ? "

"లేదు రేణూ! నీ తప్పు ఏముంది? నువ్వు సమీర్‌ని కోరుకున్నావ్. అతడికి అర్పితమయ్యావు. అతనికి నేనివ్వలేని సుఖాన్ని, ఆనందాన్ని తోడును పంచి ఇచ్చావు. తప్పంటూ వుంటే అది నాదే అవు తుంది. అతడు కోరినట్టు మసలుకోలేకపో యాను"

"నువ్వు చాలా సహనశీలివి. తెలివైనదా నివి. అందుకే వైవాహిక జీవితాన్ని నిలబె ట్టుకున్నావ్. నువ్వు చాలా గొప్పదానివి కూడా. నీ భర్తను పంచుకున్న నేను నీతో బాటు నీ ఇంట్లోనే వున్నా, అసూయ అనేది ఎరుగవు. నా వలన నీకు దక్కని ఆనందం గురించి ఆలోచించలేదు. సమీర్‌ని కానీ నన్నుకానీ తప్పుపట్టలేదు"

"ఔను రేణూ! అది గొప్పతనమో, చేతకా నితనమో నాకు తెలియదు. మనిషి తన ఆనందంకోసం ఎన్నోదార్లు వెదుక్కుంటాడు. అవి అనేకరకాలుగా వుండచ్చు. నిజం చెప్పాలంటే చవకబారు స్త్రీలకంటే, నీతో అతడికున్న సంబంధం మంచిదేకదా! ఒకర





కంగా సమీర్‌ని ప్రమాదంనుంచి తప్పించావ్. నీ సంపాదనలో సర్వస్వం కంపెనీ అభివృద్ధికి ధారపోశావు. చివరికి తుషారకి అప్పగించావ్. నీ వలన మా ముగ్గురికీ ఉపకారమే జరిగింది కదా రేణూ. నిన్నెందుకు నిందించాలి? ఎందుకు అసహ్యించుకోవాలి? నేను మనస్ఫూర్తిగా ఈ మాటలు చెబుతున్నాను రేణూ"

"గాలిపటంలాంటి నా జీవితాన్ని సమీర్, నువ్వూ చిక్కుపడకుండా జాగ్రత్తగా నేలమీదకు తెచ్చారు. ఇందుకే నేను సృష్టించబడ్డానేమో. మన ముగ్గురిదీ విడదీయలేని బంధమైపోయింది" నీరసంగా వస్తున్నాయ్ రేణూ మాటలు.

"రెస్ట్ తీసుకో రేణూ! అలసిపోతున్నావు" ఆప్యాయంగా తల నిమిరింది షాలిని.

"ఇంకొక్కమాట చెప్పనీ షాలూ! నీ కోసమే ఎదురుచూశాను. నీకు ఎంతైనా నా మాటలు బాధ కలిగించకమానవు. నువ్వు సమీర్‌ని ప్రేమించకపోయినా, ఇద్దరూ కలిసి జీవితాన్ని పంచుకున్నారు. ఇద్దరూ సహజీవనం చేశారు. ఆ చనువూ, ఆప్యాయతా వుండకపోవు. అయినా చెప్పుకోవడానికి నువ్వే వున్నావు. నేను సమీర్‌ని మనసా, వాచా కోరుకున్నాను. ప్రేమించాను. పిచ్చిదాన్ని అయిపోయాను. అది ఒక్క శారీరక సంబంధంకోసం కాదు, ఏదో కోరుకున్నాను. దాన్ని సమీర్ ఇచ్చాడు. నీకు తెలుసా షాలూ? నువ్వు చూశావా? సమీర్ చనిపోయేటప్పుడు నా కౌగిట్లో నా సామీప్యంలోనే మరణించాడని? "

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి రేణూ! భార్యగా, ప్రియురాలిగా నాలో దొరకనివి సమీర్‌కి నీవల్లనే లభించాయి. మీరిద్దరూ నిజమైన ప్రేమికులు"

"అవును షాలూ... అది నిజం..." నిద్రలోకి జారుకుంది రేణు.

రేణూ మనసు విప్పి చెప్పింది. ఇవన్నీ రేణూపట్ల షాలినికేమీ అసూయ కలిగించలేదు. ముమ్మాటికీ రేణూపట్ల వున్న ఆత్మీయతాభావమే కారణం.



రేణూని చూడాలని హారతి వచ్చిందో రోజు. ఇంటి వాతావరణాన్ని తేలికపరచడానికి కొన్ని అనుభవాలను చెప్పసాగింది.

"అప్పుడు శ్రీరామ్ డల్లాస్‌లో జాబ్ చేసేవాడు. అమెరికన్, బ్రెజిల్ అమ్మాయి, ఇండియన్, నేనూ బాగా క్లోజ్‌గా వుండేవాళ్ళం. నేను ప్రత్యేకించి ఇండియన్స్‌తోనే ఫ్రెండ్‌షిప్ చేయాలని అనుకోలేదు.

పెళ్ళినాటికి నా చదువు ఇంటర్ మాత్రమే. ఇక్కడ చదువుకోగల అవకాశాలు చూశాక లోన్లీగా వుండలేక కమ్యూనిటీ కాలేజీలో చేరి డిగ్రీ తీసుకున్నాను.

కమ్యూనిటీ కాలేజీలంటే మన ఇండియాలోని ట్యుటోరియల్ కాలేజీల్లాంటివి. ఏ వయసువారైనా చేరి చక్కగా అందులో చదువుకోవచ్చు. ఇండియాలో నేను తెలుగు మీడియంలో చదివాను. అందువలన ఇంగ్లీష్‌రాదు. మాట్లాడడం అసలురాదు. వచ్చిన నాలుగుమాటలూ మాట్లాడాలన్నా పిరికితనంగా వుండేది. ఇక్కడ కాలేజీలో చేరాక

ఇంగ్లీష్ మాట్లాడడం బాగా వచ్చింది.

అలా కాలేజీలో చదివేటప్పుడు టామ్, మరియానా, శ్యామ్‌గంగూలీ పరిచయం అయ్యారు. మేం నలుగురం స్టూడెంట్ లైఫ్‌ని బాగా ఎంజాయ్ చేశాం.

శ్రీరామ్ గురించి చెప్పానుకదూ? అతడికి పట్టింపులు ఎక్కువ. టామ్, మరియానా, శ్యామ్‌లను ఓసారి మా ఇంటికి పిల్చాను. శ్రీరామ్ కర్టెసీకి ఓసారి హలో చెప్పి వెళ్ళిపోయాడు. వచ్చిన ముగ్గురూ శ్రీరామ్ ప్రవర్తనను అంతగా పట్టించుకోలేదుగానీ వాళ్ళని ఇంకెప్పుడూ ఇంటికి పిలవలేదు. నేనే వెళ్ళేదాన్ని. వీళ్ళతో ఫ్రెండ్‌షిప్ చేయడం విషయంలో శ్రీరామ్‌కీ, నాకూ చిన్న గొడవ జరిగింది. 'నీ గురించి వాళ్ళ స్నేహం వదులుకోలేనని చెప్పేశాను. నీకు నచ్చదు. ఇది నీ ఇల్లు కాబట్టి వాళ్ళని పిలవను. నేనుమాత్రం వాళ్ళ ఇళ్ళకు వెళ్ళితీరుతాను' అన్నాను.

దాంతో ఊరుకున్నాడనుకో. శ్యామ్, మరియానా చదువు పూర్తయ్యేసరికి నిండా ప్రేమలో మునిగిపోయారు. కానీ. పెళ్ళి చేసుకోడానికి శ్యామ్ సంకోచించేవాడు.



ఓసారి మరియానా నాతో చెప్పింది "హారతీ, శ్యామ్‌కి నేనంటే ఇష్టం. కానీ మారేజ్ చేసుకోడానికి అంగీకరించడు. నాకు మీ ఇండియన్ మేరేజ్‌పట్ల గౌరవం ఉంది. ప్రేమ వేరు, పెళ్ళివేరు అని నాకు తెలియదు. శ్యామ్ చూడు" అంటూ ఫిర్యాదుచేసింది.

నేను శ్యామ్‌తో మాట్లాడాను. 'హారతీ మన ఇండియన్ మెంటాలిటీస్ నీకు తెలుసుకదా. నేను ఈ కంట్రీకి వచ్చేటప్పుడు మా అమ్మ నా దగ్గిర మాట తీసుకుంది. తను జీవించి వుండగా అమెరికాలో ఏ అమ్మాయిని పెళ్ళిచేసుకోకూడదని.

ఇంటికి వెళ్ళినప్పుడల్లా తనో అమ్మాయిని చూసి వుంచాననీ పెళ్ళిచేసుకోమనీ గొడవ చేసేది. అటు అమ్మమాట కాదనలేకా, ఇటు మరియాను వదులుకోలేకా పెళ్ళి వాయిదా వేస్తూ వచ్చాను' అన్నాడు.

ఇదే విషయాన్ని మరియానాకి చెప్పాను. శ్యామ్ తనను ఎంతగా ప్రేమిస్తున్నాడో తెలుసుకుంది. అతడిపట్ల మరింత ప్రేమ పెంచుకుని శ్యామ్ మదర్ అనుమతి ఇచ్చేదాకా వేచి వుంటాననీ, శ్యామ్‌ని తప్ప మరెవర్నీ పెళ్ళిచేసుకోనని అలాగే వుండిపోయింది.

శ్యామ్ ఇండియా వెళ్ళడం తగ్గించాడు తల్లికి సమాధానం చెప్పలేక. ఈ విషయం అర్థం చేసుకున్న శ్యామ్ మదర్ కూడా శ్యామ్‌కి నచ్చచెప్పలేకా, తన సాంప్రదాయాన్ని వదులుకోనూ లేక బాధపడుతూ ఉండేది.

ఒకసారి ఇండియా వెళ్ళినప్పుడు నాతో పాటు కొడుకుని చూడాలని ఆవిడా వచ్చింది. ఆవిడ మరియానాను చూశాక శ్యామ్ ఇంతగా ఎందుకు మరియానాను కోరుకుంటున్నాడో అర్థమైంది. మరియానా శ్యామ్‌ని ఎంతగా ఆరాధించిందో తెల్సుకుంది. చివరికి తన పట్టుదల విడిచిపెట్టి కొడుకు సంతోషమే ప్రధానమని, మరియానాని తీసుకుని ఇండియా రమ్మని వైభవంగా తన చేతులతో పెళ్లి చేస్తానని మాట ఇచ్చింది.

మరియానా ఆనంధానికి అంతులేదు. తన తల్లితండ్రులతోపాటు ఇండియా వస్తానని చెప్పింది. శ్యామ్ వాళ్లమ్మగారు ఇండియా వెళ్లిపోయారు. దురదృష్టంకొద్దీ ఆవిడ ఇండియా చేరుకోనేలేదు. ఆవిడ ప్రయాణిస్తోన్న ఫ్లయిట్ యాక్సిడెంట్‌కి గురయి ప్రాణాలు కోల్పోయారు. శ్యామ్ ఆ షాక్‌నుంచి తేరుకోలేకపోయాడు. 'అమ్మ తాను జీవించివుండగా అమెరికా అమ్మాయిని పెళ్లి చేసుకోకూడదనే మాట ఈవిధంగా నిలబెట్టుకున్నట్టుంది హారతీ' అంటూ విలపించాడు. మేము ఎంతగానో నచ్చచెప్పి, ఓదార్చి, మామూలు మనిషిని చేశాం. పాపం మరియానా కూడా అపరాధ భావంతో కుమిలిపోయింది.

కొన్నాళ్ల తర్వాత పెళ్లి ఏర్పాట్లు చేశాం. అంతా సిద్ధం అయ్యాక మరో విఘాతం. అసలు వాళ్లిద్దరికీ పెళ్లవడం విధికే ఇష్టంలేదేమో. ఏదో ఒక ఆటంకం వస్తోంది. రొటీన్‌గా మెడికల్ చెకప్‌కెళ్లిన శ్యామ్‌కి కిడ్నీస్ ఫెయిల్యూర్ అనే విషయం బయటపడింది. పైగా అప్పటికే క్రిటికల్‌గా వుంది. కొద్దికాలానికే శ్యామ్‌కి ట్రాన్స్‌ప్లాన్టేషన్ చేయడం, అది ఫెయిల్యూర్ కావడంతో శ్యామ్ కూడా చనిపోవడం అత్యంత విషాదకరమైన సంఘటన. మరియానాని ఆపడం ఎవరితరమూ కాలేదు. 'నేనసలు శ్యామ్‌కి పరిచయం కాకుండివుంటే పరిచయం ప్రేమగా మారకపోతే ఇన్ని అనర్థాలు జరగకపోను' అంటూ కుమిలిపోయింది.

మా నలుగురిమధ్యా శ్యామ్ లేకపోవడం తీరని వెల్తి. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ హుషారుగా వుండే మరియానా గంభీరంగా మారిపోయింది. టామ్ మరియానాని వెన్నంటివుండి, దిగులు పోగొట్టాలని ఎంతో ప్రయత్నించేవాడు. అతడి మూలంగానే





మరియానా మామూలు మనిషైంది. శ్రీరామ్ డల్లాస్‌నుంచి మినియాపొలిస్‌కి మూవ్ అయ్యాడు. అలా మరియానా, టామ్‌లకి దూరమైపోయాను. ఫోన్‌లో పిల్చుకోవడం తప్పితే కలుసుకోవడం కుదర్లేదు. చాలాకాలం తర్వాత టామ్, మరియానా పెళ్లిచేసుకున్నామనీ, కాలిఫోర్నియాలో వున్నామనీ, వీలుచూసుకుని క్రిస్మస్ హాలిడేస్‌కి రమ్మని చెప్పారు. వెళ్లి కలిశాను. వాళ్లిప్పుడు హ్యాపీగా వున్నారు.

అసలు విషయం ఏమిటంటే టామ్ మరియానాని ప్రేమించాడు. శ్యామ్, మరియానా ఇష్టపడుతున్నారని తెలిసిన టామ్ తన ప్రేమని వెల్లడి చేయలేదు. మనస్ఫూర్తిగా వాళ్లని గ్రీట్‌చేశాడు. శ్యామ్ మరణించాక అదే చిత్తశుద్ధితో ప్రేమమూర్తి మరియానా దిగులుపోగొట్టి, మనిషిని చేశాడు. ఎప్పటికీ తన ప్రేమని బయటపెట్టనేలేదు. ఫ్రెండ్ మరణించగానే తనని దక్కించుకోవాలని ఆశపడినట్టు మరియానా అనుకుంటుందేమోననే ఏనాడూ చెప్పలేదు.

చివరికి మరియానా అడిగిందట, 'టామ్! నువ్వు పెళ్లి చేసుకోవా?' అని. అప్పుడు తన మనసులోమాట బైటపెట్టి, 'నువ్విలా మోడుగా మిగిలిపోతే నేనెలా సంతోషంగా వుండగలను?' అన్నాడట. స్వతహాగా దయాగుణం, మంచితనం మూర్తీభవించిన మరియానా టామ్ ప్రేమని గుర్తించి 'టామ్, నన్ను కోరుకున్నవారికి శాంతీసుఖాలు వుండవు. మరెవర్నైనా చేసుకుని సుఖపడు' అందట. దానికి టామ్ 'నీకు లేని సుఖం నాకొద్దు. నువ్వొక ఏంజిల్‌వి. సామాన్యులకి దక్కవేమో' అన్నాడట. చలించిపోయిన మరియానా మరిక మాట్లాడకుండా తన అంగీకారం తెలియచేయడం అలా వాళ్లిద్దరూ పెళ్లి చేసుకోవడంతో వాళ్ల ప్రేమ సుఖాంతం అయింది. నేను మనసారా అభినందించాను. మా మనసుల్లో శ్యామ్ చిరంజీవిగా మిగిలిపోయాడు".

"నాకైతే టామ్ ప్రేమ గొప్పదనిపిస్తోంది. టామ్‌ది నిష్కళంక ప్రేమ. మరియానాలో మార్పు వచ్చేవరకూ చాలా సహనంతో ఎదురు చూసి చివరికి సాధించాడు. అతడిదే ప్రేమ విజయం" అంది తుషార.

హారతి వున్నన్ని రోజులూ రేణూ, షాలినీ దిగులు మరచిపోయారు.

★ ★ ★

రేణూని కంటికిరెప్పలా కాపాడుకుంటోంది షాలిని.

డాక్టర్ అన్నారు... 'షాలినీ, నువ్వొచ్చి రేణూ ఆయుష్షను పెంచావు. ఆమెలో ఇంప్రూవ్‌మెంట్ కనిపిస్తోంది'. అయితే అది తాత్కాలికమే అన్నప్పుడు బాధగా తోచినా మానసికంగా ప్రిపేరవడం తప్పదు అనిపించింది. రేణూని ఎప్పుడూ సంతోషంగా వుంచాలి అనుకుంటుంది. "రేణూ, నీకేం కావాలో చెప్పు. ఎటైనా వెడదామా అనడిగితే, నన్నొక్కసారి కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌కి తీసికెళ్లు" అంది.

ఇదెక్కడి కోరిక అన్పించినా తీసికెళ్లాక ఆమె మనోవాంఛ ఏమిటో తెలిసింది. తన ఆస్తిని సద్వినియోగం చేయాలనుకుందని.

మరోసారి ఎయిడ్స్ రోగుల హాస్పిటల్‌కి వెళ్లాం. అక్కడ చాలావరకూ చిన్నపిల్లలే వున్నారు. ఎవరో చేసిన తప్పిదాలకి వీరంతా బలైపోయారు. మనసు ద్రవించిపోయింది. పేరు పేరునా అడిగి తెలుసుకుని వాళ్లతో రోజంతా గడిపారు. తన యావదాస్తినీ డొనేట్ చేసిన రేణు షాలినిని ట్రస్టీగా నియమించింది.

రేణూ చేసిన పనికి చలించిపోయింది షాలిని.

"రేణూ, ఏమిటి నీ పిచ్చి?"

"ఇలా చేయడం నీకు నచ్చలేదా షాలూ?"

"కాదు రేణూ! నీ ఆదర్శం వెలకట్టలేనిది. ఎవరికీ సాధ్యంకాని పని చేశావు. నన్ను ట్రస్టీని చేశావే చూడు, దాని గురించి



అన్నాను. ఈ బాధ్యత నేను మాత్రం ఎంత కాలం నిర్వహించగలను ఒంటరిగా?" అంది.

"తుషార పేరు కూడా చేరుస్తానులే. మీకంటే ఆప్తులెవరు నాకు?"

"నామీద నీకున్న నమ్మకానికి..." గొంతు రుద్ధమైన షాలినికి మాటలు రాలేదు.

"నిన్ను నమ్మకపోవడమా? స్నేహంతో మొదలై జీవితాంతం జీవితాలు పంచుకునే వరకూ కలసి వున్న అనుబంధం మనది" ఇదే చివరిమాట.

క్రమంగా క్షీణించిపోయింది. మాట్లాడలేనంత బలహీనురాలైపోయింది. పసిపిల్లకి చేసినట్టు సపర్యలు చేస్తున్నప్పుడు కృతజ్ఞతా, ప్రేమా కలగలసి కన్నీరు నింపుకున్న రేణూ కళ్లని తుడిచి ఆప్యాయంగా తల నిమిరే తల్లిని చూసి తుషార,

"డాడీని పంచుకున్న ఆంటీని క్షమించావు. అనారోగ్యంతో మంచంపట్టిన ఆంటీని కన్నబిడ్డలా, అభిమానంగా చూస్తున్నావు. నీ మంచితనం, దయార్ద్ర హృదయం అర్థంచేసుకోలేని డాడీ నిన్ను నిర్లక్ష్యం చేశారు. నీకు చేసిన ద్రోహానికి నష్టపోయింది వాళ్లిద్దరే. డాడీకి అకాలమరణం సంభవించింది. భయంకరమైన కేన్సర్ వ్యాధి ఆంటీని కబళిస్తూ వచ్చింది. చేసిన తప్పుకు శిక్ష అనుభవించింది" అనుకున్నట్టుంది.

హఠాత్తుగా షాలినితో "మామ్, నువ్వు డాడీని, ఆంటీని ఎలా ఆదరించగలిగావు? వాళ్లిద్దరూ నీకు శత్రువులే కదా. నువ్వు మానవ మాత్రురాలివి కాదు" అంది.

"ప్లీజ్ తుషారా! నాకు ఏ దైవత్వాన్నీ ఆపాదించవద్దు. నీ ఆలోచన అర్థమైంది. ఒకప్పుడు అతి మామూలు స్త్రీలా రేణూని చూసి అసూయపడ్డాను. కానీ రేణూ ఆంటీ డాడీ ఒక్కరినే మనస్ఫూర్తిగా నమ్మింది. తప్పుదారిలో నడిచే డాడీ మనసు మళ్లించింది. ఆంటీని ఒక్కమాట అనొద్దు"

"నిజమే. చాలా కొద్దిమందికి మాత్రమే ఈ విచక్షణాజ్ఞానం కలుగుతుంది" ఆరిందాలా చెప్పింది తుషార.

★ ★ ★

రేణూ ఈ లోకాన్ని వదిలిపెట్టి వెళ్లిపోయింది. ఎంత ముందుగా తెలిసినా, మానసికంగా రేణూ వియోగానికి సిద్ధపడినా, శూన్యంగా మిగిలిన రేణూ ప్లేస్ చూస్తున్న కొద్దీ చాలాకాలం వరకూ మరచిపోలేకపోయింది షాలిని. కాలేజీ లైఫ్‌లో పరిచయం. తర్వాత కొన్నాళ్లు దూరమై అనుకోకుండా మళ్లీ జీవితంలో ప్రవేశించినప్పుడు రేణూని ద్వేషించింది. క్రమంగా తోటి స్త్రీగా అర్థం చేసుకుంది. ప్రేమించే మనిషి తనకూ ఎదురైతే జీవితం ఎలా వుండేదో అనుకుంది.

ఎదుటివారు వ్యక్తిగత సమస్యని చెప్పుకుంటే పరిష్కారం చూపించింది. అర్థం చేసుకున్నారో, మానేరో అవసరం వున్నంత వరకూ లాభం పొందారు తప్ప ఎవరూ నష్టపోలేదు. ప్రతిఫలం ఆశించి మంచి చేద్దాం అనుకోలేదు. మనసుకి నచ్చినంతవరకూ కష్టనిష్ఠూరాలని ఎదుర్కొంటూ నమ్మినదారిలో వెళ్లింది.

రేణూ చెప్పినట్టు ఆ తరం ఆలోచనలు, ఈ తరంవారికి ఆమోదయోగ్యం కాకపోవచ్చు ఒక స్త్రీ తాను కోరుకున్నవిధంగా పురుషుడు లేకుంటే, ముందుచూపుతో తన కుతానే దూరంగా వెళ్లిపోగల మనస్థైర్యాన్ని అలవర్చుకుంది.

ఒకప్పటి స్త్రీ భర్తతో బాధలుపడలేక విడిపోతే లోకాన్ని ఎదుర్కోగల ధైర్యం వుండేది కాదు. ఇప్పుడు ఆ లోకమే 'నాకెందుకులే' అనో, సానుభూతిగా అర్థం చేసుకోవడమో జరుగుతోంది తప్ప వేధించి అవమానించడం లేదు. మంచి మార్పు ఎప్పుడూ ఆమోదయోగ్యమే.

భార్యాభర్తల మధ్య సమస్యలు ఎప్పుడూ వుంటాయి. వున్నాయి కూడా. ఎవరో వచ్చి





సరిదిద్దినా అది తాత్కాలికంగా కొంతకాలమే. ఎవరికివారు పరిష్కరించుకోగలిగితే మూడో మనిషి అవసరం వుండదు.

సమీర్ తాతగారి తరం, రేణూ షాలినీల తరం, ఇప్పటితరం, ముందు ముందు రాబోయే తరాల్లో మార్పులూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. మంచికా చెడుకా అనేది కాలమే నిర్ణయించాలి.

★ ★ ★

"తుషారా నువ్వీమధ్య నీ గురించి పట్టించుకోవడంలేదు. కంపెనీలో వర్క్ హెవీగా వున్నట్టుంది. పార్ట్‌నర్‌ని ఎవరినైనా చూడరాదూ? రెండు రకాలుగా కలిసొచ్చే లైఫ్ పార్ట్‌నర్, కంపెనీ పార్ట్‌నర్ అయితే మరీ మంచిది కదూ" షాలిని తన అభిప్రాయాన్ని చెప్పింది.

"ఎస్ మామ్! రవి వర్మ అంకుల్ని అడగాలని అనుకుంటున్నాను. ఇక లైఫ్ పార్ట్‌నర్ అంత సులువా దొరకడం? చూద్దాం. నాకూ బోర్‌గా వుంటోంది"

ఆమాత్రం కూతురు మనసువిప్పి చెప్పినందుకు ఆనందపడిపోయింది షాలిని. మళ్లీ ఎక్కడ మనసు మార్చుకుంటుందో, బద్ధకిస్తుందోనని వెంటనే రవివర్మకి కాల్ చేసింది.

"వర్మా హియర్" అనగానే తుషారకిచ్చింది. తుషార తన బెడ్‌రూమ్‌లోకి వెళ్లి చాలాసేపు మాట్లాడింది వర్మతో. తల్లికి తెలియరాదని కాదు, రిలాక్స్‌డ్‌గా మాట్లాడవలసివస్తే అలా చేయడం తుషార అలవాటు. అచ్చం సమీర్ ఇలాగే చేసేవాడు. అందుకే షాలినికి బాగా తెలుసు కూతురి సంగతి.

తుషార రవివర్మతో మాట్లాడిన తర్వాత తన ఫ్రెండ్ జయరాం కొడుకు సునీల్‌ని వెంటనే పంపించాడు. సునీల్ ఎం.ఎస్. చేశాడు. పి.హెచ్.డి. చేయాలనే ఆలోచనలో వున్నాడు. హార్డ్‌వర్క్ చేస్తాడట. సిన్సియార్టీలో 'నీకు సమవుజ్జీ' అని ఒక్కమాటలో చెప్పాడు రవివర్మ.

సునీల్‌ని చూడగానే కొద్దిగా మొహమాటస్థుడని తోచింది తుషారకి. అనీజీగా అనిపించినా వర్మ కాండేట్ కాబట్టి ట్రైనింగ్ ఇవ్వచ్చు అనుకుంది. అతడితో...

"సునీల్! నేను వర్క్ దగ్గర చాలా స్ట్రిక్ట్‌గా వుంటాను. ఇండియన్స్‌మే కదా అని చనువు తీసుకున్నా, అనవసర విషయాల్లో జోక్యం చేసుకున్నా నాకు నచ్చదు. నా గురించి వర్మ అంకుల్ చెప్పేవుంటారు. అన్‌ఫిట్ అనుకున్న క్షణం నిన్ను పంపించేస్తాను. మైండిట్!" అని చెప్పింది.

"ఎస్ మేమ్! మిమ్మల్ని మెప్పించగలననీ, మీ నమ్మకాన్ని నిలబెట్టుకుంటాననీ మాట ఇస్తున్నాను" అన్నాడు వినయంగా సునీల్. పైకి మెత్తగా కనిపించినా, అభిమాన ధనుడని అర్థమైంది తుషారకి.

సునీల్ గురించి వర్మ తరచుగా అడిగేవారు. ఆరునెల్ల తరువాత తుషారకి ఒక భయంకరమైన నిజం తెలిసివచ్చింది. అది సునీల్ గురించి. అదెలా బయటపడిందంటే సునీల్‌కి ఓసారి బాగా ఫీవర్ వచ్చింది. మామూలు జ్వరమే అనుకుంది తుషార. ఏదో మాటల్లో వర్మతో చెప్పగానే వెంటనే బయలుదేరి వచ్చేశాడు. తనతోపాటు మందులూ, ఇంజక్షన్స్ తెచ్చారు. చాలా ఆందోళనగా వున్నారు.

ఏమిటీ ఈయన? ఈమాత్రానికే ఇంత కంగారుపడుతున్నారు? అంతగా కావలసినవాడా? అనుకుంది. రెండు రోజుల తర్వాత సునీల్ కోలుకున్నాడు. అతను లేని సమయంలో ఇలా చెప్పారు.

"తుషారా అయామ్ వెరీసారీ! సునీల్ హెల్త్ గురించి నీకు చెప్పలేదు. చెబితే నువ్వు అంగీకరించవేమోనని! సునీల్‌కి తీవ్రమైన హెడేక్ వస్తూంటుంది. డాక్టర్స్‌కి చూపిస్తే, 'కొన్నాళ్లు మెడికేషన్ ఇచ్చి చూద్దాం. తగ్గిపోతే ఫర్వాలేదు. లేకుంటే

బ్రెయిన్ సర్జరీ చేయాల్సివుంటుంది అన్నారు.

"సునీల్ ఫాదర్ జయరాం స్కూల్ టీచర్. వచ్చే సంవత్సరం అతను రిటైర్ అవుతాడు. చాలా లేట్‌గా సునీల్ ఒక్కడే జన్మించాడు వారికి. ఎడ్యుకేషన్ అంతా పిలానీలో మెరిట్‌లో పూర్తయింది. అమెరికా రావడానికి నేను హెల్ప్ చేశాను. మా ఇంట్లోనే వుండేవాడు. ఎం.ఎస్. పూర్తయ్యేసరికి అతడి డిసీజ్ బైటపడింది. ఈ విషయం జయరాంకి తెలియదు. చెబితే వాళ్ళు తట్టుకోలేరు. నిస్సహాయస్థితిలో వున్న అతణ్ణి నీ దగ్గరకి పంపించాను. అతడి మెడికేషన్‌కి, రెగ్యులర్ చెకప్‌కి ఈ దేశంలో అయ్యే ఖర్చు నీకు తెలియనిది కాదు. ఇంతదాకా నేను సహాయం చేయగలిగాను. ఇకముందు అతడి పరిస్థితిని బట్టి ట్రీట్‌మెంట్ జీవితకాలం అవసరం కావచ్చు ఈ ట్రీట్‌మెంట్ ఇండియా వెళ్ళి చేయించుకోవాలన్నా కష్టమే!

అసలీ కబురు తెలిస్తేనే వాళ్ళు తట్టుకోలేరు. చూస్తూ చూస్తూ సునీల్‌ని విడిచిపెట్టలేం. అందుకే దాచిపెట్టాను. సునీల్ ఇక్కడే వుండటం అన్నివిధాలా మంచిది. కేస్ క్రిటికల్ అయినా ఫిఫ్టీ పర్సెంట్ క్యూర్ అవచ్చునని డాక్టర్స్ చెప్పినందున నేనీ నిర్ణయం తీసుకున్నా తుషారా..." అంటూ వర్మ చెప్పినప్పుడు తుషార స్థాణువులా వింటూ వుండిపోయింది.

నేను ఊహించిన దానికంటే సునీల్ చెప్పిన దానికంటే, కంపెనీలో కష్టపడుతున్నాడు. తెలివైనవాడు. అతడిపైన కాన్ఫిడెన్స్ పెరుగుతూ వచ్చింది. ఇటువంటి సమయంలో ఊహించని సునీల్ అనారోగ్య పరిస్థితి తుషారను అయోమయంలో పడేసింది.

"అంకుల్ సునీల్ ఇంతగా వర్క్ చేస్తుంటే అలసట కాదా. పరిస్థితి విషమించదా? చాలావర్క్ చెయ్యాల్సి వుంటుందే! మరెలా అంకుల్"

"డాక్టర్ చెప్పిందేమంటే ప్రస్తుతానికి ఫర్వాలేదు. మెంటల్ టార్చర్ అతని బ్రెయిన్‌మీద ఏ రకంగా పనిచేస్తుందో చిన్న ఎక్స్‌పెరిమెంట్ అని సలహా ఇవ్వడంవలన, డాక్టర్ పర్మిషన్‌తోనే నీ దగ్గరికి పంపాను. అతడిలో మార్పు మనకు తెలియదు. డాక్టర్ చెప్పాలి. వచ్చే వీకెండ్స్‌లో తీసుకువెడతాను. నువ్వు మంచి పార్టనర్ కావాలంటే, ఈ అనారోగ్యం మనిషిని పంపించాను. అయామ్ వెరీవెరీ సారీ తుషారా" మళ్ళీ చెప్పారు.

"నో... నో అంకుల్. అదేమంత ఇబ్బంది కాదు. కానీ సునీల్‌కి ఇటువంటి ప్రాబ్లమ్ వుండటం నా మనసును కలచివేస్తోంది. నేను కూడా మీతోబాటే అతడికి సాయపడతాను" అంది తుషార.

సునీల్‌ని చూసినప్పుడు ఇతడు కంపెనీకి పార్టనర్‌గానూ పనికిరాడు. తుషార లైఫ్‌పార్టనర్‌గానూ పనికిరాడు. చాలా చిన్నవాడు. ఇదేమిటి వర్మ ఇటువంటివాణ్ణి పంపించాడు? అనుకున్న షాలిని "వర్మా! తుషార మీతో ఏం చెప్పిందో కానీ, నా అంచనాలు తారుమారు అయ్యాయి. నేననుకున్న ఆశ నెరవేరలేదు" అంది వర్మతో.

"షాలినీ! నాకు తెలిసిన మంచి తెలివైన అబ్బాయిని, కేవలం కంపెనీని దృష్టిలో వుంచుకునే పంపించాను. ఇక తుషారకి సరిపడ అబ్బాయిని పంపడమనేది చాలా కష్టం" అన్నాడు.

"భలేవాడివి వర్మా! ఇదా నువ్వు చేసే ఉపకారం? " అంటూ నిరాశపడింది.

"షాలినీ! అంత త్వరగా సునీల్ పనికిరాడని అంచనా వేయకు. కొంతకాలం వేచి చూడాలి మరి!" అన్నాడు వర్మ.

"సునీల్ చూస్తే కొంచెం యంగ్‌ఫెలో. మనం అనుకునే విధంగా పార్టనర్ ఎలా అవుతాడు? "

వర్మ ఇక మాట్లాడలేదు. టాపిక్

మార్చాడు.

'నేను అనుకున్నది ఒకటి, జరిగింది మరొకటి. పైగా సునీల్‌కి హెల్త్ ప్రాబ్లమ్ ఒకటి. తుషారకి, నాకూ ఎడిషనల్ బర్డెన్‌గా తయారైంది. తుషారకి మొదట్నించి ఆశ్రయం ఇవ్వడం, ఆదుకోవడంలాంటి అలవాట్లు లేవు' అనుకుంది షాలిని.

అయితే తుషార సునీల్‌ని చూసిన తర్వాత అతడి బాధ్యత నెత్తిన వేసుకుందనీ, ఈ విషయంలో వర్మకి భరోసా ఇచ్చిందనీ షాలినికి తెలియదు. అనాధలూ, ఆశ్రయమివ్వడం తన ధ్యేయమే కనుక మౌనంగా సునీల్ బాధ్యతను కూడా పంచుకుంది షాలిని.

"సునీల్‌ని మనింట్లో వుండమని చెప్పాలనుకుంటున్నాను. ఏమంటావ్ మామ్?" అడిగింది తుషార.

"దానికేంలే తుషార! అలాగే వుండమనచ్చు. కానీ అతడి పరిస్థితి దృష్ట్యా కంపెనీలో మరొకర్ని అపాయింట్ చేయడం మంచిదేమో?" తుషార బదులు చెప్పలేదు. విననట్టుండిపోయింది.

★ ★ ★

ఓసారి ఇండియాకెళ్ళిన షాలిని సునీల్ పేరెంట్స్‌ని చూసివద్దామనే ఆలోచనతో అప్పటికప్పుడు వర్మకి ఇ-మెయిల్ పంపి, అడ్రస్ తెల్సుకుంది

జయరాం వుండేది చాలా చిన్న గ్రామం. ఇప్పుడు ప్రతి గ్రామానికి ప్రయాణ సదుపాయాలు బాగానే వున్నాయి కానీ, మనుషులే ఇంకా పూర్తిగా మార్పును అంగీకరించడం లేదు. జయరాం, భార్యా షాలిని సునీల్ కంపెనీ ఓనర్ అని తెలియగానే తమను వెదుక్కుంటూ చూడాలని వచ్చిన ఆమెకు ఎంతో మర్యాద చేశారు. సునీల్ తెలివైనవాడనీ, వృద్ధిలోకి వస్తాడనీ, త్వరలోనే తన దగ్గరకి మిమ్మల్ని పిలిపించుకుంటాడనీ చెప్పి, వారి యోగక్షేమాలు విచారించి, ఏమైనా ఉద్యోగపరమైన ఇబ్బందులుంటే చెప్పమనీ, పరిష్కరిస్తాననీ అడిగింది.

తమకు ఎటువంటి సమస్యలూ లేవనీ, రిటైర్‌మెంట్ దగ్గర్లో వున్నందున సునీల్‌కి పెళ్ళి చేసేయాలనుకుంటున్నామనీ, మాకంటూ ఒక ఇల్లు అమర్చుకోవాలని వుందనీ, ముఖ్యమంత్రిగారికి స్థలం మంజూరు చేయమని అప్లికేషన్ పెట్టుకున్నామనీ చెప్పారు.

"అదేం మీరు సునీల్ దగ్గరకి వెళ్ళరా? ఒక్కడే కొడుకు కదా! అతడికి దూరంగా వుంటారా?"

"చాలామంది చెబుతారు. మాబోటి గాళ్ళం ఆ దేశంలో వుండలేమమ్మా! ఏదో పుట్టిపెరిగిన వూరు. బతుకుతెరువు కల్పించిన ఊరు. ఇక్కడే మట్టిలో కల్సిపోవాలని మా చివరి కోరిక" అన్నాడు జయరాం.

"మీరు, వర్మ ఫ్రెండ్స్ ఎలా అయ్యారు?"

"వర్మదీ ఈ ఊరే! స్కూల్లో కలిసి చదువుకున్నాం. వాడు మనిషి ఆజానుబాహువు. ధైర్య సాహసాలు కలవాడు. సరదాగా ఎవరో అన్నార్ట, నువ్వు ఆర్మీకి పనికి వస్తావని! అంతే ఇంట్లో వాళ్ళతో చెప్పకుండా వెళ్ళిపోయాడు. వెళ్ళాక ఉత్తరం రాశాడు. చేసేదిలేక వూరుకున్నారు ఇంట్లో వాళ్ళు. పోనీయమ్మా! ఏదైతేనేం. ఇప్పుడు అమెరికాలో సుఖంగా వున్నాడు. మా సునీల్‌కి ఇంత దారి చూపించాడు. మీ అందరి మేలూ మరచిపోలేం తల్లీ!" జయరాం కృతజ్ఞతగా అన్నాడు. సునీల్‌కి ఏవేవో ఇచ్చారు ప్రేమతో.

"వెళ్ళేముందు చెప్పు తల్లీ" అంది ఆప్యాయంగా సునీల్ తల్లి!

"అలాగేనండీ! మిమ్మల్ని చూశానని సునీల్‌తో, వర్మతో చెబుతాను" అంటూ సెలవు తీసుకుంది.

వెంటనే షాలిని బయలుదేరింది.

★ ★ ★

తుషార తన తల్లి ఇప్పట్లో అమెరికాకు వస్తుందని అనుకోలేదు. ఒక్కసారి మామ్



కౌగిట్లో వాలిపోయింది.

"సారీ మామ్. ఏమిటో చెప్పలేని బెంగ కలిగింది. పిచ్చిగా నీకు వెంటనే రమ్మని ఫోన్ చేశాను" తల వంచుకుని అపరాధభావంతో చెప్పింది.

"లేదు తుషారా! నేనూ నిన్ను చూడకుండా వుండలేకపోయాను" అంది షాలిని.

"సునీల్ ఎలా ఉన్నాడు? డాక్టర్స్ ఏమన్నార్థ? " టాపిక్ మార్చాలని సునీల్ ప్రసక్తి తీసుకువచ్చింది.

"సునీల్‌ని వర్మ అంకుల్ తీసుకెళ్ళినప్పుడు కూడా నేనూ వెళ్ళాను. డాక్టర్‌ని పరిచయం చేసుకున్నాను. ఏమాత్రమూ సునీల్ పరిస్థితిలో మార్పు లేదట. అందువలవ సర్జరీ తప్పదన్నారు. సర్జరీకి ముందు అతణ్ణి ప్రిపేర్ చేయడానికి నెలరోజుల పాటు కొన్ని మెడిసిన్స్ వాడాలట. మామ్! కంపెనీకి వర్క్ కుంటుపడుతోంది. ప్రస్తుతం పరిస్థితి ఏమాత్రమూ ఆశాజనకంగా లేదు. అందుకే సేల్‌కి పెడదామని అనుకుంటున్నాను. వర్మ అంకుల్‌ని సలహా అడుగుతాను" అంది తుషార.



షాలినికి ఒక్కసారి బాధగా అనిపించింది. సమీర్ ఈ దేశం రావడానికి కారణం అయిన ఈ కంపెనీని, స్వంతం చేసుకోగల స్థాయికి ఎదిగారు. రేణూ, సమీర్ కలిసి కంపెనీ కొన్నారు. ఇద్దరూ కష్టపడి అహోరాత్రులు కఠోరదీక్షతో ఉన్నత స్థితికి తెచ్చారు. అనుకోకుండా శ్రమ తట్టుకోలేని సమీర్ ఈ లోకానికి దూరం అయ్యాడు. సమీర్ మరణం మానసికంగా రేణూని దిగజార్చింది. అనారోగ్యం ముంచు కొచ్చింది. తుషార చేతికి అప్పగించింది. కొద్దికాలం బాగానే వున్నా తనూ, సునీల్, తుషార చేతనైనంత కృషి చేసినా, సమీర్, రేణూల సాటి రాలేదు. సునీల్ విషాదచరిత్ర తెలిసిన తుషార కూడా కంపెనీమీద మనసు పెట్టలేకపోయింది. ఇప్పుడు సేల్‌కి పెట్టాలని ఆలోచిస్తోంది. అంటే కంపెనీతో రుణం తీరిపోయిందన్నమాటే' అనుకుంది షాలిని.

వర్మకి ఈ బిజినెస్ రంగంలో అనుభవం లేదు.

ఏం చెప్పాలో తోచలేదు. "నీకు సలహా చెప్పగల స్థాయి నాకు లేదు తుషారా.. నీకేది మంచిదిగా అనిపిస్తే అలా చెయ్! కానీ సునీల్ గురించి ఈ నిర్ణయం తీసుకోవడంలేదుకదా? అతడి సర్జరీ ఖర్చు ట్రీట్‌మెంట్, మెడికల్ ఎక్స్‌పెన్సెస్ వగైరాలకు మనీ చాలానే అవుతుందని ఈ నిర్ణయం తీసుకున్నావా? " అని అడిగాడు.

తుషార మాట్లాడలేదు. కొద్దిసేపు మౌనం తర్వాత చెప్పింది. "మనీ ప్రాబ్లమ్ కాదు అంకుల్. నేనెందుకో వర్క్‌మీద శ్రద్ధ చూపించలేకపోతున్నాను. ఈమధ్య మంచి ఆఫర్ వచ్చింది. సునీల్‌కి న్యాయం చేయాలంటే నేనీ నిర్ణయం తీసుకోవాలి, తప్పదు"

"ఓకే తుషారా! వయసులో చిన్నదానివైనా, అనుభవంలో ఆరితేరినదానివి. నీ నిర్ణయమే మంచిది" అన్నాడు వర్మ.




తుషార సునీల్‌పట్ల చూపించే శ్రద్ధను గమనించింది షాలిని. అయితే అతడికోసం కంపెనీయే వదులుకోవడం ఎంతవరకూ మంచిపని? అతడి ట్రీట్‌మెంట్‌కి ఇంతగా ఖర్చు చేయాలా? తన ఆలోచన హారతికి చెప్పింది.

"షాలినీ, నాకు అర్థమైంది ఏమిటంటే సునీల్ అంటే తుషారకు చాలా ఇష్టం. మొదట జాలితో ప్రారంభమైంది. తర్వాత శ్రద్ధగా మారింది. చివరికి ఏ నిర్ణయం తీసుకుంటుందో! కొంతవరకూ నీ అంశ తనలోనూ వున్నట్టుంది. అదే... సేవాగుణం, పరోపకారం వగైరాలు" అంది హారతి.

★ ★ ★

కంపెనీ సేల్ అవడానికి రెండునెల్లు పట్టింది. మొత్తంమీద మంచి లాభమే వచ్చింది. న్యూయార్క్‌కి గుడ్‌బై చెప్పేసి తను లాస్‌ఏంజిల్స్ వెళ్ళే ప్రయత్నాలు చేసుకుంటోంది. షాలినికి సంకటస్థితి తన గురించి ఏం చెప్పాలా అని! తనకి ఇండియా వెళ్ళిపోయి సమాజసేవ చెయ్యాలని వుంది.

"తుషారా ఇల్లు ఏం చేద్దాం? ఇదీ సేల్‌కి పెడదామా? నువ్వు లాస్‌ఏంజెలిస్‌లో వుండి నేను ఇండియా వెడితే ఇక్కడ ఇల్లు ఎందుకు? " ఇన్‌డైరెక్ట్‌గా తన అభిప్రాయం చెప్పింది.

"నీ ఇష్టం మామ్. ఈ ఇల్లు నీది" అంది తుషార.

"ఇప్పుడు సేల్‌కి పెట్టినా అంత త్వరగా సేల్ అవదు. పెద్ద ఇల్లు. అలా అని ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోతే పాడైపోదూ? " అంది. మళ్ళీ హారతినే ఆశ్రయించింది.

"దానికంత ఆలోచన ఎందుకు షాలినీ! ప్రస్తుతానికి రెంట్‌కిచ్చెయ్. ఆ రెంట్ తుషార పేరున బ్యాంక్‌లో వెయ్"

"బ్యాంక్ ఎకౌంట్స్ అన్నీ మా ఇద్దరి పేరునా, జాయింట్ అకౌంట్స్"

"అయితే మరీ మంచిది. నువ్వు

ఇండియా వెళ్ళినా కొంత మనీ తీసుకువెళ్ళా లికదా? అసలు ఒకపని కూడా చెయ్ షాలినీ. తుషారకి ఇవ్వదల్చుకున్నవి విల్ రాసి, రిజిస్టర్ చేయించెయ్"

ఈ విషయాలన్నీ తుషారతో చెబితే, 'నీ ఇష్టం' అంటుందే తప్ప ఒక్కదాన్నీ వ్యతిరే కించలేదు. 'అలాకాదు, ఇలా చెయ్' అనీ అన్లేదు. తుషార లాస్‌ఏంజిల్స్ వెళ్ళాక తను ఇండియా వెళ్ళాలనే ఆలోచనలో వుంది షాలిని.

ఏమిటో ఒకప్పుడు ఇండియా వదిలి రాలేక సతమతమైపోయింది. ఇప్పుడు ఈ అమెరికా వదిలి వెళ్ళడానికి సవాలక్ష ఆటం కాలు. ఎటూ అమెరికన్ సిటిజన్ అయింది కనుక ఎప్పుడైనా వస్తూండచ్చు. తుషార మాత్రం తనను చూడటానికి ఇండియా రాదని నిర్ధారణగా తెలుసు.

ఓసారి వర్మనుంచి ఫోనొచ్చింది. "తుషారా నువ్వు అర్జెంట్‌గా వచ్చేయాలి. సునీల్‌ని హాస్పిటల్లో చేర్చాల్సి వచ్చిం దంటూ"

తుషార ఇక ఆలోచించలేదు. బయలుదే రింది. వెళ్ళేముందు "మామ్ నేను ఎల్ ఎలో ఇల్లు కొన్నాక ఈ సామాను తీసుకెడ తాను, అందాకా వుండనీ. హారతీ ఆంటీకి ఇల్లు అప్పగిస్తాను. నువ్వు అమెరికా వచ్చిన పుడు లాస్‌ఏంజిలిస్ వచ్చెయ్... బై మామ్" అంటుంటే తుషారకి పట్టరాని దుఃఖం వచ్చేసింది.

షాలిని కూతుర్ని దగ్గరకి తీసుకుని, కన్నీళ్ళు తుడిచి, "తప్పు తుషారా! అలా కన్నీళ్ళు పెట్టకూడదు. ఒక పెద్ద కంపెనీ యజమానివి. ధీర, వీర వనితవి! ఇంత బేలవైపోతే ఎలా అమ్మా? ప్రతీ సంవ త్సరం నిన్ను చూడటానికి వస్తాను. సునీ ల్‌ని కనిపెట్టుకుని వుండు. నా అవసరం ఎప్పుడు వచ్చినా ఫోన్ చెయ్. వచ్చి వాల్తాను. టేక్ కేర్... బై మైడియర్..." అంటూ వీడ్కోలు చెప్పింది.

తుషార సామానంతా ఒక రూమ్‌లో సర్దించి, అక్కర్లేనివి గేరాజ్ సేల్ పెట్టి హారతి ఇచ్చిన సలహా అనుసరించి, లావా దేవీలన్నీ క్లియర్ చేసి, మరో నెలరోజులకి ఇండియా వెళ్ళిపోయింది షాలిని. తనవల్ల ఎవరెవరికి సహాయం అందివ్వగలదో ఆలో చించుకుని ఆ రకంగా ఆ రంగాల్లో అభి వృద్ధి పనులు చేపట్టింది. ఆ పనుల్లోనే తృప్తిని పొందుతోంది షాలిని.




సునీల్ సర్జరీకి ఏర్పాట్లు చేశారు తుషార, వర్మ.

సునీల్‌కి ముందున్న ధైర్యం సడలింది. దిగులుగా కనిపిస్తున్నాడు. వర్మ తన సర్వీ సులో తమాషా సంఘటనలూ, భయానక దృశ్యాలు యాక్షన్‌తో సహా చెబుతూ సునీ ల్‌కి చెప్పసాగాడు.

తుషార డాక్టర్స్‌తో చర్చిస్తూనే వుంది. సర్జరీ తర్వాత సునీల్ మామూలు మనిషి కాగలడా?

"నూటికీ ఎనభై కేసులు ఫెయిల్యూర్ అవడం మామూలే! మిగిలిన ట్వంటీలో సునీల్ వుంటాడనే మా నమ్మకం. అంతే

కాక అతడి మానసిక స్థైర్యంమీద కూడా సక్సెస్ ఆధారపడివుంది. సర్జరీ తర్వాత మరింత శ్రద్ధ అవసరం. మరి ఎవరుంటారో నాకు తెలియదు" అన్నారు డాక్టర్.

రేపే సునీల్‌కి సర్జరీ! హారతీ, వర్మా ముందు రోజునుంచీ తోడుగా వున్నారు. హారతి నిద్రకి ఆగలేదు. బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది. వర్మ ఏదో జర్నల్ చదువుతున్నాడు. తుషార సునీల్ పిలిస్తే వెళ్ళింది.

"మేమ్ ఓసారి అమ్మానాన్నలకి కాల్ చేయండి. మాట్లాడాలి" అన్నాడు. నంబర్ డయల్‌చేసి ఫోన్ చేతికిచ్చి బైటకు వచ్చింది.

"అంకుల్ నేను సునీల్‌కి లోటు చేయకుండా వుండాలనే అనుకుంటున్నాను. మీరు చెప్పండి. ఇంకా ఏమైనా చేయాలా? "

వర్మ కొద్దిసేపు తుషారను పరిశీలించాడు. తర్వాత ఇలా అన్నారు, "తుషారా సునీల్‌ని నీవద్దకు పంపడంలో ఒక ఆలోచన వుంది. నీ బాల్యం, మనస్తత్వం షాలిని నాతో చెప్పింది. నువ్వు పుట్టినతర్వాత కొంతకాలానికి సమీర్‌లో వచ్చిన మార్పు, అదే సమయంలో మామ్ గురించి ఆలోచించని నువ్వు వేరే వెళ్ళిపోవడం, ఆ ఒంటరితనం, నిస్సహాయతా, షాలినిలో తీవ్రమైన ఘర్షణ జరిగింది. మీ ఇద్దరిపట్లా నిరాశను పెంచుకుంది.

తర్వాత నువ్వు అమెరికా వచ్చావు. మీ తల్లీకూతుళ్ళకు చాలా వ్యత్యాసం వుంది. నువ్వు విద్యాధికురాలిని. ఒక కంపెనీకి యజమానురాలివి. దేశవిదేశాలెన్నో చుట్టివచ్చిన అనుభవజ్ఞురాలివి. ఆ అనుభవం, రేణూ సహకారం నీ కంపెనీకి బలమైన పునాదిగా నిలిచింది. ఇది నీలో ఒక భాగం. సహజంగా స్త్రీకి వుండాల్సిన దయా, సహనం, ప్రేమా, స్పందనా బయటపడే అవకాశం నీకింతవరకూ రాలేదో, వచ్చినా నువ్వు పట్టించుకోలేదో తెలియదు.

వయసుతోపాటు నీలో, నీ ఆలోచనల్లో పెద్దరికం వచ్చింది. అంతేకాదు, నీ ఒంటరి లైఫ్‌కి ఒక తోడుకావాలి అని కూడా అనుకున్నావు. సునీల్ పరిస్థితి అందుకు దోహదం చేసింది. షాలిని కూడా నీకొక తోడు దొరికితే బావుండునన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చేది మాతో. కనుక నీకొక అవకాశం ఇస్తూ, సునీల్ అదృష్టం పరీక్షించడానికి నీ దగ్గరకి పంపించాను. అటు షాలిని నిశ్చింతగా ఇండియా వెళ్ళింది. ఇటు నువ్వు సునీల్‌కోసం చాలా మారావ్.

"ఇందులో నా స్వార్థం ఏమీలేదు తుషారా. ఆత్మీయుడిగా నీ బాగు కోరేవాణ్ణి. అవసరాన్ని అవకాశంగా మార్చానంతే! స్త్రీ పురుషుడి అవసరం లేకుండా గడపగలదేమో నాకు తెలీదు. కానీ పురుషుడికి స్త్రీ అవసరం చాలా వుంటుంది తుషారా! ఇది నా అనుభవం. అందుకే లేట్ అయితేనేం హారతిని నా లైఫ్ పార్టనర్‌గా తెచ్చుకున్నాను. చాలా హాపీగా వున్నాను.

సునీల్‌కి నేను మనీ ఖర్చు చేయగలను. కానీ డబ్బుతోరాని ఆప్యాయత, అనురాగం, అంకితభావం నేనెక్కడ తేగలను? అతడికి ఇప్పుడు తల్లిగానీ, తల్లికి సమానమైన ఒక స్త్రీగాని తోడు అవసరం. నువ్వు కూడా సహజమైన స్పందనకు లోనయ్యావ్. అతడికి సరైన ఆప్యాయత పంచావో, ఇంకా ఏమైనా లోటువుందో నువ్వే ఆలోచించు తుషారా!"

"అంకుల్ మీరు, హారతీ ఆంటీయే నాకు ఆప్తులు. నిర్మొహమాటంగా నన్ను శాసించండి. ఇప్పుడు మీరు చెప్పినదంతా నిజం అంకుల్"

గ్లాస్ నేలమీద జారిపడిన శబ్దం వినవచ్చి మెరుపులా లేచివెళ్ళింది తుషార. సునీల్ చేతినుంచి జారిపడిన గ్లాస్ శబ్దం అది. సునీల్ బాధతో రెండుచేతులా తల నొక్కుకుంటున్నాడు. "అంకుల్..." అంటూ కేక పెట్టింది తుషార. వర్మ వెంటనే డాక్టర్‌కి

ఫోన్ చేశాడు. డాక్టర్ సూచించిన ఇంజక్షన్ చేశాక, సునీల్ మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.

"తుషారా ఉదయానికి అంతా సర్దుకుంటుందని డాక్టర్ చెప్పారు. నేను మేల్కొని వుంటాను. నువ్వు నిద్రపో. నీకు మెలకువ వచ్చాక నేను నిద్రపోతాను" అన్నాడు వర్మ.

ఊహూ... నిద్ర పట్టనేలేదు తుషారకి. "మీరే పడుకోండి అంకుల్. నేను మేలుకొని వుంటాను" అంది.

నిశ్చింతగా నిద్రపోతున్న సునీల్ వదనంలో ఏదో పసితనం గోచరించింది తుషారకి. మెల్లగా పక్కన ఒరిగి అతడి తలను గుండెలో పొదువుకుంది. ఏదో పులకింత. ఎప్పుడూ అనుభవంకానిది... ఇదేమిటీ ఇంత హాయిగా, శాంతిగా వుంది. ఇంతకు ముందు తెలియనిది. డాడ్ దగ్గిరా, మామ్ దగ్గిరా లభించనిది... అనిర్వచనీయమైన ఆనందంతో అలాగే తెల్లవార్లూ వుండిపోయింది.

ఉదయం ఎనిమిది గంటలకు హాస్పిటల్‌కు వెళ్ళాలని ఆరుగంటలకు వచ్చి పిలిచాడు వర్మ. అప్పుడుగానీ మెలకువ రానేలేదు తుషారకి.

తీరా లేవబోతే సునీల్ రెండు చేతులూ తనను చుట్టేసి వున్నాయి. వర్మని చూసి ఆ పరిస్థితిలో వున్నందుకు సిగ్గుపడి సునీల్ చేతులు తొలగించి బాత్‌రూమ్‌లోకి పరుగెట్టింది తుషార.

రాత్రి సునీల్ స్పర్శా, మధురానుభవం తుషారను నిలవనీయలేదు. ఈ మధురానుభవం పదేపదే కావాలని అనిపించిందామెకు. స్త్రీపురుషులమధ్య గల ఈ అనుభవానికి లైసెన్స్ పెళ్ళి అని, పెళ్ళితో కొన్ని హక్కులు స్వంతమవుతాయని మొట్టమొదటిసారిగా తెలిసివచ్చింది తుషారకి.

అరగంటలో హాస్పిటల్‌కి చేరుకున్నారు. సునీల్‌ని సర్జరీకి థియేటర్‌లోకి తీసుకెళ్ళారు. ఆందోళనా, ఆలోచనలూ కొత్తగా సునీల్‌పై పెంచుకున్న ఆత్మీయతాభావం ఉక్కిరిబిక్కిరి చేశాయి తుషారను.

వర్మ తుషార దైన్యస్థితిని ఓ కంట కనిపెడుతూనే వున్నాడు. హారతికి రాత్రి జరిగినదంతా వివరించాడు. హారతి కూడా తుషారను చూసి 'ఎంతవారలైనా పురుషదాసులే మరి' అనుకుంది గుంభనంగా నవ్వుకుంటూ.

సర్జరీకి ముందు ఏర్పాట్లు చేస్తున్నారు డాక్టర్స్. బయట కూర్చున్నవాళ్ళు టెన్షన్ పడుతుంటారు. డాక్టర్స్‌కివి మామూలే! అవలీలగా అలవాటైన చేతులు తమ పనిని చేసుకుపోతాయి. సునీల్‌కి మొదట ఆందోళనగా అనిపించింది కానీ ఇప్పుడు ప్రశాంతంగా వున్నాడు.

ఈరోజు సర్జరీ అని షాలినికి ఫోన్‌లో చెప్పారు.



"అంకుల్... మరి నేను..." ఏదో చెప్పబోతూ ఆగింది తుషార.

"ఏమిటి తుషారా చెప్పు. సందేహం దేనికి? " వర్మ అడిగాడు.

"సునీల్‌తో అనుబంధాన్ని శాశ్వతం చేసుకోవాలనుకుంటున్నానంకుల్"

# ఏరినముత్యాలు

✲ అసలైన నాస్తికుడెవరో తెలుసా? ఆత్మవిశ్వాసం లేనివాడే.

– స్వామి వివేకానంద

✲ అమిత పరాక్రమశాలికి వినయశీలత ఒక ప్రత్యేక అలంకారం.

– మహాకవి కాళిదాసు

✲ మీరే అంతా మాట్లాడుతున్నంతవరకూ మీరేమీ నేర్చుకోరు.

– విన్‌స్టన్ చర్చిల్

✲ తాను ఇచ్చిన దాన్ని మరచిపోయి, పొందినదాన్ని మాత్రమే గుర్తుంచుకో గలవాడే స్నేహితుడు.

– ఆచార్య టి.పి. బోస్

✲ గొప్ప అందం అన్నది నిరాడంబరతలోనే దాగి వుంటుంది.

– మదర్ థెరిసా

✲ అప్పుడప్పుడు లొంగిపోవడమన్నది జయాన్ని పొందే ఉత్తమ మార్గం అవుతుంది.

– టాగోర్

✲ భగవత్కృపపై అచంచలమైన విశ్వాసాన్ని కలిగివుండటమే అతి ఉత్తమమైన రక్షణ.

మదర్ థెరిసా

✲ మనిషిని ఇతర ప్రాణులనుండి వేరు చేసే వాటిల్లో నవ్వు ఒకటి.

– జోసెఫ్ అడిసన్

✲ ప్రతిఫలాన్ని ఆశించకుండా సహాయం చేయడమన్నది దానంతో సమానం.

– స్వీడన్ బోర్గ్

✲ ప్రారంభంలో సుఖాన్ని, మధ్యలో భయాన్ని, చివర్లో పశ్చాత్తాపాన్ని కల్గించేది సంపద మాత్రమే.

– జాన్ హేమంత్ కుమార్

✲ మనసు ముడుచుకుపోయేదెప్పుడో తెలుసా?! చొరవ, ఉత్సాహం వదిలేసినప్పుడే.

– వాటర్‌సన్

✲ మనిషి ప్రవర్తన, చేతలు అతని జీవితానికి ఇండెక్స్‌లాంటివి.

– థామస్ ఫుల్లర్

✲ బాధ అంత తీవ్రం కాదు మరణం.

–ఆండేమార్‌రాన్స్

✲ గర్వం అణగినప్పుడు ఆత్మ మేల్కొంటుంది.

– విక్టర్‌హ్యూగో

సేకరణ: శివప్రసాద్ పండా

"ఇది చెప్పడానికి సందేహిస్తున్నావా? నాకీవిషయం ఏనాడో తెలిసింది. నిన్న రాత్రి నిన్నావస్థలో చూసినప్పుడే నిర్ధారణ అయింది" నవ్వుతూ అన్నాడు వర్మ.

"ఒక్క సందేహం అంకుల్. నేను సునీల్ కంటే కొంచెం పెద్దదాన్ని కదూ అతడు అంగీకరించకపోవచ్చు.."

"అటువంటి సందేహం ఏంలేదు. అయినా వ్యవధి ఇచ్చి చూద్దాం..." అలా మాట్లాడుకుంటూండగానే, గంటలు గడిచాయ్.

డాక్టర్ గుడ్ న్యూస్ చెప్పారు 'ఆపరేషన్ సక్సెస్' అని!

సునీల్ చాలా త్వరగా కోలుకున్నాడు.

మెలకువ వచ్చాక అందర్నీ చూసి చిన్నగా నవ్వాడు.

అందరికీ చెప్పలేనంత ఆనందం కలిగింది.

అలసటతో వడలిన అతడ్ని చూస్తే ఏదో అనురాగం పొంగివచ్చింది.

వంగి అతడి నుదటిపై ముద్దుపెట్టుకుంది తుషార.

డాక్టర్ మరీ మరీ చెప్పారు. సర్జరీ తర్వాతనే అసలు జాగ్రత్త అవసరం అని! తుషారకి వెంటనే ఆ విషయం గుర్తు వచ్చింది. తన ఆవేశం కంట్రోల్ చేసుకుంది.

సునీల్ చాలా ఫ్రెష్‌గా వున్నాడు. మొదట్లో పడిన ఆందోళన అతనిలో ఇప్పుడు లేదు.

అసలు సునీల్ తనను ఏవిధంగా భావించాడో? కొంపదీసి సిస్టర్‌లా భావించలేదు కదా? నో... వులిక్కిపడింది తనాలోచనకు తుషార.

షాలినికి సర్జరీ సక్సెస్ అని వెంటనే చెప్పారు.

భారం తగ్గినట్టనిపించింది. ఇప్పటికీ జయరాంతో కొడుకు అనారోగ్యం గురించి చెప్పలేదు.

షాలిని సునీల్‌కి గ్రీటింగ్స్ పంపించింది. త్వరగా కోలుకోవాలని!

★ ★ ★

తుషారా! మామ్ గురించి, ఇప్పటికైనా అర్థంచేసుకున్నావా? " హారతి అడిగింది ఓరోజు.

"ఇప్పుడిప్పుడే అర్థం అవుతూంది ఆంటీ నా సామాను తెచ్చుకోవడానికి, న్యూయార్క్ వెళ్ళినప్పుడు మామ్ డైరీలు దొరికాయ్. అవి చదివిన తర్వాత నేను మామ్‌ని ఇంత కాలమూ తెలుసుకోలేకపోయానని చాలా బాధపడ్డాను. మామ్ మనసులో ఎన్ని ఆలోచనలు వున్నాయో, అర్థంచేసుకోలేకపోయానే అనిపించింది.

క్రమంగా నాకు కొన్ని జవాబులు లభించాయి.

జీవితానికి అర్థం ఒకతోడు. మనిషి ఒంటరిగా జీవించలేడు. తోడుకోసం పరితపిస్తాడు.

స్త్రీ అయినా, పురుషుడయినా కావాలనో, తనప్రమేయం లేకుండానో, మరొకరికి ఆలంబన అవుతారు.

మామ్‌కి డాడ్ ఎటువంటి ఆలంబనా కాలేదు. అందుకే తన పరిధిలో ఒక వ్యాపకాన్ని సృష్టించుకుందని తెలిసివచ్చింది.

మామ్ నచ్చలేదని, డాడ్ మరోతోడు వెదుక్కున్నాడు.

ఇక రేణూ ఆంటీ గురించి చెప్పాలంటే ఎంతోకాలం ఒంటరిగా జీవించినా చివరికి తనకోతోడు కావాలని, స్నేహితురాలి భర్తనే కోరుకుంది.

డాడ్‌కి దగ్గరైంది.

సిద్ధార్ధ పరిచయం, కేవలం కెరియర్‌కి ఆలంబనగా కోరుకున్నానేకానీ, మరోరకంగా తోడు చేసుకోవాలని ఆరోజు అనిపించలేదు.

మామ్ ఇండియాలో తను చదువుకునే రోజులకూ, తర్వాత మారుతున్న నాగరిక

తకూ, అమెరికాలోని సామాజిక పద్ధతులకూ ఏమాత్రమూ ప్రభావితం కాకుండా, తనదైన వ్యక్తిత్వాన్ని నిలుపుకుందని అర్థం చేసుకున్నాను.

తనకు నచ్చినట్టులేని మామ్‌ని, చాలా సులువుగా నిర్లక్ష్యంచేసి పరాయివాళ్ళను ఆశ్రయించాడు డాడ్.

అదే మామ్ తన అభిప్రాయాలకు విలువ ఇవ్వకున్నా, తనను కట్టుకున్న భార్యగా గౌరవించకపోయినా, అర్థం చేసుకోకపోయినా, డాడ్ జీవించినంతకాలమూ అతడికి దూరం కాలేదు. తనకు నచ్చని జీవితమైనా, ఇండియా వదిలి రావాలని లేకపోయినా భర్త అనే గౌరవాన్ని నిలబెడుతూనే వచ్చింది.

డాడ్‌కీ, రేణూ ఆంటీకి సంబంధం



వుందని తెలిసినప్పటికీ ఏనాడూ బయటపడలేదు. సరికదా ఆదరించి, ఇంట్లో చోటిచ్చింది. ఆంటీకి చివరి దశలో, నిష్కల్మష హృదయంతో సేవచేసింది. అంతటి ఉన్నతురాలు మామ్ అని ఇప్పుడు అర్థంచేసుకున్నాను ఆంటీ.

నేను రేణూ ఆంటీలా వుండవేమని హేళన చేసినా సహించింది. అంటే మామ్‌ని నేనూ, డాడీ కూడా సరిగా అర్థం చేసుకోలేదు. చాలాకాలం గడిచిన తర్వాతనే మామ్ అర్థమైంది.

అందుకే సునీల్‌తో శాశ్వత సంబంధాన్ని కూడా మామ్ ఒప్పుకుంటుందనే అనిపిస్తోంది. అన్నిరకాల వ్యక్తులను వాళ్ల వాళ్ళ స్వభావాలతో సహా అర్థం చేసుకోగల మామ్ వేరీ గ్రేట్ ఆంటీ. రియల్లీ ఆయామ్ ప్రౌడాఫ్ హెర్" అంది తుషార.

"ఇంతగా ఆలోచిస్తున్నావా తుషారా? నీలో చాలా మార్పు తెచ్చాడు సునీల్" అంది హారతి సంభ్రమంగా.

"మార్పు తెచ్చింది సునీల్ కాదోయ్. టైమ్" అన్నాడు వర్మ.

"ఏదైతేనేం మంచి మార్పు. ఈ మార్పు మంచి ముగింపుగానే మారాలి" అంది మన స్ఫూర్తిగా హారతి.

నీరసం తగ్గి, బలం చేకూరిన తర్వాత, మేమ్ అంటున్న సునీల్‌ని వారించి, "పేరుతో పిలు! ఇప్పుడు నేను కంపెనీకి బాస్‌ని కాదు" అంది తుషార.

"అమెరికన్స్ చాలామంది నిన్ను 'షారా' అని పిలుస్తారు. అందుకని నేనూ అలాగే పిలుస్తాను" అన్నాడు సునీల్.

★ ★ ★

ఓరోజు భోజనం చేస్తూంటే అన్నాడు సునీల్.

"షారా నీ రుణం ఎలా తీర్చుకోవాలి? ప్రాణదానం చేశావు. మా అమ్మలాగే కని పెట్టి వుంటున్నావు. నువ్వు, అంకుల్ నన్ను ఆదుకోకపోతే, నాకీ దేశంలో చోటుండేది కాదు" సిన్సియర్‌గా చెప్పాడు.

"నీ హెల్త్ పూర్తిగా బాగై, నువ్వు సెటిలైతే చాలు. పెద్ద మాటలు చెప్పకు సునీల్" అంది తుషార.

"షారా, నాకు త్వరగా కోలుకుని, కంపెనీకి వెళ్ళాలని వుంది. ఇంతకాలమూ చాలా వర్క్ పెండింగ్‌లో వుండిపోయింది కదూ? నీ బరువు తగ్గించాలని వచ్చి, నేనే నీకు బరువైపోయాను. ప్రాజెక్ట్ మధ్యలోనే ఆగిపోయింది" అన్నాడు విచలిత కంఠంతో.

కంపెనీ సేల్ అయినట్టు సునీల్‌కి తెలియదు. ఎవరూ చెప్పలేదు. చెప్పాల్సిన అవసరమూ లేదు.

"నువ్వు అంతటి వాడివని తెల్సులేవోయ్ సునీల్. ముందుముందు ఏ మార్పులు జరుగుతాయో నువ్విక వర్క్ గురించి ఆలోచించకు" అంది తుషార.

"నాకిలా కట్టేసినట్టు బెడ్‌మీదనే వుండటం బోర్‌గా వుంది" అనేవాడు.

"బోర్ కాకపోతే హాపీగా వుంటుందా? కొన్నాళ్లు తప్పదు మరి. ఓసారి మీ పేరెంట్స్‌ని పలకరించు" మాట మార్చి నంబర్ డయల్ చేసిచ్చింది తుషార.



వర్మ, సునీల్, ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. తుషార కిచెన్‌లో వుంది.

"సునీల్ మరో మూడునెల్లకి నువ్వు మామూలుగా వర్క్ చేసుకోవచ్చును. నీ ఆరోగ్యం చాలా బాగుందని డాక్టర్స్

చెప్పారు. మేమెంతైనా పరాయి వాళ్లమే! మారేజ్ చేసుకోవడం మంచిదేమో.... నీకింకా దగ్గిరవాళ్లు తోడుంటారు" సునీల్ మనసులో ఏముందో తెలుసుకోవడానికి అడిగాడు వర్మ.

"భలేవారంకుల్! ఇప్పుడు పెళ్ళా? మీరు జోక్ చేస్తున్నారు. ఈ జబ్బు మనిషిని ఎవ రైనా చేసుకుంటారా? ఇష్టపడతారా? "

"ఇష్టపడేవారుంటే ఓకేనా? "

సునీల్ వినిపించుకోనట్టు చెప్పుకుపోతు న్నాడు.

"నేను మంచి ఉద్యోగంలో స్థిరపడాలి. మా అమ్మా నాన్నలను సుఖపెట్టాలి. వారిని ఈదేశం తీసుకురావడం అంత సులువుకాదు. కనుక అయిదేళ్ల తర్వాత నేను ఇండియా వెళ్ళిపోతాను. వాళ్లు ఇష్ట పడి కోడలు కావాలనుకునే అమ్మాయినే పెళ్ళిచేసుకుంటాను" అన్నాడు.

"ఇదన్నమాట నీ ఆలోచన. బాగానే వుంది" నిరుత్సాహంతో అన్నాడు వర్మ.

కిచెన్‌లో వున్న తుషారకు ఈ మాటలన్నీ స్పష్టంగా వినిపించాయ్. 'సునీల్ ఇండి యాకి తిరిగి వెళ్ళిపోతాడన్నమాట. పేరెంట్స్ సెలక్ట్ చేసిన అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. అంటే నాకున్న ఆలోచనలు అతడిలో లేవు' అనుకుంది. సునీల్‌పై ఆశలు పెట్టుకోవడం వృధా అని తెలిసివ చ్చింది తుషారకి.

ఆరాత్రి తుషారకి మనసంతా శూన్యంగా తోచింది. సునీల్‌కి మానవతా ధర్మంగా పరిచర్యలు చేశానని అనుకోలేకపోయింది. "ఏమీకాని అతడికోసం ఎంతో మనీ ఖర్చు చేశాను. ఇక్కడ ఒక సర్జరీకే వన్‌లాక్ డాలర్స్ పేచేశాను. జీవితకాలం మెడికేషన్, (మెడిసిన్) డాక్టర్ అబ్జర్వేషన్ అవసరం. అంటే ఇంకెంత ఖర్చు వుంటుందో... ఎంత మానవతా దృష్టితో హెల్ప్ చేయాలను కున్నా, లైఫ్‌లాంగ్ హెల్ప్ ఎవరూ చేయ లేరు. ఏమాశించి సునీల్‌కోసం ఖర్చుచేయా లనే విషయం అలావుంచి, ఏకాకినైన నా జీవనాధారానికి నా జాగ్రత్తలో నేనుండాలి కదా? సునీల్ నేను చేసిన సహాయాన్ని అప్పుగానే భావించి, ఉద్యోగంలో చేరాక తీర్చాలని అనుకుంటున్నాడేమో! అతడు కోలుకుంటే కాని డాక్టర్ సర్టిఫై చేయరు. ఆ సర్టిఫికెట్ లేకుంటే ఉద్యోగమూ రాదు. ఆరోగ్యం బాగుపడుతున్నట్టు కనిపించినా ఇకముందు ఎంతటి రిస్క్ వుంటుందో సునీ ల్‌కి తెలియదు.

గత మూడు నెల్లుగా అనారోగ్యంతో వున్న అతడు, ఏమీ పట్టించుకునే పరిస్థి తిలో లేడు. కంపెనీ ఆర్థిక పరిస్థితి భాగుం డనందున వచ్చిందే చాలని సేల్ చేశాను. ఇప్పుడు సునీల్ కొత్తగా జాబ్ చేయగల స్థితిలో లేడు. ఏదైనా కోర్స్ చేయడమో, పిహెచ్‌డి చేయడమో తప్ప గత్యంతరం లేదు. అతడికి ఈ విషయాలన్నీ మెల్లిగా చెప్పాలి.

సునీల్ అమెరికాలో వుండితీరాలి. అతని కొచ్చిన 'బ్రెయిన్ వెసిల్ బ్లడ్ క్లాటింగ్‌కి' సరియైన ట్రీట్‌మెంట్ ఇక్కడే జరగాలి. ఇండియాలో వున్నప్పటికీ అతడికాస్తోమతు లేదు. కనుక, ఇక్కడ వుండగల అవకాశం కేవలం నావల్లనే సాధ్యపడుతుంది. నేను అమెరికన్ సిటిజన్‌ని కనుక నన్ను పెళ్ళిచే సుకుంటే, ఇక్కడ వుండగలుగుతాడు. లేకుంటే స్టూడెంట్‌గా వుండి, ట్రీట్‌మెంట్ తీసుకోవడం అసాధ్యం. ఈ విషయం అత డికి నేనెలా చెప్పగల్ను? చెబితే నా స్వార్థం కోసం చెప్పానని అపోహపడచ్చు అసలు ఎవరి గురించీ ఆలోచించని నేను, ఇతడిమీద ఆశలు పెట్టుకోవడం ఒక తోడు కోసమేనా? " ఇలా పరిపరి విధాల ఆలోచిం చింది తుషార.

వర్మ, హారతీ ఆమెలో కలిగిన కలవ రాన్ని గ్రహించారు.

"డోంట్ వర్రీ మైచైల్డ్. సునీల్‌కి నువ్వంటే

ఇష్టంవుంది. ప్రత్యేకమైన రెస్పెక్ట్ వుంది. అందువలన..."

"అంకుల్ ఆ రెస్పెక్ట్ జస్ట్‌లైక్ మదర్, సిస్టర్...?" అనుకోకుండా తుషార కళ్ల నుండి జలజలా కన్నీళ్లు చెంపలమీద ధార కట్టాయి. వర్మ లాలనగా తలనిమురుతూ ఇలా అన్నాడు.

"తుషారా నీకు తెలుగు, సంస్కృతం తెలిసివుంటే కార్యేషు దాసీ, కరణేషు మంత్రి, భోజ్యేషుమాతా, శయనేషు రంభా, క్షమయా ధరిత్రీ... స్త్రీ గురించిన ఈ సూక్తి విన్నావా?" సునీల్ ఆ దృష్టితో నీలో అందర్నీ దర్శించి వుండచ్చు. ఒక స్త్రీమూర్తిలో పురుషుడు అందర్నీ చూడగలిగినప్పుడు దానికి కారణం ఆమెయందున్న అనురాగమే!" అంటూ తుషారలో ఆశ చిగురింపచేశాడు.

అయితే తుషార పూర్తిగా నమ్మకం పెంచుకోలేదు. డాక్టర్ అప్పగించిన బాధ్యత, తనిచ్చిన మాటకు కట్టుబడి సునీల్‌కి చేతనైనంత వుపచారాలు చేయసాగింది.

ఈ అవకాశంతో సునీల్‌కి తుషార దగ్గిర చనువు పెరిగింది.

"షారా. నిద్రరావడంలేదు. కబుర్లు చెప్పుకుందామా?" అంటూ నిద్రలేవగొడతాడు.

మరోరోజు ఏదైనా మూవీ చూద్దాం అంటాడు. అదీ విసుగనిపించి కబుర్లు మొదలుపెడతాడు. తుషార రేణూ గురించో, తల్లి గురించో మొదలుపెట్టగానే ఆ టాపిక్ ఇంట్రస్ట్ లేక మాగజైన్ తిరగేస్తూ వింటూన్నట్టు నటించేవాడు.

ఒకోసాగి పీడకల వచ్చిందంటూ అర్ధరాత్రి లేపి చెప్పడం మొదలుపెడితే, జ్యూస్ కానీ, కాఫీగాని తెచ్చి స్లీపింగ్ పిల్ వేసి నిద్రపోగొట్టేది. పేషెంట్ కన్నా సేవచేసే తుషార నిద్రలేక సరియైన ఆహారం తినక, భవిష్యత్ ఎలా వుంటుందో తెలియని ఆందోళనతో చిక్కి సగమైంది.

హారతి ఖంగారుపడుతూనే వుంది. 'అతడి కోసం నీ ఆరోగ్యం చెడగొట్టుకోకు. అవసరం తీర్చుకుని సునీల్ తనదారిన తాను వెళ్ళిపోతాడు. నీకు హెల్త్ పాడైతే ఎవరు చేస్తారు తుషారా? అసలిదంతా వర్మ మూలంగా వచ్చింది. ముందు సునీల్ గురించి చెప్పివుంటే ససేమీరా ఒప్పుకునేదాన్ని కాదు. మీమామ్ నిన్ను నాకు అప్పగించింది. రేపు షాలిని వచ్చి అడిగితే ఏం చెప్పాలి?' అంది బాధగా.

"ఏం ఫర్వాలేదు ఆంటీ. మళ్లీ ఎంతలో వెయిట్ పుటప్ చేస్తానో చూద్దువుగాని. అసలు డైటింగ్ చేయాలనుకుంటున్నాను. ఇప్పుడిక ఆ శ్రమ తప్పింది" అంటూ సర్దేసింది.

చాలా రాత్రులు నిద్రలేక వేరే తన రూమ్‌లో పగలు భోజనం. అయ్యాక నిద్రపోయింది హారతి బలవంతంమీద. హారతి కూర్చుంది సునీల్ దగ్గర.

ఒక్క క్షణం తుషార కనుమరుగైతే తల్లిని వెదుక్కునే పసివాడిలా అయిపోతాడు సునీల్.

బలహీనత వలన సునీల్ ఎక్కువగా లేచి తన పని తాను చేసుకోలేకపోయేవాడు. కళ్లు తిరిగినట్టుండేది. ఏదైనా బుక్ తీసి అరగంట చదవలేడు. ఒక్కోసారి అతనికి అనిపించేది ఇలా ఏ పనీలేక తుషారమీద ఆధారపడి నిస్సహాయంగా జీవించేకంటే స్లీపింగ్ పిల్స్ మొత్తం బాటిల్ మింగేస్తేనో అనిపించేది. అమ్మానాన్నలు గుర్తొచ్చి ఆ ప్రయత్నం విరమించుకునేవాడు.

ఈ తుషార తనకేమవుతుందని, ఇలా నా కోసం కష్టపడుతోంది అని జాలి పడేవాడు.

సునీల్‌ని చూడాలని కావాలని తుషార నెత్తిన వేసుకున్న బాధ్యతకి ఎంతగా నలిగిపోతోందోనని, వుండబట్టలేక బయలుదేరి




వచ్చేసింది షాలిని. కూతుర్ని చూసేసరికి తెలిసివచ్చింది. వచ్చేటప్పటికి వున్న వెయిట్‌లో సగంలేదు. చాలా బలహీనంగా వుంది. హారతీ, వర్మల దగ్గర వాపోయింది. 'బంగారం లాంటి పిల్ల. చూడు, నల్లగా ఎలా పాడైపోయిందో? ! ఇదెక్కడి గొడవ హారతీ? ' అంటూ.

షాలిని వర్రీ చూశాక వర్మకి కూడా బాధనిపించింది. నిజమే, "తనొకటి తలిస్తే మరొకటి జరిగింది. సునీల్‌కి ఎటూ జీవితాశ లేదు. మరింక తుషారని ఎందుకు బలిచేయాలి? చాలా పొరబాటు చేశాడేమో తను. గాలిలో దీపంలాంటి సునీల్‌ని ఎవరు రక్షించగలరు? ఎంత మనీ వేస్ట్ అవుతుంది? ఇంతా చేసి సునీల్ బాగుపడినా ఆ తర్వాత తన దారిన తాను జారుకుంటేనో... తుషారకి దక్కేది నిల్ ఏమో!"

"సారీ షాలినీ! ఇదంతా నావల్లనే జరిగింది. నేను వెనకాల వుంటాను కనుక తుషారకి ఏమీ ఫర్వాలేదు. ఏదో సునీల్ వ్యాపకంలో నీ గురించి మరచిపోతుంది. అదృష్టం బాగుండి సునీల్ బాగుపడితే తుషార అతడ్ని తోడుగా అంగీకరించి సుఖజీవనం సాగిస్తుందనే ఆశతో ఇదంతా చేశాను. కానీ ఇప్పుడు ఆ ఆశ ఏ కోశానా కనిపించడం లేదు. సరికదా తుషార కూడా అనారోగ్యం పాలవుతుందేమోనని భయంగా వుంది" అన్నాడు వర్మ.

"ఇంతదాకా రానిచ్చి ఇప్పుడేం అనుకుని ఏం లాభం? తుషార అతన్ని విడిచిపెట్టదు. నువ్వు సునీల్‌ని వెనక్కి ఇండియాకి పంపలేవు. జరిగేది జరగనీ. అంతా మంచే జరుగుతుందని ఆశిద్దాం. నువ్వు కొన్నాళ్లుండు షాలినీ. తుషార కొంచెం తేరుకుంటుంది" అంది హారతి.

"అలాగే హారతీ! నేను వుండాలనే వచ్చాను. వర్మా! ఇంత జరిగాక జయరాం గారికీ, భార్యకీ చెప్పకపోవడం తప్పు. అందుకని చెప్పి వాళ్లు వచ్చే ఏర్పాటు చేసి వచ్చాను. తెలిసినవాళ్లు ఒక వారంరోజుల్లో తీసుకువస్తారు" అంది.

"అవును. మంచిపని చేశావు. వాళ్ల కొడుక్కి వాళ్లని చూసుకుంటే కొంత తృప్తిగా వుంటుంది. అవసరం కూడాను. అంతగా అయితే సంవత్సరంపాటు ఇక్కడే వుంటారు" అన్నాడు వర్మ.

షాలిని మంచి పనిచేసింది. అందరికీ రిలీఫ్‌గా, రెస్ట్‌గా వుంటుంది అనుకున్నారు.

తుషారకి మామ్‌ని చూడగానే వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టుంది. ఆనందంతో చిన్నపిల్లలా వాటేసుకుంది. ఎంతైనా 'అమ్మ అమ్మే' అనుకుంది హారతి.

జయరాం, భార్యా చాలా ధైర్యవంతులే. కొడుకుని చూసి ఏడ్చి గోల పెట్టలేదు. చాలా మామూలుగా వున్నారు. ఇక అన్నీ వాళ్లే చూసుకుంటున్నప్పుడు తుషారకి తెరిపిగా అనిపించింది.

తల్లీకూతుళ్లు కరవుతీరా ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. "ఇండియాలో నీ ప్రతాపం ఇంటర్‌నెట్ న్యూస్‌లో చదివాను మామ్. ఎంతైనా నీకు ధైర్యం ఎక్కువ. ఏకంగా స్టేట్ లెవెల్‌లోనే సోషల్ రివల్యూషన్ తెచ్చావు" తుషార మెచ్చుకోలుగా చెప్పింది.

"అమెరికానుంచి వెళ్లి నాలుగుమాటలు చెప్పేసరికి వాళ్ళకీ కొంత ఇంట్రస్ట్ కలిగింది. నిజంగా తుషారా, వాళ్ళలో మార్పు తీసుకురావాలనీ, ప్రజలను చైతన్యవంతులను చేయాలనే ఉత్సాహం వచ్చింది. మార్చగలిగితే గొప్ప విషయమే. లేకపోతే 'వీళ్లింతే మనం బాగుచేయలేం' అని ఓ నమస్కారం చేసేయడమే" అంటూ ఉత్సాహంగా తను తలపెట్టిన ప్రోగ్రాం సోషల్ సర్వీస్ వివరించింది.

"మామ్! నీ దగ్గర దాచను. సునీల్ నాకు తోడుంటే బాగుండుననిపిస్తోంది"

"మంచిదే తుషారా. కానీ కోరి మృత్యుముఖంలో వున్న సునీల్‌ని తోడు కావాలను

కోవడం హాస్యాస్పదం కాదూ? "

"కాదు... నాలో నీ రక్తం, నీ ఆశయం వున్నాయి మామ్. అందుకేనేమో నేను సునీల్ వైపు మొగ్గుచూపాను"

"నీ ఆశయం, సునీల్‌ని మామూలు మనిషిని చేసేవరకే. కానీ అతడ్ని మృత్యువునుంచి తప్పించగలవా? "

"ప్రయత్నం చేస్తాను మామ్. నాకొక ఛాలెంజ్ ఇది. సక్సెస్ అయ్యానో సరే. లేకుంటే ఏదీ మిగలదు. మనిషి ఆశాజీవి కదా? " ఆరిందాలా చెబుతున్న కూతురిలో ఎంత మార్పు? మాటలు అనుభవజ్ఞురాలిగా వున్నాయి. జీవితం మనిషికి అన్నీ నేర్పుతుంది. ఒక సంకల్పంతో సునీల్‌ని ఆదుకోవాలని భావిస్తోంది తుషార. అయితే సునీల్‌తో అంతకంటే బలమైన బంధమూ ఏర్పడుతున్నట్లు అనిపించింది. తుషార శ్రమ, సంకల్పమూ సిద్ధించి, సునీల్ కోలుకుంటే బాగుండును. అది అంత సులువుగా జరగదు. అందుకని కృంగిపోకుండా వుండాలంటే ధైర్యం చెప్పాలి. సునీల్ గురించి తుషార దీక్షగా పాటుపడితే తుషారకోసం తను పాటుపడాలి. తోడుగా వుండాలి' అని నిర్ణయించుకుంది షాలిని.

జయరాం, భార్యాకొడుకుని చూసుకోవడానికి ఇంట్లో వున్నారుకనుక, చాలావరకూ తుషారకి తీరిక లభించింది. ఇలా ఖాళీగా వుండడమూ విసుగే. వారెదుట సునీల్‌తో అతి చనువుగానూ వుండలేదు. కనుక జాబ్‌లో చేరింది తుషార.

మూడునెలలు అయ్యేసరికి చాలావరకూ కోలుకున్నాడు సునీల్. మెల్లిగా లేచి తన వర్క్ చూసుకోగలుగుతున్నాడు. కంప్యూటర్ వర్క్ చేస్తున్నాడు. డాక్టర్స్ అతడ్ని ఆటంకపర్చవద్దు' చేయగలిగిన పని చేసుకోమని సలహా చెప్పారు.

సునీల్ తల్లిదండ్రులకు క్రమంగా, ఇండియా వెళ్ళాలనే ఆలోచన వచ్చింది. ఇంకొక్క మూడునెలలు వుండండి... అంటూ బతిమాలింది హారతి. పాపం వాళ్ళకి వుండకూడదని కాదు. తమవల్ల ఇతరులకు ఇబ్బంది అని, బైట పనులు ఏమీ చేయలేమనీ మొహమాటం. పుట్టి బుద్ధెరిగి వాళ్ళెప్పుడూ ఏ నగరమూ ఇండియాలోనే చూడలేదు. సరాసరి అమెరికా వచ్చేసరికి ఉక్కిరిబిక్కిరి అయినట్టుంది వారికి. అతికష్టంమీద ఆరునెలలు పూర్తిచేశారు. ఇక వారిని ఇండియా పంపించడం తప్పనిసరి.

"జయరాం! నువ్వేమీ మారలేదురా. ఇక్కడ వుండడానికి చాలా కష్టపడుతున్నావ్. సరే నిన్నింక ఆపదల్చుకోలేదు. నీకు సునీల్ గురించి పూర్తిగా వివరిస్తాను విను" అంటూ అతడి ఆరోగ్య పరిస్థితి, ఇక్కడే వుంటే వచ్చే ఉపయోగం, అత్యవసరంగా కావల్సిన తుషార సహాయం దాచకుండా చెప్పేశాడు. ఎంతైనా మగవాడు కనుక బాధను పైకి వెల్లడించలేదు. జయరాంభార్య మాత్రం కాసేపు విలపించింది.

ఆవిడ్ని ఓదార్చి "అన్నిటికీ డాక్టర్స్‌మీద భారం వేయండి. నా శక్తిమేరకు ఆదుకుంటాను. ఒక్క విషయం చెప్పదలచుకున్నాను. మీకు అంగీకారం అయినా కాకపోయినా, సునీల్ బతికి బాగుపడడానికి తుషార ఒక్కతే ఆధారం. మీరు సంతోషంగా వాళ్ళిద్దర్నీ ఆశీర్వదించి వెళ్ళండి. సునీల్‌ని తుషారకి అప్పగించి వచ్చామనే సంతృప్తి మీకు వుంటుంది" చివరిమాటగా చెప్పాడు వర్మ.

"వర్మా, సునీల్ నాక్కూడా కొడుకే, అదే విధంగా ఆదుకున్న నీ మాటను కాదనలేను. షాలినీ, తుషారా కూడా మంచి వాళ్ళు. షాలిని నేను అడగకపోయినా ఇండియాలో ఆదుకుంటుంది. నాకుతెలుసు. కానీ నేను ఒక్క విషయం మరిచిపోవాలి. సునీల్ దక్కుతాడా లేదా అనేది"

అంటుంటే అంతదాకా ఓర్చుకున్న జయరాం కళ్ళనుంచి నిస్సహాయంగా కన్నీళ్ళు రాసాగాయి.

"ఊర్కో జయా! చెడుగా ఆలోచించకు. అన్నీ బాగుంటాయని ఆశిద్దాం. సునీల్ ఎక్కడున్నా సుఖంగా వున్నాడనే అనుకో" అంటూ ఓదార్చాడు వర్మ. మరో వారానికి వాళ్ళు ఇండియా వెళ్ళిపోయారు.



తుషార వేరే తన రూమ్‌లో నిద్రపోతోందప్పుడు. అంతగా కూడా వుండాల్సిన అవసరం లేదని డాక్టర్స్ చెప్పడంవలన హారతీ, షాలినీ, వర్మా తెలిసిన వాళ్ళింట్లో మారేజ్ వుందని శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళారు. నాలుగురోజులదాకా రారు.

కంప్యూటర్ మీద వర్క్ చేస్తున్నారు సునీల్, తుషారాను. మరో మూడునెల్లు గడిచిపోయాక జాబ్‌లో చేరచ్చు అందాకా తుషారకి తోడుగా ఇంటినుంచే వర్క్ చేస్తున్నాడు. చాలావరకూ ప్రమాదం తప్పినట్టే అతనికి. దాదాపు ఇంట్లో అందరూ ప్రమాదం విషయం మరిచిపోయారు. రొటీన్‌గా నెలకోసారి చెకప్, రెగ్యులర్ మెడికేషన్ తప్పితే ఏం ఫర్వాలేదని డాక్టర్స్ చెప్పారు.

ఎప్పుడూ తుషార తన రూమ్ లాక్ చేయదు. సునీల్‌పట్ల ఆ అనుమానం రాలేదామెకు. ఆరోజు మీటింగ్స్, ఇంటర్వ్యూస్‌కి అటెండ్ కావడంతో బాగా అలసిపోయింది. ఇంటికి రావడం లేటవడంతో వెంటనే డ్రస్ ఛేంజ్ చేసుకుని బెడ్‌మీద వాలిపోయింది. ఇక సునీల్‌ని కూడా పలకరించలేనంత అలసటగా అన్పించిందామెకు.

గాఢంగా నిద్రపోతున్న తుషారకు హఠాత్తుగా ఎవరో స్పృశించినట్టూ, పెదవులపై ముద్దుపెట్టినట్టూ తోచి కళ్ళు తెరవాలని అనుకుంది కానీ నిద్రాభారంతో రెప్పలు విడివడనేలేదు.

శరీరమంతా తీయని బాధతో బరువుగా తోచింది. మెల్లమెల్లగా మెలకువలోకి వచ్చింది. సునీల్ అని అర్థమైంది. మాటలతో చెప్పని భావం అతడు ఆక్రమించుకోవడంలో తెలియవచ్చింది. తుషార ఇక సంకోచించలేదు.

ఉదయం మెలకువ వచ్చి చూసేసరికి దూరంగా సోఫాలో తప్పుచేసిన పసివాడిలా కూర్చుని వున్నాడు సునీల్.

తుషార అతడికి దగ్గరగా వెళ్ళింది.

"షారా అయామ్ వెరీ సారీ... నేను ఏదో తెలియని మత్తులో నీ అనుమతి లేకనే..."

"తెలియక చేశానని బాధగా వుందా? తెలిసి అంగీకరించవా? "

"షారా... కొండంత మనసుతో ఆశ్రయం ఇచ్చావు. ఎవరూ చేయలేని సహాయం చేసిన నిన్ను, తొందరపాటుతో మలినం చేశాను"

"ఒక్క విషయం చెప్పు సునీల్. ఆవేశంతో ఈపని చేశావా? లేక మనసులో నామీద వున్న ఇష్టంతో చేశావా? " జవాబు కావాలి.

"షారా! అన్నింటా అధికురాలివైన నువ్వు నేను నీమీద ఇష్టాన్ని వ్యక్తీకరిస్తే క్షమించగలవా? అనే సందేహంతో నా మనసులో మాట చెప్పలేకపోయాను. ఒకవేళ చెబితే

ఎవరైనా అనుకునేది ఒక్కటే. నా ట్రీట్‌మెంట్‌కి అయ్యే ఖర్చుకోసం నిన్ను ఆశ్రయించానని. నువ్వూ ఆ విధంగానే భావిస్తావేమోనని భయపడ్డాను. ఈరోజు ఇక ఏ ఆలోచనా అడ్డురాలేదు. నేను పురుషుణ్ణి, నువ్వు స్త్రీవి. నువ్వు కావాలి. మనిద్దరం చాలాకాలంగా, ఒకచోట కలిసి వుంటున్నాం. నీమీద చెప్ప లేని ప్రేమ, కృతజ్ఞతా, ప్రకృతి సహజమైన ఆకర్షణా తొందర చేసిన ఫలితం ఇది"

"సరే! నన్ను పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నావా? "

"ఎలా తుషారా? ఏ ఆశతో కోరుకోను? అనారోగ్యం అల్పాయుష్కుణ్ణి చేస్తుందేమో. నిన్ను సుఖపెట్టే యోగ్యత వుందా పూజించే యోగ్యతేకానీ. నాలో సహజమైన కోరికలు ఎన్నో వున్నాయి. నేనేమైనా ఫర్వాలేదు. నాపట్ల నీకు ఆప్యాయతా, అనురాగం వుంటే నీకు అంకితమైపోవడానికి సిద్ధంగా వున్నాను", అతడిపక్కన కూర్చుని తలను దగ్గరగా తీసుకుంది తుషార. అతడితో మృదుమధురంగా చెబుతోంది.

"సన్నీ... పుట్టి బుద్ధెరిగి తోడంటే అవసరం లేదనుకుని పెరిగాను నాచుట్టూ రక్షణగా మామ్, డాడీ, రేణూ ఆంటీ వుండడం వల్లనే కాబోలు. క్రమంగా నాక్కూడా తోడు కావాలనీ ఆ తోడే ఆలంబన అవుతుందనీ ఆశపడ్డాను. కానీ నీకన్నా కొంచెం పెద్ద అని తెలిశాక నిన్ను అడగలేకపోయాను. నీలోకూడా ఆ భావన కలిగేవరకూ ఎదురు చూశాను. సక్సెస్ అయ్యాను. సునీల్...! ఎన్నటికీ వదులుకోని ఆలంబన నువ్వే. జరిగేదాని గురించి మనం ఆలోచించవద్దు. నాకు నువ్వూ, నీకు నేనూ... అంతేకదూ! అంటూ అతని ఒళ్ళో తల పెట్టుకుంది.

సునీల్‌కి మాటలేం వస్తాయి.

★ ★ ★

శాన్‌ఫ్రాన్సిస్కోనుంచి తిరిగివచ్చిన షాలినికి తుషార శుభవార్తని అందించింది. సునీల్‌కి తనపట్ల వున్న అభిప్రాయం చెప్పి పెళ్ళి చేసుకుందామనుకుంటున్నామని చెప్పింది.

"తెలిసీ తెలియని వయసులో, నీ మాట వినక, నిన్ను నొప్పించే పనులే చేశాను మామ్! అందుకే నా జీవితం కూడా చాలా కాలం ఓ సెటిల్‌మెంట్ అంటూ లేకుండా వుండిపోయింది. వయసు పెరుగుతున్న కొద్దీ, ప్రపంచాన్ని చూస్తున్నకొద్దీ నా జీవితానికి స్థిరత్వాన్ని ఏర్పరచుకోవాలనే తలంపు కలిగింది మామ్. అదీ ముఖ్యంగా నీ సాహచర్యంలో ఎక్కువభాగం గడిపాక, నీ వ్యక్తిత్వాన్ని, మానసిక స్థిరత్వాన్ని చూశాక నాలో చాలా మార్పు వచ్చింది మామ్! ఇకపైన నా జీవితం కూడా సునీల్‌తో కలిసి ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా గడవాలని నన్ను బ్లెస్ చేయ్ మామ్!" అంటూ కంటి నిండా నీళ్ళతో షాలిని కాళ్ళు పట్టుకుంది తుషార.

తుషారను లేవదీసి గుండెలకు హత్తుకుంది షాలిని.

"మమ్మీ! జీవితంలో ప్రతిమనిషీ తనకో ఆలంబన కావాలనుకుంటాడని నాకనిపిస్తుంది. డాడ్ వున్నంతకాలము ఆయన ఎక్కడున్నా నీకు ఆయనే ఆలంబన అనే ధైర్యంతో జీవితాన్ని గడిపావు. మరిప్పుడు నీ మనోభావాలు ఎలా వున్నాయిమమ్మీ. నిన్ను నువ్వు ఒంటరి దాన్నని ఫీలవుతున్నావా? అలా అనుకుంటే అసలు నువ్వు ఇండియా వెళ్లనే వద్దు. నా దగ్గర ఉండు." అంది తుషార.

అమ్మా తుషారా! ఆలంబన అంటే ఓ స్త్రీకి పురుషుడే కానక్కరలేదు. ఎందుకో ఏమో నామనసెప్పుడో సమాజసేవ వైపు మళ్లింది. వృద్ధులకు, అనాథలకు నేను ఆలంబన అయ్యానని నువ్వు అనవచ్చు కానీ నాకు కూడా వాళ్లే ఆలంబన ఇది నిజం. నేను వాళ్లకోసం అనీ, వాళ్లు నాకోసం అనీ నేననుకుంటాను. ఒంటరితనం అనేది మనసుకి సంబంధించినది. అది నాకు లేదమ్మా!" అంటూ తుషార తలనిమురుతూ ఉండిపోయింది షాలిని.

❋




# ఏరిన ముత్యాలు

✲ మంటల దగ్గర్నుంచి వచ్చిన వ్యక్తిని తీవ్రమైన సూర్యకిరణాలు ఏమీ చేయలేవు.

– సోమర్‌సెట్ మామ్

✲ చర్చ సాగించడం ఒకరి తెలివితేటలు ఒకరు అందిపుచ్చుకోవడం. వాదన చేయడం తెలివితక్కువతనాన్ని ఒకరికొకరు ఇచ్చుకోవడం.

– గోథే

✲ ఇతరుల తప్పిదాలని మరిచిపోయే మంచి మార్గం ఏమంటే నీ తప్పిదాలని జ్ఞాపకం చేసుకోవడం.

– అరేబియన్ సూక్తి

✲ ఆలోచనలు ఉద్భవించే మస్తిష్కానికి కలం నాలుక వంటిది.

– మిల్టన్

✲ గౌరవప్రతిష్ఠలు జీవితంకన్నా ప్రియమైనవి.

– సిసిరో

✲ స్త్రీలు నిశ్శబ్దంగా వుండడం వారు ధరించే అన్ని నగలకన్నా గొప్ప నగ.

– అరిస్టాటిల్

✲ నువ్వు చెప్పేందుకు ఏమీ లేనప్పుడు, ఏమీ చెప్పకు.

– ఛార్లెస్‌కాలెబ్‌కోల్టన్

✲ ఓ అందమైన భవనాన్ని అందులో నివసించేవారు వదిలేస్తే, అదొక పాడుబడిన ఇల్లులా కనిపిస్తుంది. అలాగే, శీలంలేని మనిషికి ఎంత సంపదున్నా విలువ, గౌరవం వుండవు.

– గాంధీజీ

✲ వాగ్దానం చేసినంత మాత్రాన మనిషిని నమ్మలేము. మనిషినిబట్టి వాగ్దానానికి విలువనిస్తాము.

– యచిలిస్

✲ పెద్దపనులు చేయలేము. చిన్నపనులు చేద్దాంలెమ్మని ఉపేక్షిస్తాము. ఫలితం ఏ పనీ చేయలేని బద్ధకస్తులుగా మిగిలిపోతాం.

– జీన్

✲ ఈ ప్రపంచంలో మోసగాళ్లకంటే అవివేకులు ఎక్కువ మంది ఉన్నారు. ఆ కారణంగానే మోసగాళ్లు ఎక్కువ కాలం జీవించ గలుగుతున్నారు.

– శామ్యూల్ బట్లర్

✲ మనం అల్ప సంఖ్యాకులుగా ఉన్నప్పుడు సాహసానికి పరీక్ష వస్తుంది. అధిక సంఖ్యాకులుగా ఉన్నప్పుడు సహనానికి పరీక్ష వస్తుంది.

– సెనెకా

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

# చతుర ప్రపంచం

## హైహీల్స్ వెనుక

ఈనాటి అమ్మాయిలు ఎంతో మక్కువగా ధరిస్తున్న హైహీల్స్‌ని మొదట పురుషుల కోసం తయారుచేశారంటే వినడానికి ఆశ్చర్యంగా వుంటుంది. కానీ అది నిజం. గుర్రపుస్వారీ చేసేటప్పుడు సౌకర్యంగా వుంటుందని పురుషులు ఈ హైహీల్స్ ధరించేవారట.

ఎక్కకూడదనే ఆంక్ష వుండేది. అలాగే పాయింటెడ్ హీల్స్ ధరించిన స్త్రీలు ప్రజలు ఎక్కువగా వున్న భవనాల్లోను, జనసముదాయం ఎక్కువగా తిరిగే భవనాల్లోను తిరగకూడదన్న నియమాలని తూచ తప్పకుండా పాటించేవారట. ఇలా చేస్తే పాయింటెడ్ హీల్స్ వలన విమానానికి, భవనాలలో నడిస్తే నేలకు రంధ్రాలు పడతాయని భావించి ఈ నిబంధనలు విధించారట.




నేడు జీరోహీల్ ఫ్లాట్స్ నుంచి ఏడెనిమిది అంగుళాల ఎత్తువరకు ఎత్తుమడమల చెప్పులు లభిస్తున్నాయనుకోండి. అప్పట్లో అన్ని మోడల్స్ లేవు.

చెప్పుల గురించి ఆసక్తికర విషయాలు వింటుంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది. మనం సగటున ఒకరోజుకి కనీసం తొమ్మిది వేల అడుగులు నడుస్తామట. వీలైతే ఒకసారి లెక్కపెట్టి చూడండి. మరి రోజంతా హైహీల్స్ ధరించేవారి ఆరోగ్యం సంగతేంటి?

1950 దశకంలో సూదిమొనలాగా వాడిగా వున్న చెప్పులు ధరించిన స్త్రీలు విమానాలు

ఇకపోతే 1960లో ఇల్లినాయిస్‌కి చెందిన ఓ చెప్పుల తయారీదారుడు ఎంత ఎత్తు కావాలంటే అంత ఎత్తును కుదుర్చుకునేందుకు వీలుగా వుండేవిధంగా చెప్పుల్ని తయారుచేశాడట.

1822 ప్రాంతంవరకు కుడి, ఎడమ కాళ్లకి ధరించే చెప్పులమధ్య బేధం వుండేదికాదు. అంటే రెండూ ఒకేవిధంగా వుండేవన్నమాట. కానీ 1822 తర్వాత కుడిచెప్పు, ఎడమ చెప్పుకీ మధ్య స్పష్టంగా బేధం కన్పించేవిధంగా చెప్పుల్ని తయారుచేయడం మొదలుపెట్టారట.

చెప్పుల వైద్యం గురించి కూడా ఎంతో కొంత చెప్పుకోవాలికదా. చెప్పులతో కడుపు నొప్పులకి, తలనొప్పులకి వైద్యం చేసేవారట. అమెరికన్లు ఒకప్పటి రోజుల్లో ఎవరికైనా కడుపునొప్పిగా వుంటే ఆ వ్యక్తిని వెల్లకిలా పడుకోబెట్టి ఆ వ్యక్తి పొట్టమీద బరువైన చెప్పులు వుంచేవారట. ఇలా చేస్తే కడుపునొప్పి తగ్గుతుందని వారు విశ్వసించేవారు. ఇక ఈజిప్షియన్లు తలనొప్పి తగ్గేందుకు చెప్పువైద్యమే చేసేవారు. చెప్పును కాల్చి వాసన చూస్తే తలనొప్పి తగ్గుతుందని వారి నమ్మకం.

ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన చెప్పుల ధర అక్షరాలా 1.8 మిలియన్ డాలర్లు. అతి ఖరీదైన వజ్రాలు పొదిగిన స్ప్లెటెట్ శాండిల్ జతని ఓ అభిమాని షుమారు 1.8 మిలియన్ డాలర్లకు కొనుగోలు చేశాడట.

---

## గాజుల గలగలలు నేటివి కాదు...

భారతీయ స్త్రీ గాజులు ధరించడాన్ని సౌభాగ్యానికి చిహ్నంగా భావిస్తుంది. ప్రపంచంలోని మహిళలందరూ గాజులు, బ్రేస్‌లెట్స్ ధరించినా మన భారతదేశంలో వీటికున్న ప్రాధాన్యతే వేరు.

సింధు నాగరికతకి చెందిన హరప్పా తవ్వకాలలో బయటపడిన ఓ నగ్న నృత్యకారిణి గాజులు ధరించి వుందని వెల్లడైంది. ఈ నగ్న నృత్యకారిణి కంచు విగ్రహం చేతికి గాజులు వున్నట్లు బయటపడడంతో బహుశా ఆనాటినుంచి అలంకరణలో గాజులు ధరించడం కూడా ఓ భాగమై వుంటుందని నమ్మడం మొదలుపెట్టారు. అంటే సుమారు రెండువేల సంవత్సరాలకి పూర్వంనుంచి గాజులు ధరిస్తున్నారన్నమాట. పైన చెప్పిన నృత్యకారిణి విగ్రహం సుమారు క్రీ.పూ. 2300 నుంచి 1750 సం. మధ్యకాలందై వుండచ్చని శాస్త్రవేత్తల అభిప్రాయం. అంతే కాదు, విగ్రహం ఎడమచేయి పూర్తిగా గాజులతో అలంకరించివుంది. కానీ కుడిచేతికి మాత్రం మణికట్టు, మోచేతిపైన మాత్రమే గాజులు వున్నాయి.

ఈజిప్టు నాగరికతలో కూడా స్త్రీలు గాజులు ధరించారనడానికి ఆధారాలు వున్నాయి. సమాధుల పరిసరాలలో గాజులని పోలిన ఆభరణాల తాలూకు శకలాలు కన్పించాయి. ఈజిప్టులో అప్పట్లో మరణించిన వ్యక్తి తాలూకు ప్రియమైన లేదా విలువైన వస్తువులని కూడా ఖననం చేసే ఆచారం వుండేది. ఆవిధంగా సమాధుల్లో లభ్యమైన వాటినిబట్టి ఈజిప్టు మహిళలు కూడా గాజులు ధరించారని చెప్పొచ్చు.

ఆదిమకాలంలో బంగారు ఆభరణాల గురించి తెలీదు. శంఖాలు, ఎముకలు, రాళ్లతో తయారుచేసిన గాజులు, బ్రేస్‌లెట్లు వారు ధరించేవారు. మొదట కేవలం అలంకరణలో భాగంగా వీటిని ధరించేవారు. క్రమేణా దయ్యాలు, దుష్టశక్తులనుంచి గాజులు తమని కాపాడతాయనే నమ్మకం మొదలైంది. తర్వాత తర్వాత గాజులు ధరిస్తే అదృష్టం తమ తలుపు తడుతుందని భావించడం ఆరంభించారు.

టైగ్రిస్ యూఫ్రటీస్ నదీలోయలో లభించిన ఆధారాలనిబట్టి గాజులు, చెవిపోగులు, భుజకీర్తులు వంటి బంగారు ఆభరణాలని తొలిసారిగా వారే వాడుంటారనడానికి ఆధారాలు లభించాయి. క్రీ.పూ. 2500 సం.ల క్రితమే వీరు బంగారు ఆభరణాలు ధరించారన్నది స్పష్టంగా వెల్లడవుతోంది.

బంగారపు బ్రేస్‌లెట్లు క్రీ.పూ. ఒకటో శతాబ్దంనాటికి ఇరాన్, గ్రీస్ ద్వారా పాశ్చాత్య ప్రపంచానికి పరిచయం అయ్యాయి. ఈ బ్రేస్‌లెట్లు గాజులని పోలివుండేవి. వీటిమీద గద్ద, పాము వంటి బొమ్మలతోపాటు మతపరమైన విశ్వాసానికి సంబంధించిన గుర్తులు కూడా వుండేవి.

గాజులకి, బ్రేస్‌లెట్లకి మనమిచ్చిన ప్రాధా




న్యత పాశ్చాత్యులు ఇవ్వరు. సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో యూరప్‌లో స్త్రీ పురుషులిద్దరు అనేకరకాల ఆభరణాలు ధరించేవారు. కానీ నేడు వారి ఆభరణాలని చూస్తే ఒకప్పుడు శిరస్త్రాణం మీద కూడా ఆభరణాలు ధరించింది వీరేనా అనే ఆశ్చర్యం కలుగుతుంది.

ఏది ఏమైనా భారతీయ స్త్రీకి గాజులు ధరించడంపై వున్న మక్కువ మాత్రం నేటికీ చెక్కుచెదరలేదు.

## అతి ఖరీదైన పేపర్ వెయిట్

కొందరు రాజులు, రారాజులు, సంస్థానాధీశులు తమకున్న అపారమైన సంపదతో అతి విలువైన వజ్రాలు, వైఢూర్యాలు, మరకత మాణిక్యాలు - కొన్ని కొని, కొన్ని దౌర్జన్యంతో స్వంతం చేసుకుని, మరికొన్ని కానుకల రూపంలో స్వంతం చేసుకుని తమ కోశాగారాల్లో భద్రం చేసేవారు. అతి విలువైన ఆ ధనాగారానికి అతి కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు వుండేవి.

కొన్ని కొన్ని వేడుకలకి, రాజభవనంలో వివాహాలకి అతి ఖరీదైన వజ్రాలు వగైరాలు, బహు సుందరంగా చేయించిన నగలు కోశాగారంనుంచి బయటకి తీసి, వాటిని ధరించి వైభవోపేతంగా ఆ కార్యక్రమాలని జరుపుకునేవారు. ఆ వేడుకలు అయిన వెంటనే వాటిని యధాప్రకారం ధనాగారంలో భద్రపరిచేవారు. రాజుల కోవకి చెందిన నిజాం నవాబు అపార సంపద సేకరించి తన కోశాగారాల్లో భద్రపరిచాడు. నవాబు పరమ లోభి. ఎంతో ధనాపేక్ష గలవాడు. కొన్ని ఖరీదైన వజ్రాలని ముక్కుతూ, మూలుగుతూ కొన్నా, చాలావాటిని కానుకల రూపంలో స్వంతం చేసుకున్నాడు.

అద్భుతమైన వజ్రాలు ఎన్నో అతని హస్తగతమయ్యాయి. వాటిల్లో 'జాకోబ్' డైమండ్ ఒకటి. అది మహత్తరమైన కోహినూర్ వజ్రం అంత పెద్దది. విలువ 400 కోట్ల రూపాయలు. చిత్రమేమిటంటే అంతటి ఖరీదైన వజ్రాన్ని, నవాబు కేవలం ఓ పేపర్ వెయిట్ వలే ఉపయోగించేవాడు. అతనిది చిత్రమైన మనస్తత్వం. కొన్ని ఖరీదైనవాటి విషయంలో అంత శ్రద్ధ తీసుకునేవారు కాదు. జాకోబ్ డైమండ్ అసలు పేరు 'ఇంపీరియల్ డైమండ్' అది దక్షిణాఫ్రికాలో లభించింది. ఆ




ముడివజ్రం 457.50 క్యారెట్ల బరువు గలది. ఆమ్‌స్టర్‌డామ్‌లోని నిపుణులచేత ఆ వజ్రాన్ని చెక్కించడం జరిగింది. అప్పుడది 184.50 క్యారెట్ల అద్భుతమైన వజ్రంగా రూపొందింది. 1891లో దీనిని ఆరవ నిజాం నవాబు అలీపాషాకి జ్యూయిస్ వజ్రాల వర్తకుడు అలగ్జాండర్ మాల్కోమ్ జాకోబ్ విక్రయించాడు.

ఆ వజ్రాన్ని కొన్న అలీపాషా కోర్టుకేసులో ఇరుక్కున్నాడు. అందువలన ఆయన కలకత్తాలోని జడ్జీలముందు నిలబడి తన వాదనని వినిపించుకోవలసి వచ్చింది. చరిత్రలో, మెహబూబ్ అలీపాషా వంటి నిజామ్ తొలిసారిగా న్యాయస్థానంలో నిలబడిన సందర్భం అది. తదాది పాషాకి వజ్రాలు ధరించడంపై విరక్తి కలిగింది. వెలుగులు విరజిమ్మే ఆ వజ్రంపై పాషా అనాసక్తిగా వుండి, దానినొక సామాన్యమైనదానిగా భావించి, నిర్లక్ష్యం చేసేవాడు.

అతని కుమారుడైన చివరి నిజాం చాలా సంవత్సరాల తర్వాత అనుకోకుండా ఆ వజ్రాన్ని చూశాడు. పాషా ధరించిన బూట్లలో అది నిజాంకి కనిపించింది చౌమహాలియా ప్యాలెస్‌లో. అప్పట్నుంచీ ఆయన ఆ వజ్రాన్ని ఓ పేపర్ వెయిట్‌వలే వినియోగించాడు.




## టీచర్ల కష్టాలు

గురువు సాక్షాత్ పరబ్రహ్మ అనీ, గురువు మహేశ్వరుడంతటివాడు, విష్ణువంతటివాడు అంటూ వేదికలపై నిలబడి రాజకీయ ప్రముఖులు, మంత్రులు వగైరాలు ఇచ్చే ఉపన్యాసాలు వినసొంపుగా వుంటాయి. అవి ప్రేక్షకుల అభిమానం చూరగొనేలా, వారికి గురువులపై ఎంతో అభిమానం, ఆపేక్ష వున్నట్లుగా నమ్మకం కలిగిస్తాయి.

ఉపాధ్యాయుల దినోత్సవం రోజున కొందరు ఉపాధ్యాయులని సన్మానించి ఓ శాలువా కప్పేసి తమ ఘనత చాటుకుంటారు. అంతటితోసరి. ఆనక మాష్టర్లని పట్టించుకునే నాధుడు, వారి గోడు వినేవారు వుండరు. అదే జరిగింది వాసుదేవరావు అనే రిటైరైన హెడ్ మాష్టర్ విషయంలో. ఒక క్లర్క్ నిర్లక్ష్యం వలన ఆయన పెన్షన్ నెలకి 4రూ.లుగా నిర్ణయించబడింది. 1969 లో జరిగిందిది. తదాది 33 సం.రాలుగా వాసుదేవరావు తన పెన్షన్ పెంపుదల కొరకు పడరాని పాట్లు పడుతూనే వున్నాడు. ఎన్నో ఆఫీ




సుల చుట్టూ తిరిగాడు.

ఆదాయం సరిపోక అనేక అవస్థలు పడ్డాడు వాసుదేవరావు. ఎవరూ అతని గోడు పట్టించుకోలేదు. చివరికి కర్నాటక ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్‌ని కలిశాడు. అక్కడి ఏలిన వారు జరిగిన పొరపాటు సరిచేస్తామన్నారు. అంతే, వేసిన గొంగళి వేసినచోటే వుంది. ఇంతవరకూఆర్డరు లేదు. రావుకు రిటైరైన నాటినుంచి 23 వేల రూ.ల ఎరియర్స్ అందవలసి వుంది.

తనకి ఆఫీసులచుట్టూ తిరిగే ఓపిక ఇకలేదని ఆయనన్నాడు. నిరాశా నిస్పృహలతో ఆ మాస్టారు తన భార్య మరణించిన పిమ్మట అవసరమైన పత్రాలు అన్నిటినీ తగలపెట్టేశాడు. రాజీవ్‌గాంధీ ప్రధానిగా వున్న సమయంలో సోనియాగాంధీకి రావు ఒక లేఖ రాశాడు. ఆ జాబు కర్నాటకలోని ఆఫీసుకి వచ్చింది. అయినా వాళ్లు ఏ చర్యా తీసుకోలేదు. పిమ్మట రావు శంకరదయాళ్‌శర్మకు ఓ లేఖ రాశాడు. జరిగినదేమీలేదు.

ప్రభుత్వంవారి అశ్రద్ధ, తనబోటి టీచర్లపట్ల చూపుతున్న నిర్లక్ష్యానికి రావు ఆవేదన చెందుతున్నాడు. తాను లంచంకింద ఒక్క రూపాయి కూడా ఎవ్వరికీ ఇవ్వకపోవడం వలన ఇలా జరుగుతోందని ఆయన అన్నాడు. ప్రస్తుతం వాసుదేవరావుకు సీనియర్ సిటిజన్ ఫోరమ్‌వారి అండదండలు లభించాయి. ఆ ఫోరమ్‌వారు రావు విషయంలో గట్టి ప్రయత్నం చేస్తున్నారు.

చిత్రమైన సంగతి ఏమంటే ప్రభుత్వం ప్రతీ ఏడూ ఉపాధ్యాయుల దినోత్సవం గొప్పగా చేస్తూ వాసుదేవరావు వంటి టీచర్లని ఈవిధంగా బాధించడం!

---

## జిప్సీలనుంచి వచ్చిన హనీమూన్

వివాహబంధంతో ఒకటైన భార్యాభర్తలు ఝామ్మని హనీమూన్‌కి వెడుతుంటారు. నిజానికి దీనికి అంకురార్పణ చేసినవారు జిప్సీలనడానికి ఆధారాలు వున్నాయి.

హనీమూన్ అనే పదం HJUNOTTS-MANATHAR అనే నార్డిక్ పదం నుంచి వచ్చింది. అంటే అమ్మాయిని ఎత్తుకెళ్లడం అని అర్థం. అదేంటి, హనీమూన్ అన్న పదం అమ్మాయిని ఎత్తుకెళ్లడం నుంచి పుట్టడం ఏమిటని ఆశ్చర్యపోతున్నారా? ఇది పూర్తిగా చదివితే ఆ సంగతి మీకు అర్థమవుతుంది.

యూరప్‌లోని జిప్సీలు తాము పెళ్లి చేసుకోవాలనుకున్న అమ్మాయిలని ఎత్తుకుపోయేవారు. పొరుగునవున్న తండాలనుంచి, లేదా పల్లెలనుంచి కానీ తాము ఇష్టపడ్డ అమ్మాయిలని తీసుకుపోయి ఎవరికీ తెలియని ప్రదేశంలో వీరిని దాచేసేవారు. పైన చెప్పిన నార్డిక్ ఏడాదికి 'మంత్ ఆఫ్ హైడింగ్' అన్నది సరైన అర్థం.

ఈ నెలరోజులు తప్పిపోయిన అమ్మాయి కోసం అమ్మాయి తరపువాళ్లు వెతుకుతారు. అబ్బాయి తరపువారికి ఈ సంగతి తెలిసినా కూడా వాళ్లు చెప్పరు. ఆవిధంగా ఆ నెలరోజులపాటు అమ్మాయిని ఎత్తుకెళ్లిన యువకుడు అమ్మాయి మనసు మార్చేందుకు ప్రయత్నిస్తాడు. ఆమెని ఒప్పించేందుకు మంచి మాటలు చెప్తాడు. వీటితోపాటు అమ్మాయి పారిపోకుండా వుండేందుకు, ప్రతిఘటించకుండా తనకి లొంగిపోయేందుకు మధువులో తేనె కలిపి తాగిస్తాడు. అలా ఆ అమ్మాయి పెళ్లి కాకముందే అతనికి లొంగిపోతుంది.

నార్డిక్‌ల సంప్రదాయం ప్రకారం ఏ యువకుడైతే అమ్మాయి కన్యత్వం కొల్లగొట్టాడో అతనే ఆ అమ్మాయికి భర్త. ఆ విధంగా యూరప్‌లోని పశుపోషక వ్యవస్థకి చెందిన దిమ్మరులు అమ్మాయిలని పెళ్లాడేవారు.




ఐర్లాండ్‌కి చెందిన నాటు వైద్యులు మధువులో తేనె కలిపి తాగించేవారు. ఇది వైద్యంగా పనిచేస్తుందని వారి అభిప్రాయం. అంతేకాదు, ఇలా మధువులో తేనె కలుపుకుని తీసుకుంటే వారిలో శృంగారవాంఛ పెరుగుతుందని కూడా నమ్మేవారు. అలాగే పున్నమిరేయి శృంగారాన్ని పండిస్తుందని భావించేవారు లేకపోలేదు. ఈవిధంగా హనీ పక్కన మూన్ చేరి హనీమూన్ అయ్యింది.

కొన్ని ఆఫ్రికన్ తెగల్లో ట్రయల్ మ్యారేజ్ పేరిట అమ్మాయి, అబ్బాయి పెళ్లి చేసుకుని ఓ నెలరోజులపాటు కలిసుంటారు. వీరిద్దరికీ పొసుగుతుందో లేదో పరీక్షిస్తారు. ఈ ట్రయల్ మ్యారేజ్ కూడా ఒకరకంగా నార్డిక్ జిప్సీలు అమ్మాయిని ఎత్తుకెళ్లడంలాంటిదే.

స్కాండినేవియన్స్ కొత్తగా పెళ్లైన జంటతో మద్యంలో తేనె కలిపి తాగిస్తారు. పెళ్లైన తొలి నెలరోజులు ఒకే గ్లాసులో భార్యాభర్తలిరువురు తేనె కలిపిన మద్యం తాగాలి. ఇలా చేస్తే వారి సంసారంలో సరిగమలు పలుకుతాయని వారు విశ్వసించేవారు. ☆

# ఏరిన ముత్యాలు

* ఏ పనీ చేయకుండా తటస్థంగా వుండడం అనేది బలహీనతకి బలమైన నిదర్శనం.

– మహాకవి కాళిదాసు

* పట్టుబట్ట కట్టడమే కాదు ధర్మం కొరకు పట్టుబట్టి నిలబడాలి.

– విదురుడు

* కులం ఏదైనా ప్రశస్తమైన పని చేసినవారే ప్రసిద్ధులై కీర్తివంతులౌతున్నారు.

– రాజాజీ

* దైవాన్ని ఏ పేరుతో, ఏ రూపంతో పూజించినా అది దైవత్వం తాలూకు మౌలిక సూత్రానికి నిరూపణ.

– మహాకవి కాళిదాసు

* వీలైనంత ఉపకారం చేస్తూ పరులకి సహకరించడంలోనే జీవన పరమార్థం వుంది.

– స్వామి దయానంద సరస్వతి

* ఆలోచించకుండా మాట్లాడడం అనేది గురి చూడకుండా తుపాకీ పేల్చడం అవుతుంది.

– హజ్‌లిట్

* ఎలాంటి సాక్ష్యం లేకుండా వున్నప్పుడు ప్రదర్శించిన సాహసమే సాహసం.

– లారోచ్ ఫొకార్డ్

* కఠోర శ్రమకి ప్రత్యామ్నాయం లేదు.

– మహాకవి కాళిదాసు

* ఉత్తమమైనదానిని తప్ప మరోదానిని స్వీకరించను అనగల్గడం జీవితపు అద్భుతంగా చెప్పొచ్చు.

– సోమర్‌సెట్ మామ్

* మహాత్ములను తూలనాడేవాడు పాపి. అయితే ఆ అవాకులు, చెవాకులకు మరింత ఉత్తేజమొందేవాడు మహాపాపి.

– మహాకవి కాళిదాసు

* కొత్తవారితో స్నేహం చేసుకోండి. కానీ పాతవారిని వదలకండి.

– మొరార్జీ దేశాయ్

* మంచికి కట్టుబడివుండే సామర్థ్యాన్ని పెంపొందించేదే అసలైన చదువు.

– మొరార్జీ దేశాయ్

* మనకి ఏదైతే ప్రతికూలం అనిపిస్తుందో, దానిని ఇతరుల విషయంలో ఆచరించకూడదు.

– వ్యాస మహర్షి

సేకరణ: శివప్రసాద్ పండా

# 'సుజలాం సుఫలాం' పై సమీక్షలు

ఫిబ్రవరి చతురలో ప్రచురితమైన పొరుపల్లి వెంకటేశ్వరరావు నవల
'సుజలాం సుఫలాం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు



## సుజలంతో సుఫలం

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

'సుజలాం సుఫలాం' నవలా రచయిత వీరవరం ఒక ఆదర్శగ్రామంగా రూపుదిద్దుకోవటానికి ఔన్నత్యంగల బ్రహ్మానాయుడి పాత్ర సృష్టించి సఫలీకృతులయ్యారు.

గ్రామాభివృద్ధికై తపించే హృదయం, వ్యవసాయరంగాన్నున్న పరిజ్ఞానం, తెలుగు భాష మీదున్న అభిమానం, కర్రసాము,

వ్యాయామం వలన వచ్చే లాభం, గ్రంధాలయాల విశిష్టత, రైతు కుటుంబాలలోని స్త్రీ పురుషులు విద్యావంతులై వుండాలనే ఆకాంక్ష, ఎంత చదువు చదివినా తమ ఊరిని మరవక బాగుచేసుకోవాలనే తలపు, కుళ్లు రాజకీయాలని కూల్చడానికి గ్రామస్తులు సంఘటితం అవ్వాలనే సలహా, అభాగినులను ఆదుకునే సహృదయం, వ్యక్తిత్వం నిలుపుకునే తత్వంగల విశిష్టమైన పాత్రలని సృష్టించి, ఆ పాత్రలలో స్నేహభావాన్ని పెంపొందించి ఓ ఆదర్శ గ్రామం ఏర్పడటానికి, ఎవరి పాత్ర ఎంతవరకు అనే విషయాన్ని స్పష్టంగా తెలియపరిచారు.

హింసాప్రవృత్తి కాకుండా, ఆశయపథంలో కథ నడిపించారు. యువకిశోరాలు విజయసారథి, భార్గవ, రవీంద్ర, సదానందం పాత్రలని ఆదర్శనీయంగా మలచి మమత, సమత, మానవతలని సమపాళ్లలో రంగరించి వారికి తగినవారిగా అనూరాధ, ఉషాబాల, సునంద, సావిత్రి పాత్రలు రూపొందించారు.

బాలాజీ లాంటి కుతంత్ర రాజకీయాలని నడిపేవారిని ఖైదుచేయించి సామాన్య ప్రజానీకానికి ఆశాదాయకంగా కథని మలచారు.

గ్రామాభివృద్ధికి ప్రభుత్వం, ఆ గ్రామస్తులు, ప్రభుత్వ ఉద్యోగులు పాటుపడాలనే తపన అడుగడుగునా కనిపించింది. వివాహం ఆర్భాటంగా కాకుండా, వధూవరుల ఇష్టానుసారం జరగాలనే అభ్యుదయం చూపారు. సుజలాలు సమకూర్చుకుంటే సుఫలాలు పొందగలమనే విషయాన్ని చక్కగా అందించారు. మొత్తానికి పల్లె జీవితానికి అద్దం పట్టినట్టుంది.

– మోచర్ల రామలక్ష్మి
హైదరాబాదు

## స్ఫూర్తిదాయకం

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

'చతుర' మాసపత్రిక నెలనెలా ఒక ఆణిముత్యాన్ని అందిస్తున్నట్లే ఈ నెల అందించిన మేలిమి ముత్యం 'సుజలాం సుఫలాం'. పేరులాగే కథ, కథలో గమనించే విషయాలు అద్భుతంగా వున్నాయి. అయితే రచయిత పేరు కొత్తగా వుండటమే కాకుండా శైలి, కథనం కూడా కొత్తవిగా వుండి అవసరం లేని చోట్ల కూడా పాత్రలు, వాళ్ల పేర్లు ప్రవేశపెట్టి ఒక విషయాన్ని పదేపదే చెప్పటం జరిగింది. అయితే నవలలో విషయం మాత్రం ఎంతో స్ఫూర్తిదాయకంగా, మార్గదర్శకంగా వుంది. ముఖ్యంగా బ్రహ్మానాయుడు, విజయసారథి, భార్గవ పాత్రలు ఎంతోమందికి స్ఫూర్తిదాయకంగా వుంటాయనటంలో సందేహం లేదు. రచయిత చివర్లో చెప్పినట్లు ప్రతి మనిషీ సారథి, భార్గవలాగ నిజాయితీగా తమ బాధ్యతని నిర్వహిస్తే ప్రతీ కర్షకుడూ బ్రహ్మానాయుడిలాగ ఆదర్శవంతంగానూ చక్కటి పద్ధతులతో, ప్లానింగ్‌తో వ్యవసాయం చేస్తే రాష్ట్రంలో కరవు అనే పరిస్థితి రాదు.

నవలలో ముఖ్యమంత్రిలాగ మన మంత్రులు కూడా పల్లెల్లో రైతులకి తగిన సహకారం అందజేస్తే రైతులు తమ వృత్తులు మాని వలసపోయే పరిస్థితి రాదు. అన్నపూర్ణలాంటి ఆంధ్రప్రదేశ్, స్వర్ణాంధ్రప్రదేశ్ కావాలంటే ప్రతీ గ్రామ ప్రజలు, రైతులు నవలలో చెప్పినట్లు ఆచరిస్తే గ్రామాలు, అలాగే రాష్ట్రాలు, చివరికి దేశం కూడా సుసంపన్నంగా 'స్వర్ణభారతి'గా అవతరిస్తుంది. రచయిత ఈ నవల ద్వారా




వ్యవసాయ పద్ధతులు, పనిముట్లు, వ్యవసాయపనుల పేర్లు అన్నీ ఎంతో వివరంగా, తెలియనివారు తెలుసుకునేవిధంగా అందించారు. ప్రతిఒక్కరూ చదవతగ్గ నవల.

*– జీడిగుంట ఉషారాణి*

*సిరిపూర్ కాగజ్‌నగర్-504 296*

## వాస్తవ భారతం

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

'వందేమాతరం...' గీతాన్ని తలపింపచేసే చక్కటి టైటిల్ 'సుజలాం సుఫలాం' ఈ నవలకి ప్లస్ పాయింట్. నామౌచిత్యం కలిగిన కథ చదువరులకు హాయిని కలిగిస్తుంది. వాస్తవ భారతాన్ని చూడాలంటే గ్రామాలనే చూడాలన్న గాంధీగారి మాటలు ఆదర్శంగా గ్రామీణ వాతావరణ నేపథ్యంలో సాగిన ఒక ఆదర్శగ్రామ చరిత్ర ఈ నవల.

యువ పాత్రలున్నప్పటికీ బ్రహ్మానాయుడి పాత్ర ముందు అవన్నీ వెలవెలబోతున్నట్లే వున్నాయి. నీటి వనరులని పుష్కలంగా ఏర్పరచుకోవడంలో ఆయన తెలివితేటలు, ముందుచూపు, హరిజనుడైన సదానందం చేత 'నాన్నగారూ' అని పిలిపించుకోవడంలో ఆయన హృదయౌన్నత్యం, కామాంధులకు బలయిపోయిన సావిత్రికి అండగా నిలబడడంలో ఆయన పెద్దరికం, సునందకి న్యాయం చేయడంలో సమదృష్టి గోచరమవుతాయి. గ్రామపెద్దలు, నాయకులు ఎలా వుండాలో చూపిందీ కథ.

సారథి, భార్గవ, అనూరాధ, ఉషాబాల- అన్ని పాత్రలూ సపోర్టింగ్‌గానే వుండిపోయాయి. సమస్యలకి చాలా సులభ పరిష్కారం లభించడం, శుభం కార్డు వేసినట్లు పెళ్లిళ్లు జరిపించడం పూర్తిగా సినిమాటిక్‌గా వుంది. కలగూరగంపలా పలు కుటుంబాల కథలు, పదేపదే ఫ్లాష్‌బ్యాక్‌లు ఈ నవలకి బ్యాక్‌డ్రాప్‌లు. పెళ్లి మంత్రాలని త్రిపురనేని వారు తెనిగించారనే సంగతి చాలా థ్రిల్లింగ్‌గా అనిపించింది. తెలుగులో పెళ్లి ప్రమాణాలు, సప్తపదికి చక్కని వ్యాఖ్యానంతో ముచ్చటైన ముగింపునిచ్చారు రచయిత.

*– చాడ సుజాత*

*నోయిడా*

## అసంతృప్తి

*(నాలుగవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

**1980**సంవత్సరం తర్వాత పల్లెల్ని కుటిల రాజకీయాలు, అతి తెలివి, ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు ఈజీ మనీ సంపాదన, పెద్దలపట్ల పిన్నల అవిధేయత, అకృత్యాలు వగైరాలు భ్రష్టుపట్టించినట్టు 'సుజలాం సుఫలాం'ని అత్యధిక పాత్రలు, పదేపదే ఉచ్చరించిన నమస్కార పదం, వారింటికి వీరు - వీరింటికి వారు రావడం పోవడంలు నవల పురోగతికి సహకరించలేదు సరికదా అసహనం తెచ్చి అనాసక్తిని రేకెత్తించడమే కాదు చక్కటి, చిక్కటి గ్రామీణ నవలాంశాన్ని కుదించేసిందని బాధ కలిగింది. సంభాషణలు, సన్నివేశాలు, సంబంధ బాంధవ్యాలు, సంఘటనలు రక్తికట్టక విజయసారథి, భార్గవల ఆశయ కృషి సాధనలు తేలిపోయాయి. పరిమిత పాత్రలతో, పట్టుగల సంభాషణలతో కొన్ని బలమైన సన్నివేశ సంఘటనల చుట్టూ నవలని నడిపితే నవలా

మకుటం సార్థకమై పఠితల్ని అలరించేది. ఎందుకంటే పల్లెసీమ కథావస్తువుగా వున్న నవల, సినిమా ఎప్పుడూ ఆకట్టు కుంటాయి. అందుకు తగ్గ పాత్రల చిత్రణ, బరువైన సంఘటనలు. కొద్ది పాత్రలు, పల్లె చమత్కార సంభాషణలు కూడా సంధించి రాస్తే పాఠకులు పుస్తకం వద లరు, మర్చిపోరు. నవలారంభం బాగున్నా తర్వాత తర్వాత అధిక పాత్రల రాకపోకలు, సాదాసీదా సంభాషణలు, సంఘటనలు నవలని పైకెత్తక కిందికి నెట్టేశాయి. కనుకనే రచయిత గ్రామీణ నవల రాసి కూడా కనీసం 'ఫరవాలేదు' అనిపించుకోలేకపోయారు.

— సి హెచ్. వేణుమోహనరావు

ఏలూరుపాడు

## తిరిగి గ్రామాల్లోకి

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'గ్రామాలకి తరలండి. భారతదేశం గ్రామాల్లోనే నివసిస్తోంది' అన్న గాంధీ గారి మాటల స్ఫూర్తితో రాసిన నవల ఈ 'సుజలాం సుఫలాం' అనవచ్చు. ఈ నవ లలోని పాత్రలు పట్టణాలలో చదివినా పల్లెవాసనలు మరవనివారు. సారధి పాత్రని రచయిత ఎంతో చక్కగా మల చారు. యాంత్రిక వ్యవసాయ పద్ధతులు, వ్యాపారసరళిలో వ్యవసాయం చేసే ఈ రోజుల్లో, సాంప్రదాయ పద్ధతులు, ముఖ్యంగా అరక దున్నడం, సాళ్లువే యడం, ఎద పెట్టడం లాంటి పద్ధతులు సారధితో చేయించి నగరాలకి తరలివెళ్లే రైతులకి కనువిప్పు కలిగించారు.

పాత్రల చిత్రణ సాదాసీదాగా వుంది. నడిపిన తీరు విలక్షణంగా వుంది. భేష జాలు లేకుండా సంఘటనలు వివరిం చారు. సదానందం బ్రహ్మానాయుడుగారి కుటుంబంతో కలసిపోవడం పెద్దల విశా లభావాలకి చక్కని తార్కాణం. సమకా లీన రాజకీయ ధోరణులు. బాలాజీలాంటి అక్రమార్కుల చర్యలని నిజాయితీగల ఉద్యోగులు ఎదుర్కొని జయం సాధిం చడం రచయిత హృద్యంగా చిత్రించారు.

వీరవరం గ్రామం ఆదర్శగ్రామంగా మలచబడ్డ తీరు బాగుంది. సారధి, భార్గవ, కమల, అనూరాధలాంటి యువ తీయువకులు ఏ పల్లెనైనా తీర్చిదిద్దగ లరు. అందరికీ అన్నా హజారే ఆదర్శం. నిజానికి గ్రామ సౌభాగ్యం యువతమీదే ఆధారపడివుంది. ఆద్యంతం నవల బాగుంది.

*— కంఠంనేని కుటుంబరావు*

మోపిదేవి - *521125*

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78